ఉచ్చిలోల్లు / ఉచ్చిడోల్లు = ఎంగిలి తినే బానిసలు. చిల్లర మనుషులు
ఉట్టిగ, ఉత్తగ, ఉత్తిగ, ఉత్తుత్తగ = ఊరికినే, ఉచితంగా
ఉడాన్ = కర్రసాములో ఎగరడం
ఉడాయించుడు = తప్పించుకుపోవడం
ఉడిగిపోవుడు (కాయలు) = ఎండి కృశించిపోవడం
ఉడుక పెట్టుకునుడు = వండుకోవడం
ఉడుకు = వేడిమి
ఉడుకు నీల్లు = టీ, వేడినీళ్ళు
ఉడుకుడు, ఉడుకపోసుడు = ఉక్కపోయడం
ఉడుకునెత్తురుమీదున్నోల్లు = పడుచు పిల్లలు
ఉతారు = దిగుడు, పల్లం, బ్రాట్ ఫార్వర్డు ?
ఉత్కం = నీళ్ళు
ఉత్తబద్రయ్య = ఎందుకూ కొరగానివాడు
ఉత్తమన్నిగాదు = గర్భిణి స్త్రీ
ఉత్తరిచ్చుడు = మాటకదపడం, ప్రత్యుత్తరం యివ్వడం
ఉదార్ = ఉద్దెర, అరువు
ఉదార్నం = ఉదాహరణ
ఉద్దరిచ్చుడు = ఉద్ధరించడం
ఉద్దార్కం = ఉద్ధారం, ఉద్ధరణ, అభివృద్ధి
ఉద్దునూర్తంగ = ఉత్తపున్నేనికి
ఉద్దెం = యుద్ధం
ఉద్దెర = అరువు
ఉన్క = ఊక
ఉన్క మీది రోకలి లెక్క ఎగురుడు = ఎగిరెగిరి పడడం. ఊకదంపుడు
ఉన్న జమగాదు లేని జమగాదు = లెక్కలోకి రాని పరిస్థితి
ఉన్న మారాజులు = సంపన్నులు
ఉన్న మారాజులు లేని మారాజులు = ధనికులు, బీదలు
ఉన్నోడు లేనోడు = ధనిక, పేదలు
ఉపశాంతి కోసం = ఉపశమనం కోసం
ఉపాసం = ఉపవాసం, పస్తులు
ఉప్పరిపని = మట్టి తవ్వడం, మోయడం లాంటి పనులు
ఉప్పసో వూరటో = పిచ్చాపాటీ, మనసు తేలికపడే కబురులు
ఉప్పాసు = ఉప్పు, పసుపు, కారం మెత్తగా నూరి పశువుల నాలుకలకు రాసేమందు ( నాలుక శేర్ల వ్యాధికి )
ఉప్పు పుట్టక పోవుడు = పరపతి లోపించడం
ఉప్పుంటె పప్పుండది - పప్పుంటె వుప్పుండది = ఉప్పు అంటే ఊరగాయ ఉండదు
ఉప్పుకారం దిన్న శరీరం = చీమునెత్తురున్న శరీరం ( కామక్రోధాదులు తప్పనిసరి )
ఉప్పుడు = బాధపెట్టడం ( ఉడకబెట్టడం ), పిండి ఉప్పడం
ఉప్పుడు ఉపాసం = ఉపవాసాలు
ఉప్పుడు పిండి = ఉప్మా
ఉప్పుడు బియ్యం = బాయిల్డ్ రైస్
ఉప్పుతో తొమ్మిది పప్పుతో పది = సంసారం గడవడానికి చాలా వస్తువులు కావాలని చెప్పడం
ఉప్పుపేరుడు = పచ్చళ్ళలో ఉప్పుపేరడం, శరీరంపైన బట్టలపైన చెమట పేరుకు పోవడం.
ఉప్పుప్పు = ఉప్ప
ఉప్పలం = పుట్టగొడుగు ( ఉప్పలం యింట్లో మొలిస్తే ఏదో ఉపద్రవం వచ్చినట్లు భావిస్తారు. ఉపప్లవం, లేదా విప్లవం లోంచి ఈ పదం రావచ్చు)
ఉబ్బరిచ్చుడు = ఉక్కపోవడం
ఉబ్బు = ఊబ, ఉత్కంఠ, ఊబి, గర్వం, ఉబలాటం
ఉబ్బు ఆగక = ఉండబట్టలేక
ఉబ్బుడు = వాయడం, ఉబ్బిపోవడం
ఉమ్మగిల్లుడు = అన్నం క్రమంగా ఉడకడం
ఉమ్మయ్య జక్కయ్య = దారినపోయే దానయ్య ( ఎవరు పడితే వారని )
ఉమ్మర్ (అ) = వయస్సు
ఉమ్మిరి మీదుండుడు = తీవ్రంగా వుండడం ( ఉమ్మర్ - వయస్సుమీద వుండడం )
ఉర్రగ్గ = గట్టిగ ? ఒరవడిగ ?
ఉర్కుడయ్యారోల్లు = దాదాపు పరుగెతుతున్నట్లు నడిచే శ్రీ వైష్ణవులు, తొందరపడేవారు
ఉర్కుడు = పరుగెత్తడం
ఉర్కులాట = హడావుడి, ఉరుకులు పరుగులు, ఉబలాటం
ఉర్కులాడుడు = మిడిసిపడడం
ఉర్సు = మహమ్మదీయ గురువుల సమాధుల వద్ద జరిపే జాతర

ఉర్సుడు = ఇల్లు కురవడం
ఉలిపికట్టె = నారుమళ్లలో గడ్డిని వేరుచేసే పనిముట్టు
ఉలుకులేదు పలుకులేదు = ఉలుకూపలుకూ లేదు
ఉల్కిపడుడు = ఉలిక్కిపడడం
ఉల్టకర్చులు = అనవసరమైన పనికిరాని ఖర్చులు
ఉల్టపల్ట = తారుమారు
ఉల్లాసం = ఉత్సాహం
ఉల్లిగడ్డలు = ఉల్లిపాయలు
ఉల్లిగడ్డ శాస్త్రం = ఒజ్జల పుచ్చకాయ, పరాయివాళ్ళకి చెప్పి తాను ఆచరించని శాస్త్రం
ఉల్లుల్లు = వదులొదులు
ఉల్లో = పండ్లు అమ్మటానికి ముందు వాడే పదం
ఉశ్నార్ (ప) = చురుకైన తనం, తెలివి తేటలు, హుషార్
ఉస్కెల ఉచ్చపోసినట్లు = చేసిన మేలు మరిచినట్లు వ్యర్థం కావడం
ఉసుకులగా = ఉసిగొల్పడం, ఉస్కో లగావ్ ? (కుక్క మొ॥ వాటిని )
ఉసురుపోసుకునుడు = చాల కష్టపెట్టడం
ఉసుల్ల పుట్ట = కాణాచి
ఉసూల్ = పద్ధతి
ఉస్కె = ఇసుక
ఉస్కె ఉడికినట్లు = అట్టుడికినట్లు
ఉస్కెటెక్క = కోకో
ఉస్కొ అనుడు = ఉసిగొల్పడం ( కుక్క మొ॥ వాటిని )

## ఊ

ఊ అనక ఉప్పూరాయి అనక = ఏమీ అనక, మాటకు బదులివ్వక
ఊ లేదు ఆ లేదు = ఏమీ లేదు
ఊం, ఊము = ఉమ్మి, ఉమ్ము
ఊంచుడు = ఉమ్మివేయడం
ఊకుంచుడు = ఓదార్చడం
ఊకుండబుద్ధిగాక = ఉండబట్టలేక
ఊకుడు, ఊడ్సుడు = ఊడ్వడం, చిమ్మడం
ఊకూకె = మాటి మాటికి
ఊకె = ఊరికే, మాటిమాటికి
ఊగుడు = సమ్మతించడం
ఊగులాట = ఊగిసలాట ( ఎంతకాలం ఈ ఊగులాట ? )
ఊగులాడుకుంట వచ్చుడు = రిక్త హస్తాలతో వేలాడేసుకుని రావడం
ఊడిగెం = చాకిరి
ఊదరపట్టుడు (కడుపంతా ) = కడుపంతా బిగుతుగా వుండడం
ఊదు = సాంబ్రాణి
ఊదుగాలది పీరిలెవ్వది = ఏ పనీ కాదు అని చెప్పడం
ఊదురుగొట్టం = పొయ్యి ఊదే గొట్టం
ఊదువత్తి, ఊదుబత్తి = అగరువత్తి
ఊప = కోడె
ఊపిరిపట్టింది = గుక్కపట్టింది (పిల్ల)
ఊపుడు (తల) = తల పంకించడం ( తల కంపించడం అయి వుంటుంది )
ఊబపోతు = చూపుల గుర్రం లాంటిది
ఊబిద్దార్లు, ఊబుద్దార్లు = విభూతిదారులు, శైవులు
ఊబ్బుండలు = విభూతి ఉండలు, కోడిగుడ్లు
ఊరపిశ్కె = ఊరు పిచ్చుక
ఊర పిశ్కె పానం = అల్పప్రాణం, అక్కుపక్షి ప్రాణం
ఊరా ? అడివా ? (ఇది) = సరైన న్యాయం జరగనప్పుడు అనే మాట
ఊరిచ్చుడు = ఊరించడం
ఊరిమొకం జూల్లేదు = ఊరికి తిరిగి వెళ్లలేదు
ఊరియ = యూరియా
ఊరు దిర్గుడు = ఊరేగింపు
ఊరుమీద ఊరు వడుడు = ఇక్కడి సూర్యుడు అక్కడ పొడవడంలాంటి వాక్యం ( మిన్ను విరిగి మీద పడడం ; వాడు ఊరు మీద ఊరు పడ్డా తాగుడు మానడు )
ఊరు మీద పడుడు = యథేచ్ఛగా తిరగడం ( ఆంబోతులాగా )
ఊరుగాని పొంతెంగాని = ఊరూ ప్రాంతంగాని
ఊర్లకు శని జుట్టుకునుడు = ఊళ్ళకు ఊళ్ళు పాడయిపోవడం
ఊర్సుక తినుడు = గిన్నెలోంచి మొత్తం (ఊరిచి) ఊడ్చుకు తినడం

ఊల్‌దారం = ఉన్నిదారం
ఊల పెట్టుడు = ఆశపెట్టడం, మొదలు పెట్టడం
ఊసబియ్యం = పచ్చిపచ్చజొన్నలు ఉడకబెట్టడం, ఊచలనుంచి రాల్చిన పచ్చి జొన్నలు వేపుకొన్నవి
ఊసిపోవుడు = ఊడిపోవడం
ఊసిళ్ళు = ఉసిళ్ళు
ఊసులు = కళ్లకు కట్టిన ఊసులు

## ఋ

ఋ = అరు, (ఋ అనే అక్షరాన్ని ఆంధ్రలో అరు అంటారు )
ౠ = అరూ

## ఎ

ఎంకయ్య = వెంకయ్య ( వెనకయ్య, వినాయకయ్య)
ఎంకయ్య అడుగులు = వినాయక చవితినాడు ఇంట్లోకి గణపతి నడిచి రావడానికి సున్నం, జాజులతో వేసే గుండ్రని గుర్తులు
ఎంకయ్య పండుగు = వినాయక చవితి
ఎంకులాడుడు, ఎనుకులాడుడు = నెమకడం, వెతకడం
ఎంగిలి పూలు = మహాలయ అమావాస్యనాటి బతుకమ్మ పూలు, ఇవి బతుకమ్మ పండగ మొదటి రోజువి
ఎంగిలిమంగలం = అంతా ఎంగిలిమయం చేయడం
ఎంటపడుడు = వెంబడించడం, వెంట పడడం
ఎంటికంతల, ఎంటికె మందంల = వెంట్రుకవాసిలో
ఎంటికలు తీసుడు = కేశఖండనం
ఎంటికె తోటి సమానం = పెద్దగా లెక్కలోకి రానిది
ఎంటికె పోసలు = తలవెంట్రుకలు
ఎంటికెలు తెల్లపడుడు = వెంట్రుకలు నెరవడం
ఎంటికెలు రాలగొట్టుడు (నెత్తి) = చాలా తిప్పలు పెట్టడం
ఎంటు = వెంటు
ఎండ ఉమ్మిరి తగ్గుడు = ఎండల తీవ్రత తగ్గిపోవడం
ఎండ కొర్రాయోలె కొట్టుడు = ఎండ చంద్ర నిప్పులు చెరగడం
ఎండపొడుపు = సూర్యోదయం
ఎండతాపం = ఎండ తీవ్రత
ఎండ దెబ్బతాకుడు = వడదెబ్బ తగలడం
ఎండపండు తినుకుంట వచ్చుడు = మంచి ఎండలో రావడం
ఎండపూట = మధ్యాహ్నం
ఎండపొడ = లేయెండ, నీరెండ
ఎండపొడుపుకు కూసునుడు = పొద్దటి పూట ఎండకాగడం
ఎండలు ముదురుడు = ఎండలు మండి పోవడం
ఎండ సుర్రుమనుడు = ఎండలు మండి కాళ్ళు చుర్రుమనడం
ఎండుకపోవుడు = కృశించడం
ఎండుగు = ధాన్యం ఎండబెట్టిన ప్రాంతం
ఎండేసుడు = బట్టలు ఆరవేయడం
ఎండ్రికాయ = పీత, ఎండ్రి
ఎండ్ల = ఎందులో
ఎంతగనం = ఎంతవరకు, ఎంతఘనం
ఎంతల = ఎంతలో
ఎంతలేదన్నా = కనీసం, అధమపక్షం
ఎంబడి = వెంట
ఎంబడే = వెంటనే
ఎంబేరు సామి = రామానుజుడు
ఎకలెకలు = వెకిలి వెకిలి
ఎక్క, ఎక్కా = ఆసు (చీట్ల పేకలో), దీపం
ఎక్కడ కానోల్లను చేసుడు = ఎటూకాని కొరగాని వాళ్లను చేయడం
ఎక్కడ పొందది = ఎక్కడా స్థిరంగా వుండదు
ఎక్కడికి పోయినా ఏడే మాన్కలన్నట్లున్న బతుకు = దేనికీ సరిపోని దరిద్రపు బ్రతుకు
ఎక్కిచ్చి చెప్పుడు = ఉన్నవీ లేనివీ కల్పించి, పురి ఎక్కించి చెప్పడం
ఎక్కిరిచ్చుడు = వెక్కిరించడం
ఎక్కిల్లు పట్టలేదు (వానికి) = అవసరంలేదు
ఎక్కువల ఎక్కువ = గరిష్టంగా
ఎక్కువలు తక్కువలు = హెచ్చుతగ్గులు
ఎక్కెక్కి ఏడ్సుడు = వెక్కి వెక్కి ఏడ్వడం
ఎక్బాల్ డిగ్రి = ఒప్పందపత్రం ( భూమి తాలూకు), కోర్టు ద్వారా రాసుకునేది

ఎక్రార్‌నామ = ఒప్పందపత్రం ( భూమి తాలూకు
ఎక్సర్ = ఎక్కువ ? ఎక్సెస్ ?
ఎగదోసుడు = ఉసిగొల్పడం
ఎగబెట్టుడు = కుక్క మొ॥ వాటిని ఉసిగొల్పడం, అప్పు తీర్చకపోవడం
ఎగవడుడు = కొట్లాడడం
ఎగవోసుడు = తూర్పారబట్టడం
ఎగిరిపడుడు = మిడిసిపడడం
ఎగిర్తపడుడు = వేగిరపడడం
ఎగిలివారంగ = తెల్లవారగా ( ఎగిలివారంగ, ఎలుగువారంగ, వెలుగు వారంగ, వెలుగు పారంగ )
ఎగుడు = పేలడం ( బాంబులు మొ॥ నవి ) మోగడం
ఎగుసం, ఎవుసం = వ్యవసాయం
ఎగేసుడు = చెడుపనులకు ప్రోత్సహించడం, ఉసిగొల్పడం
ఎగ్గొట్టుడు = ఎగనామం బెట్టడం (బడికి, బాకీకి)
ఎగ్గిలి ఎగ్గిలి చేసుడు = వెడ్డిపనులు చేయడం
ఎగ్గిలి పోరి = వెడ్డిపిల్ల
ఎగ్గులేదు సిగ్గులేదు = ఎగ్గూ సిగ్గూలేదు
ఎగ్గెలి తనం = వెకిలితనం
ఎచ్చమ్మ = యశోదమ్మ
ఎచ్చాలు = కూరలకు, ఔషధాలకు, ఊరగాయలకు కావల్సిన మసాలా దినుసులు
ఎచ్చి పచ్చి చేసుడు / అవుడు = అన్నం, ఎచ్చాలు, మొ॥ వి ఉడికీ ఉడక్క వేగీవేగక పోవడం. (కాస్త ఉడికించిన, వేపిన కారణంచేత హెచ్చి మరికొంత ఉడకని, వేపని కారణంచేత పచ్చి అవడం )
ఎచ్చుడు = ఊరు, మంద మొ॥ వి హెచ్చడం, వృద్ధికావడం
ఎచ్చుతచ్చులు = హెచ్చుతగ్గులు
ఎచ్చులు = పెగ్గెలు
ఎటమటం = కిందుమీదుకావడం
ఎటు = ఎక్కడికి
ఎటువెట్టి, ఎటుదిరిగి = ఏదీ ఎట్లయినా,
ఎట్టి = వెట్టి
ఎట్టోల్లు = వెట్టిపనివాళ్ళు, ( సుంకరులు )
ఎట్ల = ఎలా
ఎడపిల్ల = పాలు త్రాగేపిల్లకన్నా పెద్దపిల్ల

ఎడాల్పు, ఎల్పు, ఎల్మ = వెడల్పు
ఎడ్డికాలం = తెలివిలేని కాలం. అభివృద్ధి కాని కాలం
ఎడ్డిచ్చుడు = వెక్కిరించడం
ఎడ్డిజనం = తెలియని జనం
ఎడ్డిపోరగాండ్లు = కల్లాకపటం తెలియని వాళ్ళు
ఎడ్డిమొకం = తెలియనివాడు
ఎడ్డిర్కం = మోమాటం, కల్లాకపటం, కళంకం
ఎడ్డెం అంటె తెడ్డెమంటడు, తెడ్డెమంటె ఎడ్డెమంటడు = ఈదాడంటే కోదాడనడం, ఎతి అంటే మతి అనడం
ఎడ్డెక్కిరి తనం = వెడ్డిగానూ, వెక్కిరింతగానూ వుండే అమాయకత్వం
ఎడ్లు = ఎద్దులు
ఎత = వెత
ఎతలేదు కతలేదు = ఏ విషయమూ అక్కరలేని స్థితి
ఎత్తికోలు మొత్తికోలు = దారిద్ర్యవస్థ
ఎత్తిచ్చుడు = పెళ్లి వరుడింట్లో జరగడం
ఎత్తిపోవుడు = తప్పిపోవడం ( బస్సు మొ॥నవి )
ఎత్తు = సమానం
ఎత్తుకచ్చుడు = దొంగిలించి తేవడం
ఎత్తుకపోవుడు = శవాన్ని తీసుకెళ్లడం, దొంగిలించడం
ఎత్తుకు దగ్గ చిత్తు = ఒడ్డూ పొడుగూ బావుండడం ( ఎత్తుకు దగిన చిత్తు, చెత్త (శరీరం), చిత్ కావచ్చు)
ఎత్తుకునుడు దించుడు = పొగడ్డం తెగడ్డం
ఎత్తుకెత్తు = సరికి సరి
ఎత్తుగట్టుడు = త్రాసు సమానంగా లేకపోతే బరువు వేసి లేదా తీసి సమానం చేయడం
ఎత్తుగడ = ఉపాయం
ఎత్తుగడ్డ, ఎత్తుబోరు = ఎగుడు
ఎత్తుడు = విషయాన్ని ప్రస్తావించడం
ఎత్తులు = ఎత్తుగడలు
ఎత్తువంపులు = ఎత్తుపల్లాలు, గతుకులు
ఎత్తేసుకచ్చుడు (దుక్కం) = తన్నుకొని రావడం
ఎత్తేసుడు = కుదపడం
ఎత్నాదీర్గం = ఏత్వం
ఎత్మినాన్‌గ (అ) = హాయిగా, నిదానంగా ప్రశాంతంగా, విశ్రాంతిగా
ఎత్రాజు = అభ్యంతరం (ఇహ్‌త్రాజ్) (అ)

ఎదమీదుండుడు = పశువుల సంభోగేచ్ఛ కలిగి వుండడం
ఎదల = ఎదలో, ఛాతీలో
ఎదుగవుడు (అన్నం) = ఎక్కువ కావడం ( పాతబియ్యం వండినప్పుడు )
ఎదుగుడు = పెరగడం
ఎదురవుడు = ఎదురుగా కనబడడం, భేటీ అవడం, కలవడం
ఎదురిచ్చుడు = తిరుగుబాటు చేయడం
ఎదురిచ్చుడు = పెళ్లి పిల్ల వాళ్లకు కట్నాలు మొ॥నవి ఎదురు యిచ్చి పెళ్లాడ్డం, దేవుని మొక్కును ఇంట్లోనే తీర్చడం.
ఎదురు = తిరుగు ( వానికి ఎదురు లేదు. ఎట్లవడితె అట్ల మాట్లాడుతున్నడు )
ఎదురు బదురు = ఎదురెదురు
ఎదురుంగ = ఎదురుగా
ఎదురుకచ్చుడు = ఏరుకొని రావడం
ఎదురుగడ్డ = ఎగుడు
ఎదురుగాల్ల పుట్టినోడు = అడ్డుపుట్టిన వాడు, కాళ్ళు ముందు బయటికి వచ్చినవాడు
ఎదురు చూసుడు = వేచివుండడం, ఎదిరి చూడడం
ఎదురుజవాబ్ = ప్రత్యుత్తరం
ఎదురెక్కుడు = ఎదురీదుడు
ఎదురొచ్చినోల్లు = కనబడ్డవాళ్లందరు, ప్రయాణంలో ఎదురు వచ్చినవాళ్ళు
ఎదుర్కోల్లు = పెళ్ళిలో మగపెళ్లివారిని ఎదురుకోవడాలు
ఎదులాపురం, ఏదులపురం = ( హుజురాబాద్ ) ఆదిలాబాద్
ఎదువర్దాక = ఎంతవరకు
ఎద్దు ముడ్డి పొడ్సెటోల్లు = (చదువుకోని వారు) వ్యవసాయదారులు
ఎద్దుకెద్దువున్నడు = బాగా పెరిగి వున్నవాడు
ఎద్దుగొట్టుడు, ఎద్దు ఏసుడు (షేర్‌గొట్టుడు) = కోడె వృషణాలను నలగ్గొట్టడం
ఎద్దు మొద్దు = శుంఠ అని అర్థం
ఎద్దెం మద్దెం = కిందా మీదా
ఎనలు = స్త్రీలు ధరించే గుండ్ల మధ్య రాళ్లతో వున్నవి, బంగారంతో చేసినవి మూలలు మూలలుగా వుండేవి
ఎనుగఱ్ఱ = ఇంటిపై కప్పుకి వెన్నులాగా అమరిన కఱ్ఱ
ఎనుగు = కంచె, (వెలుగు - ఎలుగు - ఎనుగు)
ఎన్కకు మఱ్ఱుడు = తిరిగి రావడం
ఎన్కట, ఎన్కటికి = పూర్వం, వెనకట
ఎన్కటి రోజులు = గతకాలం
ఎన్కటి సంగతులు, ముచ్చట్లు = గతించిన విషయాలు
ఎన్కతొక్కులు తొక్కుడు = వెనుకంజ వేయడం
ఎన్కపట్ల వుండుడు = వెన్నుదన్నుగా నిలవడం
ఎన్కముందులాడుడు = తటపటాయింపు
ఎన్కయి ముందరేసుకుని తినుడు = ఏమీలేక అశుద్ధాన్ని ముందర వేసుకొని తినే గడ్డు పరిస్థితి ( తిట్టుపదం )
ఎన్కశిక్క, ఎన్కశిరి = తర్వాత, ఆ వెనుక
ఎన్కులాడుడు = వెతుకులాడ్డం (వెముకులాడుట)
ఎన్కెంబడి ఎన్కెంబడి = వెనకాలే
ఎన్నడు = ఏనాడు, ఏరోజు
ఎన్నీల = వెన్నెల
ఎన్నీల పుల్లలు = ఒకరకం దీపావళి టపాకాయలు
ఎన్నుల = వీపులో
ఎన్నులు = బుట్టలు, పొత్తులు
ఎప్పటిశిప్ప ఎనుగుల్లనే = ఎప్పటిలెక్కనే, ఎప్పటి లానే
ఎమశెర = యముని చెర
ఎముడాల, ఎములాడ = వేములవాడ
ఎముడు = యముడు
ఎమ్మటె = వెంబడే, వెంటనే
ఎయ్యి (అన్నం మొ.వి) = వేయి, వెయ్యి, పెట్టు
ఎరం = చాకలి మొ॥ పనిమనుషులకు పెట్టే ధాన్యాదుల రూపంలోని ప్రతిఫలం
ఎరికే = తెలుసు
(నా) ఎరుకల = (నాకు) తెల్సినంత వరకు
ఎర్కపెట్టుడు = వెంటనే గుర్తించేందుకు వీలుగా గుడ్డలకు మరక పెట్టడం
ఎర్తం = వ్యర్థం
ఎఱ్ఱతేలు లెక్క ఉండుడు = ఎఱ్ఱగా అందంగా వుండడం
ఎఱ్ఱ = వానపాము, ఎర ?
ఎఱ్ఱ వడుడు (మైదాకు) = గోరింటాకు పండడం

ఎర్రగ బుర్రగ = ఎర్రగా అందంగా
ఎర్రగడ్డ = ఉల్లిలో ఎర్రనిది
ఎర్రటి ఎండలు = మండు టెండలు
ఎర్రమన్ను = అల్కుపూతలకు వాడే మన్ను
ఎర్రసాలు వడుడు = ఆకాశంలో వర్ష సూచనలు (చెడుగొట్టువానలవా ? )
ఎర్రికుక్క = పిచ్చికుక్క, వెర్రికుక్క
ఎలాన్ (అ) = ప్రకటన
ఎలిగారం = వెలిగారం
ఎలోల్లు = సుంకరులు
ఎల్కపిల్లోలెపుట్టుడు = పుట్టిన శిశువు, మరీ చిన్నగా వుండడం
ఎల్కలు పడుడు = ప్లేగు
ఎల్గవెట్టుడు = వెలగబెట్టడం
ఎల్గందుల = వెలిగందల ( ఇది ఒకప్పటి కరీంనగర్ జిల్లా కేంద్రం )
ఎల్లడి వడుడు = గుట్టలు అంటుకోవడం
ఎల్గ ఎల్గుడు = వైభవంగా వెలగడం
ఎల్త కట్టెలు = వెదురు కట్టెలు
ఎల్తి = వెలితి
ఎల్మోల్లు = వెలమలు, పద్మనాయకులు
ఎల్ల (సాల్) = (సంవత్సరం) పొడుగూతా, అంతా
ఎల్లం = ఎల్లయ్య
ఎల్లకాలం = ఎల్లప్పుడు
ఎల్లజాలడు = వెళ్లలేకపోతాడు
ఎల్లడి ఎల్లడి అవుడు = చాటు లేక మొత్తం బహిరంగం వెల్లడికావడం
ఎల్లమ్మ (తల్లి) గుడాలు = మొక్కజొన్నలు, అనుముల గుగ్గిళ్ళు (ఎల్లమ్మ దేవత పండుగనాడు చేసుకుంటారు వీటిని )
ఎల్లినోల్లు = ఉన్నోళ్ళు, సాగుతున్నవాళ్ళు
ఎల్లిపాయ కారం = దరిద్రులు ఎల్లిపాయలు చిదిమి వాటితో కలుపుకొనే కారం
ఎల్లుమాను = జరుగుబాటు
ఎల్లెం = వెంటనే, వేగంగా, వైళము
ఎల్లెల్కల = వెల్లకిలా
ఎల్సిపోవుడు = వెలసి పోవడం (రంగు)
ఎల్సుడు = దేవుడు వెలవడం, అవతరించడం
ఎవలంతలవాల్లు = స్వచ్ఛందంగా
ఎవలు = ఎవరు
ఎవలు పున్నెం గట్టుకున్నరోగని = ఎవరు పాపం మూటకట్టుకున్నరో గాని
ఎవ్వారం = వ్యవహారం
ఎవ్వి = ఏవి, ఎయ్యి
ఎస్ల = కుండ
ఎస్పరెస్ = ఎక్స్‌ప్రెస్

## ఏ

ఏంచుడు = లెక్కపెట్టడం, వేయించడం, ఎన్నడం
ఏండ్ల కొద్ది = ఏళ్ళ కొలది, తరబడి
ఏండ్లు = ఏళ్ళు, సంవత్సరాలు
ఏందాక = ఎక్కడిదాకా
ఏంది = ఏంటి, ఏమిటిది
ఏందిరా ? = ఏరా ?
ఏందివయా = ఏంటయ్యా ( ఏంది + అయ్యా లేక ఏంది + భయ్యా )
ఏందో = ఏదో
ఏక్దమ్మున = ఎకాయెకి
ఏక్నిరంజన్ = ఏకోనారాయణ
ఏకమవుడు = కల్సిపోవడం
ఏకమొత్తం = అంతా కలిపి
ఏకాన = అణా ( పైసలు )
ఏకాశి = ఏకాదశి
ఏకుడు ప్యాలాలు = మరమరాలు
ఏకుమేకవుడు = అవకాశం రాగానే బలపడడం
ఏకోనారాయన = ఒంటరివాడు
ఏక్తార = తాంబూర
ఏగిచ్చుడు = వేగడం, బాధలతో వెళ్లదీయడం
ఏగుడు (మూడు) = మూడు గంటలు కొట్టడం
ఏజ్‌బార్ అవుడు = ఉద్యోగాదులకు వయోపరిమితి దాటడం
ఏడ = ఎక్కడ
ఏడాకులు ఎక్కువ సదువుకునుడు = ఒకరికన్నా మరొకరు తెలివిలో మించి పోవడం
ఏడాద్దినం, యాడాద్దినం = సంవత్సరీకం
ఏడిండ్ల పిల్లికూనోలె తిర్గుడు = అనేక కష్టాలు పడుతూ పిల్లలను సాకడం, దయనీయంగా తిరగడం
ఏడుపు ఏదో నేను ఏడుసుడు (నా) = (నా) బతుకేదో నేను బతకడం
ఏడుపు గొట్టోడు, ఏడుపు మొకపోడు = ఎప్పుడూ ఏడిచే వాడు

ఏడ్సి మొత్తుకున్నట్లు = దరిద్రం కొట్లాడినట్లు
ఏతులు = పెగ్గెలు
ఏతువు = హేతువు
ఏదో ఒకటి దొల్పిచ్చుకుని పోవుడు = ఎలాగోలా నెట్టుకురావడం
ఏనంగనో = ఎక్కడినుండో
ఏనిగ = ఏనుగు
ఏనుకునుడు = నాటిన మొక్కల వేళ్ళూనుకొనడం
ఏన్గు తొండమంత దొడ్డుగ వానవడుడు = కుంభవృష్టి
ఏన్గెక్కినంత సంబరం = అంబారీ మీద ఊరేగినంత సంతోషం
ఏపాటి (వున్నయి) (బాకీలు మొ॥నవి) = ఎంత మొత్తంలో (వున్నాయి)
ఏమది, ఏమదే ? = ఏంటి ?
ఏమిటోల్లు = ఏ కులంవాళ్ళు
ఏరువడుడు = వేరు పోవడం
ఏరుగపోవుడు = దొడ్డికిపోవడం, వేరుగా పోవడం
ఏర్గిపూసుకున్నట్లు చేసుడు = అసహ్యంగా చేయడం
ఏర్పాటు చేసుడు = మనిషిని ఆనవాలు పట్టడం
ఏర్లు = వేళ్ళు ( చెట్టుయొక్క )
ఏర్లపాతుకపోవుడు = స్థిరనివానముండి పాతబడిపోవడం
ఏలు = వ్రేలు, వేలు
ఏలు ఏస్తె అందేదాక తినుడు = బాగా తినడం
ఏలు పెట్టే సందిస్తే కాలు పెట్టుడు = కాస్త వీలుంటే అంతా ఆక్రమించుకోవడం
ఏలు వెట్టుడు = జోక్యం చేసుకోవడం
ఏషకాంత = వేషకాంత
ఏసంగి, యాసంగి = వేసవి
ఏసుడు = కొట్టడం, వేయడం
ఏసుతాసుగాకుంట = వ్యత్యాసం లేకుండా
ఏసు లేకుండుడు = వైభవం, కళ, వృద్ధి, కాంతి మొ॥ నవి లేకపోవడం

## ఐ

ఐదేల్లు నోట్లెకు వచ్చుడు = కూటికి సరిపోవడం
ఐద్రబాదు = హైదరాబాద్
ఐబత్ దినుడు = కంగు తినడం
ఐరానవడుడు = (నానా) హైరానా పడడం
ఐరిని బైరిని చేసుడు = తిమ్మిని బమ్మిని చేయడం
ఐశత్, (హైసియత్) (అ) = సంపద, అర్హత
ఐశతెంత ? బిశాదెంత = లెక్కెంత ?

## ఒ

ఒంటికాల్, రెండో సిచ్చి, మూడో ముచ్చి, నాల్ నడ్డి, ఐదర రెడ్డి, ఆరే గన్ను పోరగాడు పిల్ల = బిళ్లం గోడులోని పదాలు ?
ఒంటిగాడు = ఒంటరివాడు
ఒంటిరెక్కపానం = బలహీనుడు అని చెప్పడం
ఒంటేలు = మూత్రం
ఒంట్లు = అంకెలు, సంఖ్యలు ( ఒకటి రెండులని అర్థం )
ఒంట్లె = వంట్లో
ఒకటిరెండు ముచ్చట్లతో = ముక్తసరిగా
ఒక్క అడుగుపోయివచ్చుడు = కాస్తవెళ్ళి రావడం ( ఒక్క అడుగు రారాదు )
ఒక్క కట్టు మీదుండుడు = ఏకత్రాటి మీద నడవడం
ఒక్క చెయ్యిఎయ్యరాదు = కాస్త సాయం చేయరాదా ?
ఒక్క నరమానవుడులేడు = ఒక్కడూలేడు
ఒక్కపారి = ఒక్కసారి
ఒక్కందుకు = ఒక విధంగా
ఒక్క కునుకుతీసుడు = కాస్త నిద్రపోవడం
ఒక్క చెయ్యిమీద నడ్సుడు = ఎవరో ఒకరి పెత్తనంతో పనులు నడవడం
ఒక్కటే నవ్వుడు = అదే పనిగా నవ్వడం
ఒక్కతి = ఒకర్తె, ఒకతె
ఒక్కతీరుగ = అదేపనిగా
ఒక్కతుసురుకు సాలది = దేనికీ సరిపోదు
ఒక్కదమ్ము (తాగుడు) = కాస్త ( తాగడం )
ఒక్కపొద్దు = ఉపవాసం, పస్తులు
ఒక్కమాట = మాట్లాడేప్పుడు ఉపయోగించేపదం ( ఒక్కమాట - నీతో కొద్దిగంత పనుంది )
ఒక్కమూటి = ఒకేమురా, ఒకే జట్టు
ఒక్కశిత్తం = స్థిరచిత్తం, నిర్ణయం
ఒక్కసారె = అకస్మాత్తుగా

ఒగలింటికి పోయెటోల్లు = ఒకరి ఇంటికి ( అనగా అత్తవారింటికి ) వెళ్ళేవాళ్ళు
ఒగాది = ఉగాది
ఒగాల్ల = ఒకవేళ
ఒగ్గుకత = చెవులొగ్గి వినదగిన యాదవుల కథ
ఒగ్గొగ్గు ముసలమ్మ = ముదివగ్గు
ఒచ్చేరకు పెట్టుడు = దాచిపెట్టడం
ఒట్టు = ప్రమాణం
ఒడిపిల్లు = బియ్యంలో వచ్చే ఒక రకమైన తృణ ధాన్యం, ఒడిపిలిబియ్యం
ఒడిశిపోవుడు = అయిపోవడం, నిండుకోవడం
ఒడిసెల = వడిశెల (వడిగా వెళ్ళే శిల)
ఒడ్డె = వడ్డెర
ఒడ్డెక్కిచ్చుడు = గట్టెక్కించడం
ఒడ్డెక్కుడు = గట్టెక్కడం, పని కావడం
ఒత్తడి = ఒత్తిడి, నిర్బంధం
ఒత్తు = నొక్కు
ఒత్తుపెట్టుడు = ఓటు పెట్టడం
ఒత్తుక పోవుడు = ఒంటికి గట్టిగా ఏదో తగలడం
ఒత్తుకచ్చుడు = ఒత్తిడితో అనివార్యం కావడం
ఒత్తుకుండ = పొయ్యికి రెండువైపుల రాళ్ళుండి మూడోవైపు నీళ్ళతోనింపిన కుండ నపోర్టుగా వుంచడం తద్వారా వంటతో పాటు నీళ్ళు కూడా వేడవుతాయి.
ఒత్తుకునుడు = సర్దుకోవడం
ఒత్తుగా = గట్టిగా, బాగా, దట్టంగా, చిక్కగా
ఒత్తుడు (కాళ్ళు మొ॥నవి) = పట్టడం
ఒత్సాదీర్గం = ఓత్వం
ఒదలు = వదులు, లూజ్
ఒదులకిచ్చుడు = ఉబ్బడం, సడలడం
ఒద్దులు = రోజులు, పొద్దులు, (రోజు(ప))
ఒమ్ముడు = కుదరడం,ఒంటికి సరిపోవడం, అమరడం
ఒరాలు = ఒడ్డూఒరాలు
ఒరుగుడు = మేనువాల్చడం, వాలడం,దక్కడం
ఒర్రుడు, ఒర్లుడు = అరవడం, వాగడం
ఒర్రె = ఒర్రునది,చిన్నఏరు
ఒల్శన్ని = చాలా,వలసినన్ని
ఒల్కపోసుడు = పారబోయడం
ఒల్శంతసేపు = చాలాసేపు, వలసినంతసేపు
ఒల్లె పెట్టుకొని సాదుడు = చాలా పదిలంగా ఒడిలో పెట్టుకొని సాకడం
ఒల్లెకట్టిచ్చుడు = చీరకంటె చిన్నగుడ్డను ఆడపిల్లకు కొత్తగా కట్టించడం
ఒల్లెక్కాలకు = ఉత్తుత్తుగానే,హుళక్కులకు
ఒస్గులు = చదివింపులు, కట్నాలు

## ఓ

ఓతీరుగ = ఒకరకంగా,ఒకమాదిరిగా
ఓంబత్తి = కొవ్వొత్తి
ఓకరచ్చుడు = అందరికి అయిష్టంకావడం, వాంతివచ్చినట్లుగా అనిపించడం
ఓకారం = ఓక్....మనుకుంటూవచ్చేవాంతి
ఓటర్ల/ఓటల్ = హోటల్
ఓటి = ఒక్కటి
ఓటుపాటు = తేడా
ఓట్లు = ఎన్నికలు
ఓడగొట్టుడు = అయిపోగొట్టడం
ఓడిబియ్యం = ఒడిబియ్యం
ఓడు = ఎవడు
ఓణి = పరికిణి
ఓద = హోదా
ఓనగాయ = లేతచింతకాయ
ఓనగుంటలు = ఓమనగుంటలు
ఓనమాలు, ఓన్మాలు = వర్ణమాల, అక్షరాలు, ఓంనమశ్శివాయలు
ఓపకపోవుడు = పని చేయలేకపోవడం
ఓపికెదినుడు = సహించడం, ఓపిక వహించడం
ఓపికెమంతుడు = సహనశాలి
ఓపికెమంతురాలు = సహనశీలి ( స్త్రీ )
ఓపికెలు = సహనం, బహువచనాంతంలో ప్రయోగించబడిన పదం
ఓమ = వాము
ఓరకు వెట్టుడు = దాచిపెట్టడం, ఓరగాపెట్టడం, పక్కకు పెట్టడం

ఓర్సుకపోవుడు = ఒరసుకుని పోవడం ( గోడ మొ॥ నవి )
ఓర్సుకునుడు = సహించడం
ఓలి = హోళీ
ఓలిగె, ఓలె = వలె, లాగా
ఓల్లు = ఎవరు
ఓషన = యోచన
ఓసర = ఆసరా, ఒంట్లో సత్తువ

## ఔ

ఔ = ఔను
ఔగోలిచ్చుడు = బాధపడడం ( అఘోరించడం )
ఔర్ = మరియు
ఔలగాడు = పిచ్చోడు ?

## క

కంక = కోడె
కంకబద్దలు = వెదురుబద్దలు
కంకబొంద = పుష్టిగా వున్న ఎద్దు
కంకి = పొత్తు, బుట్ట
కంకుడు = నోటిలోని పండ్లతో కొరికి తినడం
కంకునం = కంకణం
కంకెడు కంకెడు = పిడికెడు, పిడికెడు
కంగాలి కంగాలి చేసుడు = పని పాడు చేయడం
కంగిరి బింగిరి = పొంతన లేని
కంగు దినుడు = కంగారుపడడం, దిగ్భ్రమ చెందడం
కంచుక = ఓ రకమైన తామర
కంచుడు = మూకుడు
కంచె = పశువుల గడ్డి కోసం వదలిన చోటు
కంజర్ = చిన్నడప్పు
కంజీషు = పిసినారి
కంజు = కొంజు
కంజూషిగాడు = పిసినిగొట్టు
కంటికి కడివెడు ఏడ్సుడు = కన్నీరు మున్నీరుగా విలపించడం
కంటినిండ నిద్రపోవుడు = గాఢనిద్ర పోవడం
కంటు అవుడు = కంటగింపు కావడం
కంటె = కంఠాభరణం, కంటెసరి
కంటె బొక్కలు = కంఠానికి ఇరువైపుల వున్న ఎముకలు
కంట్లం, కంట్లెం = కంఠం
కంట్లెపువ్వువడుడు = (నేత్రరోగం) కంటి నల్లగుడ్డు తెల్లగామారిపోవడం
కండసారి చెక్కెర = కలకండ
కండ్లకిందికెల్లి చూసుడు = మతలబుగా చూడడం, రహస్యంగా పరిశీలించడం
కండ్లకు చీకట్లు వచ్చుడు = కళ్ళు బైర్లు కమ్మడం
కండ్లకు పొరలు వచ్చుడు = కండ కావరం
కండ్లకు మస్కలు వచ్చుడు = దృష్టి మాంద్యం
కండ్ల గానడు = ఖాతరు చేయడు
కండ్లద్దాలు = సులోచనాలు, కళ్ళజోడు
కండ్లనీల్లు తీసుకునుడు = కళ్ళనీళ్ల పర్యంతం కావడం
కండ్లపొట్టులు = కంటిరెప్పల కింది భాగాలు
కండ్లమంట ( తనం ) = అసూయ
కండ్లముందటి పోరడు = వయస్సులో చిన్నవాడై ఆబాల్యముగ తెల్సినవాడు
కండ్లల్ల మన్నుపోసుకునుడు = అసూయ పడడం
కండ్లల్ల కనవడుడు = కళ్ళకు బొమ్మకట్టినట్లుండడం
కండ్లల్ల పెట్టుకునుడు = దురుద్దేశంతో గమనించడం, జాగ్రత్తగా చూసుకోవడం
కండ్లల్ల మెరుసుడు = మాటికీ గుర్తుకు రావడం
కండ్లు = కళ్ళు
కండ్లుకుచ్చుకునుడు = నిద్ర చాలక కళ్ళన్నీ గుచ్చుకున్నట్లు నిద్రముంచుకురావడం
కండ్లుదెరుసుడు = కనువిప్పు కావడం, జ్ఞానోదయం కలగడం
కండ్లు దెంగినయా ? = కనబడ్తం లేదా ?
కండ్లు నెత్తి కెక్కుడు = గర్వం కల్గడం
కండ్లుపోవుడు = తప్పు చేసినపుడు కళ్ళు పోతాయని చెప్పడం
కండ్లు మూసి తెర్సినంతల = ఒక్క క్షణంలో
కండ్లు వచ్చుడు = కళ్ళకలక

కండ్లు సల్లవడుడు = పగవాడికి కీడు జరిగినపుడు తను సంతోషానుభూతి పొందడం
కండ్లు సల్లవడుడు = పగవాడికి కీడు జరిగినపుడు తను సంతోషానుభూతి పొందడం
కంతలు = కణతలు
కంత్రిగాడు = దుర్మార్గుడు, క్రూరుడు
కందగడ్డలు = చిలకడదుంపలు
కందగాడు = దుష్టుడు, రౌడీలాంటివాడు
కందికమ్మలు = కందివర్ణంలోకి మారిపోయిన కాయిదాలు
కందిపోవుడు = దెబ్బలకు నల్లబడిపోవడం
కందిలి (అ), కందీన = లాంతరు
కందుర్ = దేవునికి సమర్పించిన మాంసాదులను నిశ్శేషంగా తిని మొక్కు తీర్చడం
కందెన = బండి చక్రాలు సులువుగా తిరగడానికి ఇరుసుకు వేసే ల్యూబ్రికెంటు, పూసేమసి
కంపిని = కంపెనీ
కంబం = స్తంభం
కంబి = కమ్మి, కటకటాలు, ఊచలు
కంసల్య = కౌసల్య
కక్కదాగుడు, కక్కవోసుడు = వశీకరణకై యితరులు పెట్టిన మందును శరీరం నుండి కక్కించడం
కక్కుడు = వాంతులు, అడిగిన వెంటనే అప్పు తీర్చడం
కక్కుడు బైలు, కక్కుడేర్గుడు = వాంతులు, విరేచనాలు
కచ్ర = చెత్త
కచీరి, కచేరీ = కార్యాలయం
కచ్చకాయలు = గచ్చకాయలు
కచ్చరిగాయలు, కచ్చెగాయలు = కసుగాయలు, పచ్చికాయలు
కచ్చితంచేసుడు = నిర్బంధించడం, బలవంత పెట్టడం
కచ్చితం మనిషి = నిక్కచ్చి మనిషి
కచ్చు = కీటు
కచ్చురం = బండి
కచ్చెగట్టుడు = కక్ష కట్టడం
కచ్చెపెక్కఉడుకుడు = అన్నం ఉడికీ ఉడక్క పోవడం ( కచ్చాపక్కా ఉడకడం )
కజాన = బొక్కసం
కజ్జురంపండు, కజ్జురపండు = ఖర్జూరపండు
కటకట పెట్టుడు = కొట్లాట కల్పించడం
కటాకటి = ఖచ్చితంగా, ఖరాఖండిగా
కటికోల్లు = కసాయివాళ్లు
కటీనం = కఠినం
కటీఫ్ = స్నేహం తెగిపోవడం
కటుకు కటుకు అవుడు = అప్పాలు మొ॥నవి ఎక్కువగా కాలి గట్టి పడడం
కటోర = లోతు తక్కువైన కూరగిన్నె
కట్కా = మీట, స్విచ్, బోల్టు
కట్కాం = కట్టడం, నిర్మాణం
కట్కార్ = బందెలదొడ్డి
కట్టం = కష్టం
కట్టడి జేసుడు = కట్టుబాట్లో ఉంచడం
కట్టలకు కట్టలు = ( నోట్లు ) కట్టలు కట్టలుగా
కట్టు = నియమం, కట్టుబాటు
కట్టు ఏసుడు = పాము మొ॥ నవి రాకుండా ఇంటి చుట్టూ మంత్రంతో కట్టు వేయించడం
కట్టుచారు = పప్పును ఉడికించగా మిగిలిన నీళ్ళతో చేసిన చారు
కట్టుడు = చెల్లించడం (అప్పు), పశువులు గర్భం ధరించడం
కట్టుడు చీరలు, కట్టువాక చీరలు = కట్టుకోకలు
కట్టువడుడు (బైలు) = విరేచనాలు ఆగడం
కట్టె = బెత్తం, కర్ర, కలప
కట్టె జరుసుకపోవుడు = ఒళ్ళంతా చల్లబడి కర్రలా బిగుసుకు పోవడం, మ్రాన్పడం, కొయ్యబారిపోవడం
కట్టెపండు = గింజలు తీయని చింత పండు
కట్టెపుల్లలు = వంటచెరుకు
కట్టెపుల్ల లెక్క అవుడు = చిక్కిశల్యమవడం
కట్టెల పుల్ల ఇరికె, పుల్లల కట్టె ఇరికె = అనవసర విషయాల ప్రస్తావన - కాలయాపన, రంధ్రాన్వేషణ?
కట్రౌతు = ఇంటి నిర్మాణానికి వాడే రాయి ; చక్కగా చెక్కబడిన రాయి
కట్లె కట్లె = ఛిపో (కుక్కను కొట్టడానికి వాడే పదం)
కట్లెపూలు = ఒకరకమైన నీలవర్ణంలో వున్న పూలు
కడక్ = స్టిఫ్‌గా వుండడం
కడకడలు పోవుడు = మందిలో ఉండక పక్కలకు వెళ్లడం
కడకు, కడాకు = పక్కకు, కొసకు, చివరికి

కడగొట్టు = చివరి
కడలు ఏసుడు = గొంగళ్ళ చివరలకు, కడలకు అంచులు వేయడం
కడహీనం = మరీహీనం
కడాయి = చెరకు పెనం
కడి (పెండ) = ముద్ద
కడిగి అరబోసినట్లు = స్వచ్ఛమైన రీతి
కడుగులు = బియ్యం కడిగిన నీళ్లు
కడుప = గడప
కడుపల్లల్ల = గుమ్మంలో
కడుపలు = ఇండ్లు ( మీ వూల్లె మొత్తం ఎన్ని కడుపలున్నయి ? )
కడుపవుడు = గర్భవతి కావడం
కడుపా కయ్యా = కడుపా కాగా, కడుపా కళ్ళేపల్లి చెరువా, కడుపా చెరువా, కడుపా ఖండవల్లి మడుగా, కడుపా కొల్లేరా ?
కడుపు అవిశిపోవుడు = బాధతో గుండె చెరువు కావడం
కడుపు ఊదు / ఊదరవట్టుడు = ఏడ్చి ఏడ్చి కడుపంతా ఉబ్బిపోవడం
కడుపు కడుగుడు = అబార్షన్ ?
కడుపు గట్టుకుని = చాలా కష్టపడి
కడుపు చేతుల పట్టుకున్నోల్లు = పేదలు
కడుపునంబలి వడ (నీ) = ప్రేమతో కూడిన ఒక దీవెన
కడుపు పండుడు = పిల్లలు కావడం
కడుపు పెంచుకునుడు = తిండిపోతు కావడం
కడుపు మందమవుడు = మలబద్ధకం
కడుపు మసులుడు = అసూయతో, పగ, కోపంతో మండిపోవడం
కడుపున చెడపుట్టుడు = కడుపు చేటు, పుట్టుక
కడుపునిండ = మనస్ఫూర్తిగా
కడుపునొప్పి = అవసరం
కడుపుపూజ = తిండి
కడుపుల గాలుడు, కడుపుల గోకుడు = ఆకలి కావడం
కడుపుల చిన్నగ నములుడు = కడుపులో నొప్పి
కడుపుల చెయ్యివెట్టి దేవినట్లు అవుడు = కడుపులో వేలుపెట్టి కెలికినట్లవడం
కడుపుల దయపుట్టుడు = దయకల్గడం
కడుపుల దయ్యం కూసుండుడు = విపరీతంగా ఆకలి వేయడం
కడుపుల దాసుకునుడు = తప్పుకాయడం
కడుపుల పెట్టుకొనుడు = తప్పు కాయడం
కడుపుల పేగులు నోట్లెకచ్చుడు = తల ప్రాణం తోకకు రావడం, అతి ప్రయాస
కడుపుల సురసురఅనుడు = ఆకలి కావడం
కడుపుల యిసంలేకుంట = నిష్కల్మషంగా
కడుమయి = మిగిలినవి
కడుముంత = చిన్నముంత (మట్టిది)
కడెం = కడియం
కడ్మ = కరడు ( వర్ణసమీకరణంతో కడ్మ )
కడ్మగాడు = కఠినుడు, క్రూరుడు
కడ్పవెట్టుడు = ఇల్లు కట్టినపుడు ఆడబిడ్డలతో గడపలు పెట్టించడం
కడ్పునిండది కాలునిండది = ఎందుకూ చాలదు అని చెప్పడం
కడ్పుగాల = తిట్టుపదం
కడ్పుల ఇసంపెట్టుకొనుడు = మనసులో కుళ్ళు పెట్టుకోవడం
కడ్పుల పెట్టుకుని సాదుడు = అతి జాగ్రత్తగా సాకడం
కడ్పుల పేగుల్లోనోల్లు = నిరుపేదలు
కణాలు (బండివి) = బండికాని (డి) రంధ్రాల్లో వేసే కర్రలు
కత = కథ
కతంజేసుడు (ఖతమ్ (అ))= అయిపోగొట్టడం, చంపడం
కతర్‌నాక్ మనిషి = ప్రమాదకారి
కతల్‌కేసు, కతల్ (అ) = క్రిమినల్ కేసు
కతలు కార్కానలు = కథా కమామీషులు
కత్తిగట్టుడు = కక్ష గట్టడం
కత్తికోత = విపరీతమైన బాధ
కత్తెర = కృత్తిక
కత్ప = ఒడంబడిక (కద్ప(అ))
కదరు (అ) = గౌరవం, ఖదర్
కద్దర్ = ఖద్దర్
కనరు = వగరు
కనరు కనరు వానన = గుడ్డలు, వెంట్రుకలు కాలుతున్న వాసన
కనవడుడు = అగుపించడం

కని = కాని, రాతి కనీలు - సరిహద్దు రాళ్ళు
కనికరం = దయ
కనీనం = కడహీనం
కనుకు = కంకుల్ని కాల్చడానికి కట్టె పుల్లలు చేర్చడం
కనుగల్గివుండుడు = జాగ్రత్తగా గమనించడం, కనిపెట్టివుండడం
కనుములు = రవికగుడ్డలు
కన్కట్టు విద్య = ఇంద్రజాల మహేంద్ర జాలాదులు
కన్నంటుకునుడు = నిద్రలోకి జారిపోవడం
కన్నకర్మానికి = కన్నపాపానికి
కన్నవిటిచెవ్వవిటి = గుడ్డి, చెముడు
కన్నారం, కన్నాగురం, కన్నావురం = కరీంనగరం
కన్ను గొట్టుడు = కన్నుగీటడం, గిలకడం, కనుసైగ చేయడం
కన్ను చెదురుడు = అసూయతో కళ్ళు చెదరడం
కన్నుమల్లుడు = నిద్రరావడం
కన్నువెట్టుడు = జాగ్రత్తగా గమనించడం, నిఘా వేసి వుంచడం
కన్నెర్రతనం = అసూయ
కప్పతల్లి ఆట, కప్పతొక్కుడు = వానలు పడాలని రోకలికి కప్పను కట్టి యిల్లిల్లు తిరిగి నీళ్ళు పోయించుకోవడం
కబ్జచేసుకునుడు = అధీనంలోకి తీసుకోవడం
కమ్‌జోర్ మనిషి = బలహీనుడు
కమస్కం (కమ్ సే కమ్) = తక్కువలో తక్కువ, కనీసం
కమాన్ = ఆర్చి, కమాను, విల్లులాంటి నిర్మాణం
కమాయించుడు = సంపాదించడం
కమాల్ చేసుడు = అద్భుతం చేయడం
కమిరిచ్చుడు = బూరు, ఈకలు పీకబడిన కోడిలాంటి వాటిని మంటపై కాల్చడం
కమీజు (అ) = ఒకరకమైన చొక్కా
కమీనగాడు = అల్పుడు
కమేటి గట్టుడు = అందరూ కలిసి మంతనాలు చేయడం
కమ్మ = కాయిదం
కమ్మ కత్తి = ఈత, తాటి మొ॥ కమ్మలను కోయుకత్తి
కమ్మంగ కాయి పాయి చేసుకొని తినుడు = అన్నం (ఖాద్యం) పానాదులను (పేయం) రుచికరంగా చేసి తీసుకోవడం
కమ్మగ = రుచికంగా
కమ్మర్ (ప)= నడుము
కమ్మలు = దుద్దులు
కమ్మి = తక్కువ, కొరత, చవక
కమ్ముకచ్చుడు = మేఘాలు కమ్మి చీకటి అవడం
కమ్ముడు (కోడిని) = గంపకింద దాచడం, వుంచడం
కమ్ములు = బండి చక్రాల అరుగుదలను ఆపేందుకు ఇనుముతో వేసినవి
కమ్ర = గది
కయ్య = ప్రవాహ ఉద్ధృతితో చీలిన నేల, వాగులో (వాకిట్లో) ఏర్పడిన లోతైన స్థలం, మడుగు లాంటిది
కయ్య కయ్య మొత్తుకునుడు = లబోదిబోమనడం
కయ్యం = గొడవ
కయ్యగోసుడు = వాగొడ్డున వున్న పొలంలోకి నీళ్ళు వచ్చి కొంతకొట్టుకుని పోవడం
కయ్యిమనుడు = కోపం, విసుగుతో అరవడం
కర = నిజం
కరంటు వెట్టుడు = రక్షకభటులు వ్యక్తులకు షాకు ఇప్పించి శిక్షించడం
కరట్టు / కరష్టు = కరెక్టు
కరాబు = చెడిపోవడం ( ఖరాబ్ (అ) )
కరార్ (అ) = నిర్ణయం, ఖరారు
కరి = బిగువు కావడం (దారం)
కరి ఎక్కది = ధైర్యం రాదు
కరీదు (ప) = వెల, ఖరీదు
కరీదుజేసుడు = కొనడం
కరీద్దోడు (కాపోడు) = రైతు కానివాడు (ఖరీదు దార్ ?)
కరువుల వాంతి = కరువులో అధిక మాసం
కర్కు = పళ్లపొడిగా వాడే కాల్చిన పొగాకు
కర్కు బీడి = తాగిపారేయగా మిగిలిన బీడిముక్క
కర్కోటకుడు = దయలేనివాడు
కర్జు = వంట చెరుకుతో వండిన కారణంగా వంటింటి కప్పుకి పొగయిన మసి
కర్బూజ = A musk - melon
కర్య = కజ్జికాయలు
కర్రుసందు నాగలి సందున యిరికినట్లు = తప్పించు కోలేని ధర్మసంకట పరిస్థితి
కర్రెగ = నల్లగా
కర్రెపిట్ట = భరద్వాజపక్షి

కల = అందం, కళ ( ఆమె మొకమ్మీద మస్తు కల వుంది)
కలం మామిడి ( పండ్లు ) = ఒకరకమైన మామిడి (పండ్లు)
కలకల తగులుడు = ఉసురు తగలడం
కలపెలకాగుడు = బాగా కాగడం
కలవోవుడు, కల్వవోవుడు = కలుపుకై వెళ్లడం
కలాకాన్ = మిఠాయిలో ఒక రకం
కలాయి = పాత్రలకు పూసే కళాయి
కలాలి = గీతపని
కలాస్ అవుడు (ఖలాస్) (అ) = అయిపోవడం
కలి = కూరాడు కుండలోని పులిసిన గంజి, బియ్యంకడిగిన నీరు
కలిసల్లుడు = పుట్టిన బిడ్డ చల్లగా వర్ధిల్లాలని కూరాడు కుండలోని నీళ్ళు చల్లడం
కలికలిఅవుడు (కడుపు) = గుండె కరిగి నీరవడం లాంటి పలుకుబడి
కలివిడిల = భేటీలో (కల్సుకున్నప్పుడు)
కలుపుగోలుతనం = చొరవ
కలుపుడు = కలియబెట్టడం (కూర మొ॥నవి )
కలె = ఉమ్మి
కలెవడుడు = కొట్లాట, కలియబడడం
కలెగల్పులు = కల్తీలు
కలెగల్సుడు = కలగలపులు కావడం
కలెగూర = తోటకూర
కలెదిర్గుడు = కలియదిరగడం
కలిపెట్టుడు = కలియబెట్టడం
కల్గంపుల్గం = కలగాపులగం
కల్గింది (పెట్టాలె) = ఉన్నది (యివ్వాలి)
కల్గినంతల = ఉన్నంతలో
కల్తికులం = సంకరకులం
కల్తులు = కల్తీతో ఏర్పడినవి
కల్ప = పాది
కల్పిచ్చి చెప్పుడు = కల్పించి చెప్పడం
కల్పిరాత = గొలుసుకట్టు
కల్యాణి బిర్యాని = గొడ్డు మాంసపు బిర్యాని
కల్యామాకు = కరివేపాకు
కల్యోగం = కలియుగం
కల్లం తొక్కిచ్చుడు = నూర్పిళ్ళు
కల్లమ్మీద పడ్డట్లు = స్వేచ్ఛగా తిన్నట్లు (ఆంబోతులా)
కల్వం = రోలు కన్న చిన్నది
కల్వం గుండు = కల్వంలో మందుల్ని నూర్చేరాయి
కల్వరిచ్చుడు = పలవరించడం
కవరు = కబురు
కవర్దార్ = ఖబర్దార్
కశ్కి = కవుచిక
కశ్పి = వృత్తి
కశ్పిశి = గడబిడ, గజిబిజి
కషాయం = చేదు, కషాయపురుచి, నాటు వైద్యులుచే తయారుచేసిన ద్రవరూప ఔషధం
కష్టంవుంచుకోకపోవుడు = కృతజ్ఞతగా వుండడం, తిరిగి ప్రతిఫలం ముట్టచెప్పడం
కష్టాల గడ్డ, కాష్టాలగడ్డ = స్మశానవాటిక
కస = కాస్త
కసం = ఒట్టు
కసరు = పసరు
కసరుగాయలు = కసుగాయలు
కసురుకునుడు = కోపగించుకోవడం, విసుగు చెందడం
కస్ప = ముఖ్యప్రాంతం
కస్సపిస్సనములుడు = కసపిసా నమలడం
కా బాస = పదాద్యక్షరాలను అన్నింటినీ 'కా'తో పలికే భాష.
కాం = కారం ( చిన్నపిల్లల భాష )
కాంగనే = అవగానే, కాగానే
కాంచి = కాడనుంచి, కాన్నించి
కాంచి / కైంచి తొక్కుడు = సైకిల్ తొక్కడానికి కాళ్ళు అందని చిన్నపిల్లలు ఎడమచేత హ్యాండిల్, కుడిచేత సీటు పట్టుకుని తొక్కడం )
కాంట = పిన్నీసు, ధాన్యాదులను తూచే పెద్ద తక్కెడ
కాంట్రకిచ్చి = కాంట్రించి
కాందాన్ = కుటుంబచరిత్ర (ఖాన్దాన్ - (ప))
కాక = చిన్నాన్న, వేడిమి
కాకగడ్డ = పెగగడ్డ
కాకరపుల్లలు = కాకరవత్తులు
కాకిఎంగిలి = చిలకకొట్టుడు
కాకి ఒర్రుడు = బంధువులొస్తున్న నమ్మకం
కాకి బంగారం = పసుపు పచ్చని అభ్రకం
కాకిబల్గం = గంపంత బలగం
కాకిరిబీకిరి మాటలు = అర్థం పర్థంలేని మాటలు ( కక్కిరిబిక్కిరి )

కాకిలగ్గం = ఎండకొడుతూ వానపడడం
కాకిసొచ్చిన యిల్లు = విడువదగిన ఇల్లు అని అర్థం
కాకిబట్టలు = ఖాకీ దుస్తులు
కాకెత్తుకపోవుడు = కావాల్సినదాన్ని తన్నుకు పోవడం
కాగవెట్టుడు = కాచడం ( నూనె, నీళ్ళు )
కాగు = బాన
కాజలు / కాజాలు = బొత్తాములు పెట్టుకోవడానికై ఏర్పరచిన చిల్లులు
కాజూ = జీడిపప్పు
కాజేసుడు = దొంగిలించడం
కాటగల్సుడు = తప్పిపోవడం
కాటిపాపలోల్లు = కాటికాపరులు
కాటు = గండం, పంటిగాటు
కాటుపోవుడు = మాడిపోవడం (గట్క మొ॥నవి)
కాడ = సందర్భంలో / బదులు ( రెండు రూపాలు తీసుకునే కాడ నాల్గు దొబ్బుతున్నడు ), స్థలం
కాడు = చితి, వల్లకాడు, స్మశానం
కాత = కాయలు కాయడం
కాత వెట్టుడు = ఉద్దెర పెట్టడం
కాతా = ఎకౌంటు
కాది = ఖాదీ, ముతకబట్ట
కాదు = కదూ ! (నిన్న నువ్వు మాయింటికి వచ్చినవ్ కాదు )
కాదు కక్కుసం = కాదు, కచ్చితం, కాదు కర్కశం
కాదుపోదు అంటే = లేదూ అంటే
కాన = సొరుగు
కాన = అన్నం ఖానా (ప)
కానచ్చుడు = కనిపించడం
కానని మొకానికి కప్పదయ్యం = ఏనాడూ చూడనివాని స్థితి
కానని మొకం = ఎన్నడూ దేనిని చూడని మొగం
కానలేదు = గౌరవించలేదు, గుర్తించలేదు
కాని = కాడి
కాని తూట్ల కెల్లి కర్రెపిట్టను ఈగిచ్చుడు = ఘటనా ఘటన దురంధరుడు
కానూన్ = చట్టం
కాన్గిరి (కాన్గి) = ప్రైవేటు, సొంత
కాన్పు = ప్రసవం
కాన్రాని రాజ్యం, దేశం, సోటు = సుదూర ప్రాంతం
కాపాయం = పాదుపు (కాపు+ఆయం), ఆయాన్ని లేదా ఆదాయాన్ని కాపుచేసుకోవడం
కాపుగాసుడు = మాటువేసి వుండడం
కాపుదం బెట్టుడు = కాపడం
కాపుదనపోల్లు = రైతులు
కాబిల్ (అ) = అర్హత (Able), (capable)
కామ = గొడ్డలి కామ
కామ్‌యాబు (ప) = ఉత్తీర్ణత
కామడపాట = కామారెడ్డి
కామాటి = మే స్త్రీ, లేబర్
కామాటిపురం = లేబర్ ఉండే ప్రాంతం (ముంబైలో)
కాముడు = మన్మథుడు
కాముడు కాలుడు = కామదహనం
కాముని బండ = కాముని దహనం చేసిన చోటు
కాముని బూతం = కామినీ భూతం
కామూష్ (ఖామోష్) (ప) = నిశ్శబ్దం
కాయం = గసగసాలు, శొంఠి, కొబ్బరి, మిరియాలు మొ॥ వి ముద్ద చేసి పచ్చి బాలెంతల నడుం పటుత్వానికి యిచ్చేది
కాయకష్టం = శరీరకష్టం, రెక్కల చాకిరి
కాయగసురుకాలం = కాయలు కాసే కాలం
కాయమవుడు = ఖాయం కావడం
కాయికూర = మాంసంకూర ( కాయి = ఖాద్యం)
కాయిదం రాసుకునుడు = అగ్రిమెంటు చేసుకోవడం
కాయిదా = ఆచారం
కాయిదాలు కత్పలు = కాయితాలు కదపాలు
కాయిశిప్ప (కైశిప్ప) = కవుచిక
కాయిష్ (ఖ్వాహిశ్) (ప) = ఇష్టం, మోజు, కోరిక
కార = పూసా, బూంది మొ॥నవి
కారటు = కార్డు
కారడ్డం మాటలు = ప్రతిదాన్నీ వ్యతిరేకించే వెటకారపు మాటలు ( కారొడ్డం - కాలు అడ్డంగా పెట్టే మాటలా ?)
కారిజ్ చేసుడు ( పేరు మొ॥నవి ) ( ఖారిజ్ ) (అ) = కొట్టివేయడం, తీసివేయడం
కారీలు = బొంబాయి నుండి వచ్చే పొరలతో కూడిన గోధుమ తినుబండారాలు
కారోబార్ (ప) = గ్రామపంచాయితీ గుమాస్తా
కార్కాన = కంపెనీ
కార్గుజారు = పెత్తనం
కార్జెం = కాలేయం
కార్యం = పని, శోభనం

కార్వాయి = సిఫారసు
కాలం అవుడు = వర్షాలు పడడం
కాలంజేసుడు = చనిపోవడం
కాలం బూనుడు = వర్షాలు మొదలవడం
కాలంముంచుడు = అనావృష్టి
కాలంబోవుడు = అనావృష్టి
కాలకుపోవుడు = దొడ్డికి పోవడం (కాల్వకు)
కాలకు పెట్టుడు = విరేచనాలు
కాలనీ కూలనీ = ఏదీఏమైనా కానివ్వండి అని
కాలబెట్ట (నిన్ను) = ఒక తిట్టు
కాలపెట్టు = ఇవ్వు, పెట్టు, తగలెయ్యి, ( ఏదో ఒకటి కాలపెట్టు - నేను జెప్పిన పోవాలె ) - (కోపంతో అనడం)
కాలాంతకుడు = చావుని తెచ్చే శివుడు, అసాధ్యుడు
కాలి (ఖాలీ - (అ) = కేవలం, ఉత్తగా
కాలినడుక = పాదచారం
కాలు ఆగది = కాలు నిల్వదు (ఒకచోట స్థిరంగా వుండని స్థితి )
కాలుమీద కాలేసుకుని కూసుండుడు = కడుపులో చల్ల కదలకుండా వుండడం
కాలువెట్టుడు = అడుగు మోపడం
కాలే = కాలేదు, కాలా
కాలేరుమీదికి = బొగ్గు కాలరిలోకి
కాలేసుడు = దహన సంస్కారం, హననం
కాల్చి కర్రెపెట్టను చేసుడు = ఎంతో పీడించడం
కాల్జేతులు = కాళ్ళుచేతులూ
కాల్లకట్టుకు = కాళ్ళవైపున
కాల్లకు చెక్రాలుండుడు = తిరుగుబోతు అని అర్థం
కాల్లకు నీల్లిచ్చుడు = ఇంటికొచ్చిన అతిథి కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళివ్వడం
కాల్లకు మట్టి అంటకుండ పెంచుడు = అపురూపంగా, గారాబంగా పిల్లల్ని పెంచడం
కాల్లగోర్లుతీసుడు = రజస్వల అయింతర్వాత కాళ్ళ గోర్లు తీసి చీరకట్టించి ఇంట్లోకి పంపించడం,శోభనం
కాల్లల్ల కట్టెలు పెట్టుడు = అడ్డుకోవడం, Hurdles
కాల్లు కడ్పులు పట్టుకునుడు = కాళ్ళా వేళ్ళా బతిమిలాడ్డం
కాల్లు గుంజుడు = కాళ్ళ తీపులు
కాల్లు జాపుకుని పండుకునుడు = నిశ్చింతంగా వుండడం
కాల్లు జేతులు సల్లగుండుడు = ఆరోగ్యంగా ఆయుష్మంతులై ఉండడం
కాల్లు తొక్కిచ్చుడు = అక్కమగనికి మరదల్ని కట్టబెట్టడం
కాల్లు రాలేదు = వెళ్లబుద్ధి కాలేదు, (ఇంటికి వెళ్లాలంటే కాల్లు రాలేదు )
కాల్లు రెక్కలు ఆడేదాక = బొందిలో ప్రాణం ఉన్నంత వరకు
కాల్లు సంద్రుమనుడు = ఎండకు కాళ్ళు చుర్రుమనడం
కాల్లుజేతులు కట్టేసినట్లు అవుడు = కదలనివ్వని పరిస్థితి
కాల్లురెక్కలు నమ్ముకున్నోల్లు = తమ కాయకష్టాన్ని నమ్ముకున్నవాళ్లు
కాళ్ళు సురసుర కాలుడు = కాళ్ళు కాలడం
కావలి = కాపలా (తమిళ 'కావల్' కు 'కావలి' దగ్గర )
కావలికాడు = కాపలాదారు
కావలిచ్చుకునుడు = కౌగిలించుకోవడం
కావాలె = కావాలి
కాపురం = కావరం, పొగరు
కాశిదండ, కాశిదారం = తీర్థాలు, తిరనాళ్ళ నుండి తెచ్చిన నల్లని దారం, దీన్ని చేతికి కట్టుకుంటారు.
కాష్టం = కాడు, చితి
కాస (ఖాస్ - (అ)) = స్వయాన, సొంత
కాసెపోసుడు = గోచీ పెట్టడం
కాసెవాల్లు = రాతిపనివాళ్ళు
కాస్కర్ = ప్రత్యేకించి
కాస్తు (చేసుడు) (ప) = సాగుబడి (చేయడం)
కింటల్ = క్వింటల్
కిందమీదజేసుడు = చావుబతుకుల్లో కొట్టుకులాడ్డం
కిందమీద మాట్లాడుడు = అవకతవకలు మాట్లాడడం
కింద పెడితె మీద పెట్టుడు మీద పెడితె కింద పెట్టుడు = ఆకుకు అందకుండా పోకకు పొందకుండా వుండే స్థితి
కింద, కిందట = క్రితం
కొందపడి మీదపడి = కిందామీదాపడి
కిందవడ్డా బంచోత్, మీద వడ్డా బంచోత్ = కింద వడ్డా మీసాలకు మన్నంటలేదన్నట్లు
కిందికి మీదికి చూసుడు = ఎగాదిగా చూడ్డం, నఖశిఖ పర్యంతం చూడ్డం

కిందువాడకట్టు = ఊరి మొదట్లో కాక దిగువన, చివరన వున్న వీధి
కిచ్‌డీ = పప్పు, బియ్యం మొ॥నవి కలిపి వండినది
కిటుకు = కీల్లు, ఆధారం, మర్మం, కూపీ
కితాబ్ = పుస్తకం
కిత్కెలు = కృత్తిక కార్తె
కిమ్మత్( ఖీమత్ ) (అ) = వెల
కిరస్తాన్లు = క్రైస్తవులు
కిరానం దుకానం = కిరాణాకొట్టు
కిరాయి (అ) = ఛార్జీ (బస్ కిరాయి, రైలు కిరాయి), ఇంటి అద్దె
కిరికిరి = గొడవ
కిరీటం బెట్టుడు = గౌరవించడం
కిర్మి = మూర్ఛ, ఫిట్స్ (క్రిమివల్ల వస్తుందనుకుని దాన్ని కిర్మి అని పిలిచి వుండాలి )
కిల = కిలో
కిలా, కిల్లా = కోట
కిలాడి = రంకులాడి, బొంకులాడి, ఆటగత్తె
కిలాప్ (ఖిలాఫ్) (అ) = వ్యతిరేకం
కిలావర్ = చీట్లపేకలో ఫ్లవర్
కిలాస్ = క్లాసు
కిల్లకిల్ల నవ్వుడు = కిలకిలా నవ్వడం
కిష్టకిష్ట = బల్లి పల్కగానే ఇలా అంటారు
కిసకిస నవ్వుడు = కిసుక్కుమనడం
కిసకిసలాడుకునుడు = కొట్లాట పెట్టుకోవడం
కిసర్‌బైలు = చిన్నపిల్లలకు ఆకుపచ్చగా, పలుచగా వచ్చే మలం
కిస్తె = బల్ల సొరుగు ?
కిస్తె (ప) = చిన్నమూత
కిస్తులు (అ) = వాయిదాలు, ఇన్‌స్టాల్ మెంటులు, ఖిస్తులు
కిస్మత్ (ఖిస్మత్)(అ) = అదృష్టం
కిస్మిస్‌లు (ప) = ఎండు ద్రాక్షలు
కీకపెట్టు = కూతవేటు
కీకలు = అరుపులు, కేకలు
కీమగొట్టుడు (అ) = ఖీమాగా నరకడం
కీర(ఖీరా) = పాయసం
కీలకొండి మనుషులు = మెలికపెట్టే వాళ్ళు, కొర్రీలు వేసేవాళ్ళు, మడత పేచీలు పెట్టేవాళ్ళు
కీస,కీసా (ప) = జేబు
కీసుపిట్ట = విజిల్, (కీచుమంటుంది), చీమిడి ( కీసుపిట్ట నేలకేసి కొట్టు )
కీసులాట = గొడవ
కుంకుమ (బొట్టు) = కుంకుం (బొట్టు)
కుంగుడు = నేల లోపలికి పోవడం
కుంచం = ఎనిమిది తవ్వలు
కుంచెరుకలోల్లు = ఒకరకం ఎరుకలు
కుంటు వడుడు = పని ఆగిపోవడం
కుంటెండ్లు = శ్రవణాభరణాలు
కుండతోకుండెడు = కుండెడు అని అర్థం
కుండపోత = కుంభవృష్టి
కుండల గల్లది = కుండలో కలది, ఉన్నది
కుండలు కొట్లాడుడు = దరిద్రం తాండవించడం
కుండి = చతుశ్శాలలో ( చంకల యింటిలో ) వాన నీళ్ళు పడుటకు మధ్యలో వదిలిన భాగం
కుండెన = కుంది ? (తమిళం కుందాణి )
కుంపటి = తంటా
కుక్క తలుపులు = ఇంట్లోకి కుక్కలు రాకుండా ప్రధాన ద్వారంలో అమర్చిన చిన్నగేటు
కుక్కపీకులాట = ఎంతకూ తెగని తంటా
కుక్కపేగులోడు = ప్రేమగలవాడు
కుక్కగొడుగు = పుట్టగొడుగు
కుక్కతోక = ఎంత ప్రయత్నించినా వినని, మారనివాడు
కుక్కను కొట్టినట్లు = సాధు జంతువును హింసించినట్లు ( ఆడవాళ్లను కొట్టడం కుక్కను కొట్టినట్లు వుంటది - సాదుకోవాలెకని సంపుతరా )
కుక్కను గొడితే రాలుడు = రాలేటివి డబ్బులని అర్థం. డబ్బులు పుష్కలంగా ఉన్నట్లు వ్యంగ్యంగా చెప్పడం
కుక్కబతుకు = హీనమైన బ్రతుకు
కుక్కమొకం మనిషి = కోపిష్టి
కుక్కల కొడుకా = ఒక తిట్టు
కుక్క సద్ది = గొల్లలు తమ సద్దితోపాటు కుక్కకు తీసికెళ్ళే సద్ది
కుక్కసావు = కాకిచావు
కుక్కిమెదలు = దగ్గరగా కుక్కినట్టుగా వున్న మెడలు
కుక్కెత్తుగ పోవుడు = మన కిష్టమైన వాటిని తన్నుకుపోవడం (పివ్వర్‌వెంటు నా దగ్గర ఎక్కడుంది ? కుక్కెత్తుకపోయింది )

కుచ్చాలు = మూడు పాపలాలు
కుచ్చింది = గుచ్చింది
కుచ్చుడు = కుక్కడం (నోట్లో కుచ్చుకుని తాగద్దు, జేబుల పైసలు కుచ్చుకో ) తాలవ్యీకరణం
కుచ్చులు = డబ్బులు
కుచ్చె = రాశి ( పిడుకల కుచ్చె మొ॥నవి )
కుటింబం = కుటుంబం
కుటీలం = కుటిలం
కుటుకుటుమోటర్ = సైకిల్‌మోటర్
కుట్కం = కుట్టు, స్టిచ్చింగ్
కుట్టె = కుళ్ళుమోత్తనం, కుట్ర
కుట్టుగూల్లు = గుడ్డలు కుట్టడానికి దర్జీకిచ్చిన డబ్బులు
కుట్టు పట్టినట్లు (కడుపు) = పొట్టంతా బిగుతుగా వుండడం, కుట్టుపెట్టినట్లు ?
కుట్రబాజి మనిషి = కుట్రలూ, కుహకాలూ చేసేవాడు
కుడుకలు = ఎండుకొబ్బరి, కురిడీ (కొబ్బరి)
కుడుకపేర్లు = పిల్లల మేలుకోసం ఉగాది సందర్భంలో మెడలో వేసు కురిడీల దండలు
కుడ్తిల పద్ధ ఎలుకోలె = పాలలో పడిన బల్లిలాగా
కుడ్సుడు = తినడం ( నన్ను బాదపెట్టి వాడేం కుడుసుతడు )
కుతి =బలమైన కోరిక, యావ (కుతుకం, కుతూహలం లోంచి వచ్చివుండాలి )
కుత్కెలు = కృత్తికలు
కుత్కెలువచ్చుడు = గవదబిల్లలు
కుత్కెలువడుడు = పొలమారడం
కుత్కెల్దాక తినుడు = పీకల్దాకా తినడం
కుత్తెం = ఇరుకిరుకు
కుద = కుదువ (తమిళం కుదవై)
కుదార్తెంగా = మనస్ఫూర్తిగా, కృతార్థంగా
కుదిచ్చుడు = అటూ ఇటూ ఎత్తేయడం, కుదపడం
కుదిమట్రం(గా) = ఎత్తుకు తగిన లావు (గా)
కుదిలించుడు = కుదపడం
కుదురుకునుడు = పెరుగు తయారవడం
కుదురుడు = చేతి రాత అందంగా వుండడం, పెళ్లినిర్ణయం కావడం (సంబంధం), డ్రెస్ మొ॥నవి సరిపోవడం, చక్కగా కుట్టడం ( ఈ డ్రెస్ మంచిగ కుదిరింది )
కుదేసుడు = మనిషిని పట్టుకుని అటూ ఇటూ ఎత్తేయడం
కుద్దు (ప) = స్వయానా, సొంత ( ఖుద్ నుండి వచ్చింది )
కునపులోల్లు = పద్మశాలీలను యాచించు జాతి
కున్నె = మొక్కజొన్నలు ఒలిచాక మిగిలింది
కుప్ప = ఆస్తి
కుప్ప అవుడు (పని) = పాడయి పోవడం
కుప్పలకు కుప్పలు = కుప్పలు తెప్పలుగా
కుప్పలు = గొర్రె, మేకలను కోసాక వేసే మాంసం పాళ్ళు,రాశులు
కుముటు, కూటు వాసన = మిరపకాయలు మొ॥నవి నిప్పులో పడినపుడు వచ్చే వాసన
కుమ్ము = అసూయ, కుళ్ళుమోత్తనం
కుయ్‌క్కుమనకుంట = కిమ్మనకుండా
కుయ్యి = యోని, గుదం ?
కుయ్యిమనలేదు కుటుక్కుమనలేదు = కిమ్మన లేదు, ఉలుకు పలుకు లేదు, కిక్కురుమనలేదు
కురుసురాళ్లు = మొగురాల కింద ఉండే రాళ్ళు
కుర్తా = ఒక రకం చొక్కా
కుర్పులు, కూర్పులు, కూర్కులు = కునుకులు
కుర్చగ = కురుచగా, పొట్టిగా, చిన్నగా
కులకట్టు = కులంకట్టు, కులనిబంధన
కులవడు / కూలవడు = కూర్చో, చతికిలపడు
కులవడుడు, కూలవడుడు = ఉడకడం (కూర)
కులస్తులు = కులంవాళ్ళు
కుల్ల (ప) = కుళ్లాయి, టోపి, కొల్లాయి
కుల్లకుల్ల, కుల్లంకుల్ల = హృదయం విప్పి వివరంగా
కుల్లుల్లు చేసుడు (నీల్లు) = నీళ్ళని కుళ్ళు కుళ్ళు మలినం చేయడం
కువారం, కువార్కం = కుళ్ళుమోత్తనం
కువ్వ = ముడ్డి
కుశి / కూశి అవుడు = బండి మొ॥నవి చెడిపోవడం
కుషమత్ = మెప్పుకోలు
కుషి (ఖుష్) (ప) = సంతోషం
కుష్కి (ప) = మెట్ట ( ఖుశ్‌కి నుండి వచ్చింది ) (శుష్కమైనది )
కుష్టరోగం = కుష్ఠురోగం
కుసం, కూసం = కుబుసం
కుసుకుసఅనుడు = అనారోగ్యం పాలవడం
కుసులు = మంచంకుసులు
కూకేటిపాము = కొండచిలువ

కుసులు = మంచంకుసులు
కూకేటిపాము = కొండచిలువ
కూజా (ప) = సన్నటి మెడగల మట్టిపాత్ర
కూడవెట్టుడు = జమచేయడం
కూడి వుండుడు = కలిసి వుండడం
కూడివచ్చుడు = వ్యక్తులు కలసిరావడం
కూడు ఉడ్కపెట్టే దిక్కు = అడదిక్కు
కూడుకుమ్ము = కూడూగీడూ
కూడుకొనుడు = సంభోగించడం
కూద్చుడు = పూడ్చడం, బాకీలు తీర్చడం, ఆలుమగలు ఇద్దరిని కలపడం
కూని = హత్య
కూర = మాంసం
కూర అలిసింత = కూర బొబ్బెర
కూరకోత = ఊచకోత
కూరగాయలు = కాయగూరలు ?
కూరాకు (ప) = తిండి మొ॥ వి, (ఖురాక్ నుండి వచ్చింది )
కూరాడు = కలి నీళ్ళున్న కుండ, తరవాణి
కూలికి యిసం దాగుడు = డబ్బులకు ప్రాణం తీసుకోవడం
కూసునుడు = కూచోవడం,తాగడానికి కూచోవడం
కృష్ణ కృష్ణ = బల్లిపలుకగానే యిలా అంటారు
కెల్లి = వైపు (ఎటుకెల్లి పోతున్నవ్ ?),నుండి
కేటి = నవరస్ ? కల్తీ (బంగారం,వెండి)
కేడిగాడు = దుర్మార్గుడు, రౌడీ
కేరుడు (కోడి) = గుడ్లు పెట్టు సమయంలో కోడి అరుపులు
కైకిలి = కూలి (తమిళ కైక్కూలి లోంచి వచ్చింది) అంటే చేతులతో పనిచేసి సంపాదించిన కూలి అని అర్థం
కైకిలి గంబలి చేనుకునుడు = కూలీ నాలీ చేసుకోవడం
కైగట్టుడు = కవితలు రాయడం
కైత్కాలు = కవిత్వాలు మొ॥నవి
కైనీడ = క్రీనీడ
కైర్ = సరి, సరే, అయినా
కైలాట్కం = కొట్లాట
కైలాసం = పరమపదసోపానపటం, వైకుంఠపాళి
కైవారం = వృత్తిలేఖిని
కొంక = (వంకర) కొంకరగా వున్న తవ్వుసాధనం
కొంకర్లు పోవుడు ( వేల్లు ) = వంకరలు పోవడం
కొంకశిలిపోవుడు = కొంకర్లు పోవడం
కొంకిడికట్టె = వేపపుల్లలు మొ॥నవి తెంపడానికి వంకర కొంకరగా వున్న కట్టె
కొంకీస = తవ్వే సాధనం
కొంకీస లెక్క అవుడు = చిక్కి శల్యం కావడం ?
కొంకులు = మడమలు, పిక్కల మధ్య భాగం
కొంగ మెడలోడు = సన్నని పొడుగు మెడవాడు
కొంగు = చెంగు, చెరగు, పైట
కొంగువర్సుడు = స్త్రీ లొంగిపోవడం
కొంచవో,కొంటవో = తీసుకునివెళ్ళు(పద బంధ పారిజాతంలో యిది వైదికులతో వుందనీ రాశారు. తెలంగాణలో కింది కులాల్లో కూడా చాలా సాధారణంగా వాడుతారు,ఇది తమిళం 'కొండుపో' కి దగ్గర )
సాధారణంగా వాడతారు దీన్ని )
కొంచెపు గునం = వెలితిపడే గుణం
కొంచెపుతనం = అల్పత్వం
కొంటెపోరడు = తుంటరి
కొండకు ఎదురు చూసినట్లు చూసుడు = ఎంతో ఆత్రుతతో ఎదురు చూడ్డం.
కొండి = కొక్కెం
కొండివెట్టుడు = మెలికపెట్టడం, మడత పేచీ పెట్టడం
కొండీలు = కొండెములు
కొండెంగ = కొండముచ్చు
కొంద్రుగాడు = గొర్రెలు మొ॥ వాటి మీద పడే జంతువు
కొంప కొల్లారం అవుడు = ఇల్లంతా నాశనమవుడం. ఇల్లు గుల్లవడం
కొంపల గుత్తోడు = కొంపలు కూల్చేవాడు
కొచ్చెగ = పదునుగా
కొజ్జ = నపుంసకుడు
కొజ్జె = కొజ్జా
కొజ్జమనుసులు = కయ్యాలమార్లు
కొటార్లు = క్వార్టర్సు ?
కొటీర్ = కుటీరం లాంటి క్వార్టర్
కొట్టం = పశువుల పాక, దొడ్డి
కొట్టికొట్టి అడుగుడు = గుచ్చిగుచ్చి అడగడం
కొట్టుడు = బాదడం
కొట్టుడు (ఆర్) = ఆరుగంటలు కావడం

కొట్టువడుడు = చిక్కిపోవడం, పనిచేసి అలసి పోవడం
కొట్టేసుడు = భాగించడం
కొట్నాలు దంచుడు = ధాన్యం దంచడం
కొట్లాట = పొట్లాట
కొడలు (మంట) = జ్వాలలు
కొడలి, కొడాలి = కొడవలి
కొడిశె కట్టెలు = ఒకరకం కలప
కొర్తలేదు (వచ్చెటట్టు) = వచ్చేలా అనిపించడంలేదు
కొతిమీరు = కొత్తిమీరు
కొత్త = (తెలంగాణలో కొత్తపంట చేతికి రాగానే చేసుకునే పండుగ ) కొత్తంత పండుగలేదు అల్లునంత సుట్టంలేదు.... సామెత
కొత్తల = ప్రారంభంలో ( నేను కొత్తల మస్తు బయపడెటోన్ని. ఇప్పుడు జెర్ర నయం )
కొత్తలు = డబ్బులు
కొద్దిగ చెయితిరుగాలె = కాస్త చేతిలో డబ్బులు సమకూరాలి, వెసులుబాటు కావాలి
కొద్దిగంత = కొంత
కొద్దిగన్ని = కొన్ని
కొద్దిల, కొద్దిగంతల = కాసింతలో, వెంట్రుకవాసిలో
కొనగాడు = ఒక రకం తిట్టు
కొనమీద పెట్టు (నా) = ఒక తిట్టుపదం
కొనముట్టనిపని = సఫలం కానిది ? సమాప్తంకానిది, సుఖాంతం కానిది
కొనముట్టుడు = కడముట్టడం
కొనమొదలు తెల్వదు = ఆదీ అంతం తెలియదు
కొనాకరికి,కొసాఖరికి = చివరాఖరకు
కొనూపిరి = అంతిమశ్వాస
కొప్పెర = పట్టుకోవడానికి కడియాలుండే పెద్ద ఇత్తడిపాత్ర ( నీటికోసం వాడుతారు)
కొప్పెర = గొంగడి మొ॥ వాటిని ఒకరకంగా మడిచి తలమీద వేసుకోవడం ( గోపురం నుండి వచ్చి వుండాలి )
కొబ్బరికాయ = టెంకాయ
కొమ్ములచ్చుడు = గర్వాదులు కల్గడం
కొయ్యగాల్లు = వరి మొ॥వి కోయగా మిగిలినవి (పదబంధ పారిజాతంలో దీనికర్థం చెప్పి యిప్పుడు కొయ్యలు అనే పిలుస్తున్నారు అని పేర్కొన్నారు కాని తెలంగాణలో ఇప్పటికీ కొయ్యగాల్లనే అంటారు.)

కొరకొర = కొట్లాట, కోపం
కొరకొర చూసుడు = చురచుర చూడడం
కొరాడు = కొట్టం
కొరిపానం = అంతిమశ్వాస
కొరుకుడు = రక్కుడు
కొర్త = కొరత
కొర్రమట్ట = కొర్రమీను
కొర్రిచీమలు = కొర్విచీమలు
కొర్రివెట్టుడు = మెలికపెట్టడం
కొర్లు = కొరివి చీరులు
కొర్కాసు,కొర్రాయి = కొరివి, మండిన వంటచెరకు, పొయ్యిలకట్టె
కొలుచుకునుడు = నిలబడి అదేపనిగా కొట్లాడం
కొలువు = ఉద్యోగం
కొల్లకుండ = కొలకుండ
కొల్లాపురం = లేని తలనొప్పి, లేని రామాయణం
కొల్లి = స్త్రీలింగం
కొల్లుగుంట = బాలింతకు, శిశువుకు స్నానం చేయించే గుంట
కొసంత = కొద్దిగంత
కో ఆట = కోకో
కొంద్ర = కొంద్ర
కోక (పాన్) = కిళ్ళీబడ్డీ
కోగులు, కోగిలెలు = కొర్వి చీమలు
కోట వెట్టినట్టున్న ముక్కు = కోటేరులాంటి ముక్కు
కోటర్ = క్వార్టర్
కోటొక్కదేవుల్లు = కోటి దేవుళ్ళు
కోడాం / కోడం = కొట్టం
కోడిగుడ్డు అట్టు = ఆమ్లెట్
కోడిజుట్టుకూర = కోడి జుట్టు ఆకారంలో ఆకులున్న తోటకూర
కోడినిద్ర = కూచున్న చోటే కాసేపు విశ్రమించడం
కోడిమెదలు ఏనుడు=వాడిపోయి నిస్సత్తువతో వుండడం
కోడిమెదడు = తక్కువ మెదడు
కోతమిష్మి = సామిల్
కోతికి పుండు పుట్టినట్లు = ఎంతకూ మాననిది అని అర్థం
కోతిమొకం = అనాకారి మొగం, తిమ్మరాజు
కోతుకం = కోపం
కోదండం = బడిపిల్లలను వేలాడదీసి కింద కంప పెట్టి శిక్షించడం

కోన్‌కిస్కాగాడు = అనామకుడు
కోనాయె అనెటోడు లేడు = పలుకరించేవాడు లేడు ( కోన్ అయా అనేవాడు ?)
కోపం పొడుసుకచ్చుడు = కోపోద్రిక్తుడు కావడం
కోపగొండి, కోపగొండోడు = కోపిష్టి
కోపన్ = రేషన్
కోపు = కప్పు, Cup
కోపులల్ల వుండుడు = అడవిలో వుండడం
కోపులు = రోడ్లు మొ॥నవాటికోసం మట్టిని తవ్వగా ఏర్పడిన గుంతలు
కోమటిదెబ్బ = అర చేయిని దొప్పలా పెట్టి వీపుపై తగులకుండా కొట్టే దెబ్బ
కోమలిపోరగాడు = పడుచు వయస్సుగాడు
కోయమ్మ కొండలల్ల = (సుదూరంగా కొండల్లో కోనల్లో అని అర్థం ) ( కో అంటే తమిళంలో దేవుడు కోయమ్మ అంటే దేవత... దేవతలు ఉండే సుదూరమైన కొండల్లో అని అర్థం ) కోయంబత్తూరు యిలాంటిదేనేమో ! (కో+అంబత్తు+ఊర్) అంబ అంటే అమ్మ అనే కదా అర్థం
కోర = బొక్కెన
కోరం = తగినంత మంది
కోరలు పోవుడు (పండ్లు) = అతి పుల్లని వస్తువుల్ని తినగా దంతాల పొరపోయి యిత పదార్థలను తినలేకపోవడం
కోలలేసుడు = ఆడవాళ్ళు కోలలు వేయడం
కోలాటం = తలమీద గొంగడి మొ॥నవి మడిచి వేసుకోవడం
కోలాటం = మగవాళ్ళు కోలలు వేయడం
కోల్లాగ = కోడె
కోవ, కోవా = మీగడ
కోశిష్ (ప) = ప్రయత్నం
కోసు = వంకర,రెండు మైళ్ళు, క్రోసు
కోసురం = కోసం
కౌలు = భూమిని ఒప్పందం మేరకు యివ్వడం
కౌసు = మాంసం
కౌసువాసన = నీచువాసన ( చేపలు మొ॥ వాటి వల్ల కలిగే వాసన )
క్యాలి (అ) = స్పృహ ( ఖయాల్ నుండి వచ్చింది) ధ్యాస
క్లాసుమెంటు = క్లాస్‌మెట్

## గ

గంగ = నీరు, గోదావరి
గంగరాల్లు = బావిలో రింగుల కింద ఆధారంగా వేసే రాళ్ళు
గంగల కల్సుడు = ఏట్లో కలవడం, నశించిపోవడం
గంగాజమున = 1. రవ్వ మరియు శనగపిండితో చేసిన లడ్డు. 2. కలాకాన్ మరియు గులాబ్‌జామున్
గంగాలం = నీళ్ళకోసం వాడే ఇత్తడి పాత్ర
గంగ రాల్లు తేలుడు = సంసారం గతి మారిపోవడం, బావినీళ్ళు రింగుల కింది గంగరాళ్ళు వరకు వెళ్లడం
గంజి = మార్కెట్ యార్డు ( ధాన్యదుల )
గంజిల ఈగను తీసేసినట్లు చేసుడు= ఒక మనిషిని చులకన చేయడం
గంజు = గిన్నె
గంటకొట్టినట్లు = ఘంటాపథంగా, కంఠోక్తిగా. ముక్తకంఠంతో
గంటెజారుడు పప్పు = పలుచగా చేసిన పప్పు
గంటెపుస్తెలు = గంట ఆకారపు పుస్తెలు
గంట్లు పెట్టుడు = కలహాలు పెట్టడం
గండ కరువు = పెద్ద కరువు
గండ పరుకలు = పెద్ద పరకలు
గండదీపం, నందదీపం= వ్రతాదుల్లో నిర్ణీతసమయం వరకు వెలిగే పెద్ద దీపం
గండమాల = చెరకుకు పట్టే తెగులు
గండానవుట్టుడు = మరొకరికి గండంగా జన్మించడం
గండి = నిర్జనారణ్యం, పెద్ద అడవి, చెరువు గండి
గండు = పెద్ద
గండుకు గండు = లావుగా
గండుచీమ = గండ్ర చీమ
గండుపిల్లి = భయంగొలిపేపెద్ద పిల్లి
గండ్రపేగు = అరికంట్లం
గంత = అంత
గంతగనం = అన్ని
గందం = గంధం, చందనం
గందపట్టె = తలుపులకు అడ్డంగావేసే కఱ్ఱ
గందుకని = అందుకని
గంపగుత్త = మొత్తంగుత్త, మొత్తానిక మొత్తంగా

గగ్గెర = లంగా
గగ్గోడు = చేయికో, కాలికో దెబ్బ తగిలినప్పుడు గజ్జల్లో, చంకల్లో దిగిన ఉబ్బెత్తు భాగం ( మనం గగ్గోలు పడదగింది కనుక గగ్గోడు)
గచ్చు = సిమెంటునేల
గజ్జగజ్జ వన్కుడు = గజగజావణకడం
గజ్జెల గుఱ్ఱం = వన్నెల వినసకఱ్ఱ
గజ్జలు = కాలి, చేతి గజ్జలు
గజ్జి = తామర
గజ్జికుక్క = గజ్జి పట్టిన కుక్క
గజ్జుమనుడు = ఉలిక్కిపడడం, భయపడడం, గజగజలాడడం
గజ్జెకర్నం = వలయాకారంలో చిన్న కురుపులతో ఏర్పడిన ఒక తామర
గట్క = సంగటి
గట్టి చేసుకునుడు = పెళ్ళి మొ॥నవి ఖాయం చేసుకోవడం
గట్టిపెండం = ఘటికుడు, ఘనాపాటి
గట్టిపిండి = నలుగుపిండి, అటకలి ?
గట్టిపెట్టుడు = పలకలు, బోర్డులకు, బీరాకులు బొగ్గులు దంచి పెట్టడం
గట్టోన్ని = ఆరోగ్యవంతుణ్ణి ( మీ అందరికన్న నేనే గట్టోన్ని ! )
గడ్కొయ్యలు = గడకఱ్ఱలు ? ( బండిమీద కూర్చునే పొడుగు కఱ్ఱల రంధ్రాల్లో పెట్టిన కఱ్ఱలు)
గడ్‌బడ్ = గడబిడ
గడంచె, ( గడమంచె ) = బెడ్‌షీట్లు మొ॥నవి వేసుకొనే చిన్న మంచం లాంటిది
గడలువడుడు (చెవులు) = చెవుల్లోకి నీళ్ళు పోయి ఒకరకంగా శబ్దం రావడం
గడి, గడీ = చిన్న కోటలాంటిది
గడికోసారి = గడియకోసారి, మాటికీ
గడిగడికి = గడియ, గడియకూ
గడియాల్ = గడియారం
గడిసేపు,గొడిసేపు = గడియసేపు, కాసేపు
గడుసుపోరడు = గడుసుపిల్లాడు
గడెక్కుడు డోల్ కొట్టుడు = ఒక్కడికి రెండు పనులు చేయాల్సిన దుస్థితి
గడ్డ = దుంప
గడ్డం = గెడ్డం
గడ్డకు పడుడు = ఒడ్డుకు బాధ్యత తీరి గట్టెక్కినట్లు కావడం (రామయ్యకు యిద్దరు పిల్లలు. పెద్దోనికి ఉద్యోగం దొరికింది. వాడు గడ్డకు పడ్డడు. ఇంకొకడు పడితె అయిపాయె )
గడ్డపార = గునపం
గడ్డపార ఈత = ఈతరాని పరిస్థితి (గడ్డపార కట్టుకుని ఈదితే చావే కదా గతి )
గడ్డి తొక్కిచ్చుడు = నూర్పిళ్ళ తర్వాత యింకా మిగిలిన ధాన్యం కోసం పశువులతో తొక్కించడం
గడ్డీగాదం = కసువుగఱ్ఱా
గడ్డురోజులు = కష్టకాలం
గడ్లెఏనుడు = ప్రాణంపోయేముందు గడ్డిపైపడుకోబెట్టడం(ఇది ఓ ఆచారం)
గతిమల్లె = గతిమాలిన
గత్కుడు = గతకడం, తినడం
గత్తర = కలరా
గత్తర రాను / గత్తర్రాను (నీకు) = ఒక తిట్టు
గదరాయించుడు, గద్దిరిచ్చుపెట్టుడు = గద్దించడం, భయపెట్టడం
గది = అది
గది గుఱ్ఱం గిది మైదానం = బాధ్యత లేనితనం
గదువ = గడ్డం, చుబుకం, గవద (గవదబిళ్లలు) (వర్ణవ్యత్యయం)
గద్ద = పిల్ల, అమ్మాయి
గద్ద లెక్క తన్నుకపోవుడు = గెద్దలా తన్నుకుపోవుడు
గద్దగాడు = అబ్బాయి,పిల్లవాడు
గద్దెలు = తిన్నెలు, అరుగులు, మోరీలు
గద్దోలె చేసుడు = పనులు చకచకా చక్కగా చేయడం
గద్మరిచ్చుడు = గదమాయించడం
గనకార్యం = ఘనకార్యం
గనె = (చెరుకు మొ॥వాటి) కణుపు
గన్క = కనుక
గన్నగిరాకి = అవసరం
గన్ను = పెద్ద సుత్తి (ఘనమైన సుత్తి)
గన్పతుల పండుగ = వినాయకచవితి
గప్ప గప్ప తినుడు = గబగబా తినడం
గప్పాల్ కొట్టుడు = పెగ్గెలకు పోవడం
గప్‌చుప్ = నిశ్శబ్దం
గబ్బు = కంపువాసన
గమండ్, గమాండ్ = గర్వం
గమాల = ఇనుపతట్ట

గమ్మత్ = తమాషా
గమ్మున = కిమ్మనకుండా
గయిండ్ల కెల్లిపోవుడు = గుమ్మంలోంచి వెళ్లడం
గయ్యిమని లేసుడు = కోపంతో గయ్యిన లేవడం
గరం = వేడిమి
గరంపెయ్యి = వేడిశరీరం
గరమవుడు = కోపానికి రావడం
గరిగెబుడ్డి = గురిగి ?
గరిమి = వేడిమి, ఉక్కపోత
గరిశె = వావిలి మొ॥ వాటితో గుమ్మిలాగా చేసినది
గరీబోల్లు (అ) = పేదలు
గరుక = పచ్చిక, గరిక
గరుష్మంతుడు = గరుత్మంతుడు
గర్జు = అవసరం
గర్జెలు = కర్జెకాయలు
గర్ర, గర్రు = గర్వం, పొగరు
గలిబిలి = కిందమీద కావడం
గలీజు = అశుద్ధం, కంపు, చెడు
గల్తి (అ) = తప్పు (గలత్ నుండి వచ్చింది)
గల్మ = గుమ్మం, వరి మడి మొ॥ వాటికి నీళ్ళు వెళ్ళే దారి
గల్మలల్ల = గుమ్మంలో
గల్ల, గల్లా = కాలర్, (గళం - గల్ల) పంటధాన్యం, క్యాష్‌కౌంటర్
గల్ల = వరకు ( పదిగల్ల మొ॥ నవి )
గల్ల ఉప్పు = దొడ్డు ఉప్పు
గల్లలు గల్లలు పట్టుకునుడు = కాలర్ పుచ్చుకుని బాహా బాహీతలపడడం
గల్లి = వీధి
గవా (ప) = సాక్ష్యం
గవ్వల గురిగి = (ఖజానా) నిధి,
గవ్వి = అవి, అయ్యి
గవ్వెత్తు పని = చిన్నపని
గసి = నూనెలాంటి పదార్థాల అవక్షేపం
గస్సాలు = గసగసాలు
గా = ఆ (గా ఊరు,గా పుస్తకం మొ॥నవి)
గాంక = కనుక
గాంచునూనె = కిరోసిన్, కిరసనాయిలు, గ్యాస్‌నూనె
గాండు = ముడ్డి
గాండుగాడు = చెడ్డవాడు అని అర్థం
గాగెర = చిన్నదైన కోలబిందె
గాచారం = గ్రహచారం
గాజర్ గడ్డ = ముల్లంగి, క్యారెట్
గాజు = రింగు (బావికి వేసేవి)
గాజుల్లేని వంట = మగవాళ్ళు చేసిన వంట
గాటు = ఘాటు, కారం
గాడి = రైలుబండి, ఎడ్లబండి మొ॥నవి
గాడిదగుడ్డు = ఏమీ లేదని అర్థం
గాడిదిచాకిరి = అరవచాకిరి
గాడిపొయ్యి = పెద్ద మొత్తంలో వంటలు వండడానికి ముందర గాడితో సిద్ధం చేసిన పొయ్యి
గాడు = వాడు, అతడు
గాడ్పు = దయ్యం,గాలి
గాతవారం = ఘాతవారం
గాత్తు / గాస్తు = గ్రహస్తు / గేస్తు
గాన / గ్గాన = కావున
గాబు = కాగు ?
గాయి = యాగీ, అల్లరి
గాయిగాయిచేసుడు=అల్లరల్లరి చేయడం, తొందర చేయడం ( మరాఠీలో ' గాయి ' అంటే తొందర అని అర్థం )
గాయింత = ఆ మొత్తం, చిన్నమొత్తం
గాయిగత్తర = తికమక పడడం ? గాయి = అల్లరి + గత్తర = కలరా ; ఈ రెండూ కల్పిన స్థితి
గాయిదోడు = అమాయకుడు
గాయిరి గాయిరవుడు = గాభరా పడడం
గారెలు = చెక్కలు
గార్వం, గావురం = గారాబం
గాలి దిగిపోయినట్లు అవుడు = నిరుత్సాహ పడడం
గాలిచ్చుడు = బియ్యంలో నీళ్ళుపోసి ఇసుక లేకుండా వెతకడం, పప్పులుమొ॥న ధాన్యాలను గాలించడం
గాలిదుమారం = దుమ్ముతోకూడిన గాలి
గాలిమాటలు = పొల్లుమాటలు
గావర గావర అవుడు = ఆకలితో గాభరా కావడం, తలతిరగడం
గావుపట్టుడు = మేక మొ॥ వాటి మెడల్ని కొరికి చావు పట్టడం, చంపడం
గాసం = తిండిగింజలు, గ్రాసం
గింద్రి / గిర్ని = వడ్లు,పిండి మర
గింత = ఇంత

గింతిగింత పిల్లలు = చిన్నపిల్లలు
గిచ్చుడు = గిల్లడం
గిట్ల = ఒకవేళ, గాని (కాని), వగైరా,గట్రా (తానం గిట్ల అయిందా?)
గిట్టువాటు = గిట్టుబాటు, లాభం
గిడ్డగాడు = పొట్టివాడు
గిత్త= కోడెకన్న చిన్నది
గిదగిద ఉర్కుడు= వేగంగా పరుగుపెట్టడం
గిది= ఇది
గిద్దెడు= పదికుంచాలు
గిన= ఒకవేళ
గిన్నెపిండి= సర్వపిండి
గిరఫ్తార్ = చుట్టుముట్టడం
గిరిగిరి = లాభానికి,వడ్డీలకు డబ్బులు తిప్పడం
గిర్క = చెరుకుగానుగ, గిలక(బావి), తాటాకులతో+ ఆకారంలో చేసి చొప్ప బెండుకు గుచ్చితే గాలికి గిరుక్కున తిరిగేది
గిర్దవరు(ప) = రెవెన్యూ ఇన్స్పెక్టర్
గిర్ని= మర
గిర్నీసు = గ్రీజు
గిర్మిట్ = గొల్లవాళ్ళకు డాక్టర్లు చేసే శస్త్రచికిత్స, కర్రలను తొలిచే సాధనం
గిర్వి(ప) = కుదువ
గిలగిల = సందడి
గిలగిలకొట్టుకొనుడు = విలవిల్లాడడం, (విలవిల-గిలగిల అయింది)
గిలాన = గ్లాసు
గిల్లిఅవుడు = పరారవడం
గిల్లిదండ = చిర్రగోనె
గివ్వి = ఇవి,ఇయ్యి
గీ = ఈ (గీ పుస్తకం, గీ పిల్లవాడు మొ॥నవి)
గిది= ఇది
గీటు = గీత
గీడు = వీడు,ఇతడు
గీమాలుడు = బతిమిలాడ్డం,(అరచి) గీపెట్టడం, బామాలడం
గీరె = చక్రం
గీసరిల్లుడు = గీమాలడం, దయనీయంగా అడగడం
గుంగురెంటికలు = ఉంగరాల జుత్తు
గుంజాయిష్ (ప) = వెసులుబాటు,లాభం
గుంజిగాడు = వెధవ
గుంజీలు = గుంజిళ్ళు
గుంజుకచ్చుడు=బాగాచిక్కిపోవడం, లాక్కొని రావడం
గుంజుకునుడు = వెనక్కితగ్గడం
గుంజుకొను = లాక్కొను
గుంజుడు = నొప్పి పెట్టడం(కాళ్ళు) లాగడం,పీకడం
గుంజులాడుడు = ఆడవాళ్ళను బలాత్కరించడం
గుంట = 121 చదరపు గజాల నేల, చిన్న లొంత, లొంద, గుంత
గుంటగలైరు = భృంగరాజం(ఔషధం మొక్క)
గుంటచిక్కులు = తంటాలు, చిక్కులు, లోతుపాతులు
గుండం = నిప్పులగుండం, పుష్కరిణి,గుడిదగ్గరి కొలను
గుండగాడు = గూండా
గుండీ = ఒకరకం గిన్నె
గుండిగె = గొంతు
గుండీలు = బొత్తాములు
గుండు = పెద్దరాయి,వెంట్రుకలు మొత్తంగా గొరిగినతల
గుండుకుజూసుడు = ఇల్లుకట్టేటప్పుడు సుతారి గోడ సరిగా వుందో లేదో అని గుండుదారం పెట్టిచూడడం
గుండు గుత్త = మొత్తంగుత్త,మొత్తానికి మొత్తంగా
గుండు పిన్ను= గుండు సూది
గుండు సున్న = శూన్యం,గుండ్రని సున్న,నిండుసున్న
గుండె ధైర్యం చెడుడు = అధైర్యపడడం
గుండెల గుండు పడ్డట్టు అవుడు = హఠాద్భయం
గుండెలుకూలిపోవుడు కార్జాలు కాలిపోవుడు = గుండెలుజారిపోవడం
గుండెవల్గుడు = గుండె పగిలి భోరున ఏడ్వడం
గుండ్రాటిగా = గుండ్రంగా
గుండ్లుపెరిగిపోవుడు/పెరుగుడు = ముత్తైదువల మెడలో గుండ్లు తెగిపోవడం
గుజ్జు = పండ్లలోనిది
గుటగుట = భయం,సందేహం
గుటికిల్లుమింగుడు = గుక్కిళ్లుమింగడం, నీళ్ళు నమలడం
గుట్ట = కొండ

గుట్టకు కుక్కమొరిగినట్టు = అరణ్యరోదనం
గుట్టకు రాల్లు మోసినట్టు = వ్యర్థమైనపని
గుట్ట గుట్టతాగుడు = గుటగుటాతాగడం
గుట్టపక్కకు నక్కవంగినట్టు = మాటువేసి ఉండడం (గుంటనక్కలాగా)
గుట్టబోర్లు = గుట్టలు,పర్వతశ్రేణులు
గుడ్క = కూడ
గుడ్ గుప్పుమన్నట్లుండుడు = బోసి పోయి నట్టుండడం
గుడగుడఅనుడు(మొగులు) = చిన్నగా ఉరమడం
గుడాలు = గుగ్గిళ్ళు
గుడి గుండంగాను = ఒక తిట్టు
గుడుగుడ్కలు =పెళ్ళిలో వధువు ఆచరించే గౌరిపూజ
గుడుంబ = సారా
గుడ్డం = చేను
గుడ్డికొంగలోలె బతుకుడు = దయనీయంగా బతకడం
గుడ్డికాయపడుడు = గుడ్డలుబాగా మాసిపోవడం
గుడ్డికాలం = అవగాహనలేని వెడ్డికాలం
గుడ్డిగ పోవుడు = అంధపరంపరన్యాయం
గుడ్డిముసురు = ఒకేతీరుగా వున్న ముసురు
గుడ్లకు కుంచెడు నీళ్ళు వడ్పుడు = కన్నీరు మున్నీరుగా ఏడ్వడం
గుడ్లుగూసుడు= చనిపోవడం,విఫలమవడం
గుడ్లువెట్టుడు = ఫెయిల్ అవడం
గుడ్డేలుగు = ఎలుగుబంటి,ఎలుగ్గొడ్డు
గుడ్లనీల్లు గుడ్లల్లనే కుక్కుకునుడు = బయటకు కన్పించకుండా ఏడ్వడం
గుత్తి = పప్పుగుత్తి, పూలగుత్తి, తాళాలగుత్తి, గుది, బంచ్
గుత్తులకు గుత్తులు = గుత్తులు గుత్తులు
గుత్తెదారు = గుత్తదారు, కంట్రాక్టరు
గుత్పలు = బడితెలు, గుదియలు
గుదిగుచ్చినట్లు = కిక్కిరిసినట్లు (దగ్గర దగ్గర)
గుద్దకడుగరానోడు = ఏమీ తెలీనివాడు
గుద్దబట్టమీద సోయిలేనోడు = స్వీయ స్పృహ లేనివాడు
గుద్ద బద్ర చలం పోవుడు = అశుద్ధమైనది పుణ్యస్థలానికి వెళ్లడం
గుద్దకుపండ్లచ్చుడు = కండకావరం, పొతరించడం
గుద్దకెకిలోడు = ఎందుకూ పనికిరాని వాడు
గుద్దల మాడుడు = కడుపులో మాడడం
గుద్దలకు = మొదలంటా, బొత్తిగా
గుద్దాకిట్ల = అత్యంత సమీపంలో, తలవాకిట్లో
గునకారం = హెచ్చవేత
గునమిచ్చుడు = గుణం చూపడం ( ఆ మందు గునమిచ్చింది )
గున్క, గున్గ = గునుగు
గున్నమెదలు = దగ్గరగా వున్న మెద
గున్నతల్లి = గున్నలా బొద్దుగా ముద్దుగా వున్న చిన్నపిల్ల
గున్నాలు = బుట్టాలు
గున్సుడు, గుల్గుడు = గొణగడం
గుప్పుకునుడు = చల్లుకోవడం (నీళ్ళు మొ॥నవి)
గుబురు = పొద
గుబ్బకాయలు = పులిచింతకాయలు
గుమాన్ = అనుమానం
గుమాయించుడు = రుచికరంగా వండడం
గుమ్మి = గుమ్మ ?, కుమ్మి ?
గుయ్యారం = చిన్నపిల్లలు అదేపనిగా ఏడ్వడం, చీకటి గుయ్యారం - గహ్వారం, (గుహ్యాగారం)
గుర గుర (గొంతుల) = గొంతులో ఏదో అసౌకర్యం
గురత్తం, గురత్వం = కృతజ్ఞత, గౌరవము
గురస్తుడు = విశ్వసనీయుడు
గురి = నమ్మకం, విశ్వాసం, లక్ష్యం
గురిగి = పిడుత
గురిజె = గురివింద
గురుజు = బురుజు ?
గురూప్లు = గ్రూపులు
గుర్కాయించుడు = కోపించడం
గుర్తువట్టుడు = ఆనవాలు పట్టడం
గుర్రపు బేయిమాన్ తనం = కృతఘ్నత
గుర్రపు మూతులు = మడమలకు వచ్చే రోగం
గుర్రమెక్కినట్లు అవుడు = ఎంతో సంతోషం కలగడం
గుర్రు = గురక, కోపం, గర్వం
గులగుల = గుల, దురద, డబ్బులు ఖర్చుచేయాలన్న యావ
గులాపోడు (అ) = బానిస ( గూలాం నుండి వచ్చింది)
గులాల్ = హోలీ మొ॥ సందర్భాల్లో చల్లుకునే పొడి
గులేర్ (ప) = వడిసెల, ఉండేల్. (గులేల్ నుండి వచ్చింది )

గుల్కోజు = గ్లూకోజు, సెలైన్
గుల్పారం = క్లోరల్ హైడ్రేటు
గుల్పులు = బల్బులు, విద్యుద్దీపాలు
గుల్బంద్ = మఫ్లర్ (దుల్బంద్ నుండి వచ్చిందా ?)
గుల్ల = గంప
గువ్వం = గుజ్జు (పండ్లలోనిది)
గుసాయించుడు = ప్రవేశించడం
గూండ్ల = బోయ
గూజు = ఈత మొ॥ వాటి గుజ్జు
గూడ ఏసుడు = ఏటి పక్క చేనుకి గూడ ద్వారా నీళ్ళు పారించడం
గూడలు = చెప్పుల గూడలు
గూడ్క = కూడ
గూత = దమ్ము, ఊపిరి, మాట కూత
గూద దిగుడు = ఆసనం దిగడం
గూదపూకోడు = దర్‌పోక్ ?
గూన = పెంకు
గూనపెంకలు = పెంకులు
గూబం = గువ్వం, గుజ్జు
గూబగుయ్యిమనుడు = చెంపమీద కొడితే గూబలు నొప్పి పుట్టడం
గూసుడు = చచ్చిపోవడం, కూయడం
గూసులాడుడు = కొట్లాడ్డం
గెంటిచ్చుకరావాలె = వెట్టుకురావాలి
గెంటీలు = గంటీలు, ఒకరకపు చెవుల ఆభరణాలు
గెట్టు = గట్టు, హద్దు
గెట్టురాయి = గట్టురాయి
గెదరు గెదరు వానన = మేకలు మొ॥వాటి మలమూత్రాదుల వాసన
గెదుముడు = తరమడం (గదమడం)
గెనెలకట్టె = కఱుపుల కర్ర
గెరువు = తెరిపి, వర్షం వెలవడం
గెలికి కయ్యం పెట్టుకునుడు = గిల్లికజ్జాలు పెట్టుకోవడం
గెలుకుడు = కదిలించడం, కెలకడం
గెల్లకిచ్చుడు = కెల్లగించడం
గేంగులు, గేగులు = తేగలు
గేరచ్చిపడుడు = శోషలొచ్చి పడిపోవడం
గైకట్టె = కొంకి
గైరాజరు = అనుపస్థితి
గైరికట్టె = టేకు కానిది
గొంగడి = కంబళి ( గొంగలి పురుగనే అంటాం)
గొంగడి కప్పుడు = అబ్బాయిలకు గొంగడి కప్పే ఒక ఆచారం
గొంతుకూసునుడు = గొంతుపట్టడం
గొందు = గొంది
గొగ్గాల్లు = మోకాళ్ళపై కూచోవడం
గొగ్గిపండ్లు = కొక్కెరపళ్ళు
గొటాల్‌కొట్టుడు = దరిద్రం కొట్లాడ్డం
గొట్టం = పొయ్యి ఊదే గొట్టం
గొట్టం గోలి = క్యాప్సూల్
గొట్టు = కఠినం
గొడగొడ ఏడ్చుడు = బాగా ఏడవడం
గొడిశింతసేపు = కాసేపు, గడియంత సేపు
గొడ్డలిశిప్ప = చిన్నగొడ్డలి
గొడ్డువోలేదు (ఊరు) = ఊరులో మంది వుండి న్యాయంజరుగుతుందని, ఆధారం దొరుకుతుందని చెప్పడం
గొడ్లు = పశువులు
గొడ్డె = పెంటిక ?
గొడ్డెలు = మలం
గొబ్బరికాయ = కొబ్బరికాయ, టెంకాయ
గొబ్బెమ్మలు = గొబ్బిళ్ళు
గొరగొర గుంజుకపోవుడు = బరబరా లాక్కెళ్లడం
గొర్రగొర్ర గుంజుకపోవుడు = గొరగొరా లాక్కుపోవడం
గొర్రెదాటుడు మంది = అంధపరంపర న్యాయం
గొర్రెమంకురుగాడు = మొండివాడు, మూర్ఖుడు
గొర్రెను కొట్టినట్లు = అమాయక జీవిని కొట్టినట్లు
గొల (అరటి) = గెల
గొలుకలు / గొలుసులు (వరి) = గెలలు
గొల్కలు = చీమిడిధారలు
గొల్లలెక్క = స్థూలంగా వాటికి చేసే చిన్న లెక్క
గొల్లతిక్క = విపరీతమైన హఠం, వెర్రి
గొల్లెం = గడియ (తలుపు)
గొల్లెంబెట్టుడు = మెలిక, పేచీ పెట్టడం
గోండ్రిగాడు = గొర్రెలు మొ॥ వాటిని తినే జంతువు, మండ్రకప్ప
గోంత = కొద్దిగంత
గోందు = జిగురు, బంక
గోక = బాతు

గోకర్ణం = చారు పోయడానికి వాడే ఆవు చెవిలాంటి ఆకారంగల పాత్ర
గోకు = పాలగోకు ?
గోకుడు = తామర, గజ్జి
గోకులాష్టమి = కృష్ణజన్మాష్టమి
గోగుపూలు = మోదుగుపూలు
గోచారపోల్లు = గ్రహచారం చెప్పేవాళ్ళు ?
గోజ అసోంటి మనిషి = సాధువు
గోజలు = పశువుల, గోదలు
గోటీలు = గోలీలు, గోలికాయలు
గోటు = చేతిగాజులకు ముందూ వెనక వేసే ప్రత్యేకమైన ఖరీదైన అందమైన, మందమైనగాజు
గోడకుర్చి ఏసుడు = గోడకు నిటారుగా నించోబెట్టి శిక్షించడం
గోత్రం మోసుడు = భర్త తాలూకు గోత్రం మోయడం, అత్తవారింటికి అమ్మాయి రావడం
గోదాం = గిడ్డంగి (Godown)
గోపాలం పాడుడు (ఎండుగుజూని) = బిచ్చమెత్తడం
గోబి = క్యాబేజి
గోమార్ (గోమారి) = పశువులకు పట్టే ఒకరకమైన పురుగులు, గో(వుల) మారి
గోరం = ఘోరం
గోరి = సమాధి
గోరుకొయ్యలు = ఆకాశంలో గొర్రుకొయ్యల్లాంటి మూడు చుక్కలు
గోరెంతదగ్గు = కోరింతదగ్గు
గోరెచ్చని నీల్లు = గోర్వెచ్చనీళ్ళు
గోర్గాలు = గోరుగల్లు, గోరుగాలు ( మంగలి దీంతో గోర్లు తీస్తాడు )
గోర్జం = ఎర్రగా వుండడం ( మాంసాదులు )
గోర్నామ = గోరుచుట్ట (గోర్లసందులో) యిరికిన మట్టివల్ల వచ్చే వ్యాధి
గోర్లు = గోళ్ళు
గోల్గ = గుండ్రంగా, గోళాకృతిలో
గోల్‌మాల్ = కిందామీదా, మోసం
గోలి = మాత్ర
గొలిచ్చుడు = నూనెలో వేపడం
గోలుకొనుడు = కోలుకోవడం
గోలుడు = నూనెలో చక్కగా కాలడం
గోలెం = గోళాకారంలో వుండే నీటిపాత్ర
గోశి పోసుడు = గోచీ బిగించడం, సవాల్ చేయడం
గోషా = బురఖా
గోస = బాధ, ఉసురు
గోసగోసోలె = చాలా దీనంగా, కడుదయనీయంగా
గోసాదు = ఆడవాళ్ళు గోచీ పెట్టడం
గోసాయి = గోస్వామి
గొగోడిపోరడు = అనాథ
గౌడులు = గమండ్లవాళ్ళు
గౌడుబర్రె = బాగా పాలిచ్చే గౌడజాతి గేదె
గౌను= ఫ్రాకు
గౌర = గరాటు
గౌరత = గౌరవం
గౌరమ్మ = గౌరీదేవి
గౌరమ్మను చేసుడు = బతుకమ్మ పండగ మొ॥లగు శుభకార్యాల్లో పసుపుతో చిన్నగా గౌరమ్మలాంటి ఆకారం చేయడం
గౌరాంతం = గర్వం
గౌషన్ = మెత్తలు, పరుపుల కవర్
గౌసుడు = బొబ్బలు చితకడం
గ్యానం = జ్ఞానం
గ్యాపకం, గ్యాప్తం = జ్ఞాపకం
గ్యారకల్పుడు = మోసగించడం
గ్యాస్‌నూనె = కిరోసిన్, కిసరనాయిలు

## చ

చండమార్కుడు = దుర్మార్గుడు, రాక్షసుడు
చందకాడ = సందెవేళ
చందా = విరాళం
చంద్రవంకలు = వడ్లపేర్లు ?
చకినాలు = చక్కిలాలు ?
చక్కిల్‌గులి = చక్కిలింతలు, గిలిగింతలు
చక్కెర కుడుకలు పోసుడు = ఆడపడుచులు తమ సోదరులకు కురిడీలనిండా చక్కెర నింపి నోట్లో పోసే ఆచారం
చచ్చినట్లు = తప్పనిసరిగా
చచ్చిపోవుడు = పోవడం, చనిపోవడం
చచ్చిబతికినట్లు అవుడు = పునర్జన్మ పొందినట్లు కావడం ( ప్రమాదాదులు తప్పించుకుని )
చచ్చుకుంట వచ్చిండు = చచ్చీ చెడి వచ్చాడు

నలిమెల భాస్కర్

చచ్చౌకం = చతురస్రం, చదరం
చడావ్ = ఎగుడు
చత్వార్లు = చత్వారం
చదివిచ్చుడు = కట్నాలు, చదివింపులు
చదువుడు = అన్నదే అనడం
చద్ది = చలిది
చపాయించుడు = అచ్చువేయడం
చప్కాయించుడం, చిప్క్యాయించుడం = అంటించడం (జిగురుతో)
చప్పరిచ్చుడు = కొట్టడం
చప్పుడు జెయ్యక = నిశ్శబ్దంగా
చబ్బీస్ జనవరి = ఇరవయ్యారవ జనవరి
చమిలి = బతుకమ్మ సందర్భంలో బియ్యం, పల్లీలు, పప్పు దినుసులు మొ॥ వేయించి చేసిన తీపి పదార్థం
చమ్కాయించుడు = మెరిసిపోవడం
చర్కా (ప) = రాట్నం
చల్ = నడువు, పద, వెళ్ళు
చలిజెరం = మలేరియా
చలిపిడుగు = పెద్దగా నష్టం చేయని పిడుగు
చలువ శరీరం = ఎప్పుడూ చల్లగా ఉండే శరీర ప్రకృతి
చల్లవడుడు = తినడం (కడుపు చల్లపడడం లేదా తినడంతో మంట తగ్గిచల్లవడడం ), ఎండ చల్లబడడం
చల్వచేసుడు = చల్లబడడం ( వేడిగావున్న శరీరానికి చలువ చేయడం )
చాంతాడు = చేదత్రాడు
చాకు (ట) = కత్తి
చాక్నారు = Sharpher
చాత = సేవ
చాతగాకపోవుడు = చేతనవకపోవడం, వల్లగాకపోవడం
చాతగానోల్లు = బలహీనులు
చాతి = రొమ్ము
చాపత్త = తేయాకు, టీపొడి
చాపలు = చేపలు
చాయ్, చావ, చాయ (ప) = టీ
చార్‌పత్తా (చార్‌పల్లి) = నాలుగుడబ్బాలాట
చార్‌మినార్ = గోలకొండ నవాబులుహైద్రాబాదులో కట్టించిన నాలుగు స్తంభాల చారిత్రక కట్టడం

చారాన = పావలా, నాలుగణాలు
చారు = రసం
చాల్ అవుడు (పని) = ప్రారంభం కావడం
చాల్‌పోరడు = తెలివిగల అబ్బాయి
చాలాకి, చాల్బాజితనం = చలాకీతనం, హుషారుతనం
చాలియాలు = పోకలు, భాగాలు
చాష్టలు = చేష్టలు
చింగులు = కుచ్చిళ్ళు, చుంగులు
చింతపూకార్తె = అశ్వినికార్తె
చిందులు తొక్కుడు = ఎగిరెగిరిపడడం
చింపుడు = చించుడు
చిక్కు = బోల్లచిక్కు, దువ్వగా ఊడివచ్చిన వెంట్రుకల చిక్కు
చిక్కుబొక్కు = కలగాపులగం
చిక్కురాత = గొలుసురాత
చిక్కుల దువ్వెన = చిక్కంటి
చిక్కులు = లోతులు, మర్మాలు
చిక్యం = ఉట్టి ?
చిచోర = సిల్లీ
చిచ్చుపెట్టుడు = నశింపచేయడం( నిప్పు మొ॥ వాటితో )
చిచ్చుబుడ్డి = మతాబు ? (Flower pot ?)
చిచ్చురుకుడు = సతీ సహగమనం
చిటచిట = కోపం, విసుగు, అయిష్టం (మనుష లంటే అసలే పడకపోవడం), దురద
చిటారుకొమ్మ = చిట్టచివరికొమ్మ
చిటికెల = క్షణంలో
చిట్కురం పాట్కురం = చిటపట, గొడవ, సయోధ్యలేమి
చిట్టచిట్టచేసుడు, నడుసుడు = చకచకా చేయడం, నడవడం
చిట్టి= ఛిట్
చిట్టిగొట్టుడు = కాపీ కొట్టడం
చిట్టీ ! = చిట్టీ, చిన్నా అని పిలవడం
చిట్టు = ఉన్క
చిడాయించుడు = వెక్కిరించడం
చిత్తడి = పాదలు, తుప్పలు, బురదలతో అంతా మరుగు అయిన చోటు
చిత్తుకాపి = రఫ్‌నోట్ బుక్కు

చిత్తుడు = చిమ్మడం (బురదలాంటివి)
చిత్తుబొత్తు = బొమ్మాబొరుసు
చిత్రం = విడ్డూరం
చిత్రపోవుడు = ఆశ్చర్య పడడం
చిదుమ చిదుమ పాడ్సుడు = చచ్చేలా కుళ్ల బొడవడం, చిదుముతూ పాడవడం
చిద్రం = రంధ్రం
చినాలి = లంజ
చినుకు పడ్డంక = వర్షాలు వచ్చాక
చిన్గడు = చిరగడం
చిన్నంత్రం పెద్దంత్రం లేకుంట = చిన్నాపెద్ద లేకుండా
చిన్నచూపు = చులకన
చిన్నతనం = అవమానం
చిన్నపాటి = చిన్నదైన
చిన్నపుష్యాల = పునర్వసు
చిన్నమెత్తు = కాసింత కూడా, నాల్గు గురిజల ఎత్తు
చిన్నాయి = పిన్ని
చిప్పలు చేతికచ్చుడు = బిచ్చమెత్తుకోవడం
చిమ్మట = శ్రావణం
చిమ్మన్ జీకటి = చిమ్మచీకటి
చియ్యకూర = మాంసపుకూర
చిర్రగోనె = బిల్లంగోడు
చిర్రుకచ్చుడు = కోపానికి రావడం, చిర్రుబుర్రు లాడడం
చిలకరిచ్చుడు (నీళ్ళు) = చల్లడం
చిలుం = తుప్పు, కిలుం
చిలుకోలె వుండుడు (పిల్ల) = అందంగా వుండడం
చిల్కకు చెప్పినట్లు చెప్పుడు = బాగా అర్థం చేయించడం
చిల్కనవ్వు నవ్వుడు = అందంగా చిలకలా నవ్వడం
చిల్లం కల్లం = చిందరవందర
చూడక చానొద్దులైంది (నిన్ను) = చూసి చాన్నాళ్ళైంది (నిన్ను)
చూసుడు = చూడడం
చూసెవరకల్ల = చూసేసరికల్లా
చూసేపురావు = చూద్దువురా
చెంగడ బింగడ దుంకుడు = ఇష్టం వచ్చినట్లు దూకడం
చెంగలిచ్చుడు = ఉప్పొంగిపోవడం
చెంగోబిల్ల అనుడు = ఎక్కడివాళ్ళక్కడ వెళ్లడం
చెంచ (ప) = చంచా
చెండి, చెండు = బంతి
చెందచేసుడు = అందేలా చేయడం
చెందిరం = సింధూరం (ఉ॥ అన్మాండ్లకు చెందిరం బెట్టిన్రు )
చెంద్రం = చంద్రయ్య
చెంద్రన్న = చంద్రన్న
చెంప చెట్టిల్లుమనుడు = చెంపచెళ్ళుమనడం
చెంపలు = బుగ్గలు, లెంపలు
చెంపలొచ్చుడు = గవద బిళ్లల వ్యాధి
చెంబట్కపోవుడు = దొడ్డికి పోవడం ( చెంబు పట్టుకుని పోవుడు )
చెకిన్ = చెకింగ్
చెక్క = అరు (పేకలో), నపుంసకుడు
చెక్కగొట్టుడు = స్లాబ్ వేయడానికి ముందు చెక్కలు కొట్టి వుంచడం
చెక్కపార = చెక్కడానికి వాడే పార (ఇనుముతో తయారై ఉంటుంది) ( చెలక పారకూడానా ?)
చెక్కరి పుడిగె = వరపూజ
చెక్కరి బీమారి = షుగర్ రోగం
చెక్కి = విసుర్రాయి ? చక్రం ? పిండిమర
చెక్కుడీసుడు = కూరగాయలు మొ॥ వాటిపై పొట్టు తీయడం
చెకుడ = దూకుడు మనిషి
చెక్కుడాలు = నగిషీలు (కర్రలమీదివి)
చెక్రీన్ = సాక్రిన్, ఓ రకమైన చక్కెర
చెటాకు = 50 గ్రాములు
చెటాన చెంపదెబ్బ ఏసుడు = కొట్టడం
చెట్టిర్కపాము = చెట్లమీది ఆకుపచ్చని పాము
చెట్టీల = వీరగోల ?
చెట్టురోగం = తెగులు, చీడ
చెట్నీ = తొక్కు
చెట్లమందులు = ఓషధులు
చెట్లకు కాసుడు = డబ్బులు కాయల్లాగా చెట్లకు కాయడం
చెట్టు గుట్టలు పట్టుకోని = శంకరిగిరి మాన్యాలు పట్టి
చెడగొట్టువానలు = పంటను పాడు చేసే వర్షాలు
చెడి = బెత్తం
చెడి అమ్ముకున్నా = నష్టానికి అమ్ముకున్నప్పటికీ

చెడిబతుకుడు = జీవితంలో ముందు కష్టపడి పిదప సుఖపడడం
చెడుగు = కట్లపాము, దుడుకు పిల్లవాడు
చెడుడు = నీళ్ళు తగిలి కాళ్లకు పుళ్ళుకావడం
చెడ్డీ = నిక్కరు
చెత్త = శరీరం
చెత్తచెదారం = కసవుగట్రా
చెత్తు = స్లాబ్, కప్పు
చెత్రి = గొడుగు
చెదలు = చెదపురుగులు
చెద్దర్ (ప) = బెడ్‌షీట్
చెన్నంగి చెట్టు = చిన్నంగి
చెప్తాన = చెపుతున్నాను
చెప్పక చెయ్యక (పోయిండు) = చెప్పా పెట్టకుండా ( వెళ్లాడు )
చెప్పకుంట చెయ్యకుంట = చెప్పాపెట్టకుండా
చెప్పాలె = చెప్పాలి
చెప్పులు (హవాయి) = స్లిప్పర్స్
చెప్పులల్ల కాల్లు వెట్టుకుని ఉండుడు = స్థాన చలనానికి సిద్ధమై వుండడం
చెప్రాసి = అటెండర్
చెమట పుట్టకపోవుడు = హృదయం కరగక పోవడం
చెమన్ = తోట
చెమ్మ = పదన, తేమ
చెమ్మకాయలు = చమ్మకాయలు
చెమ్మడిదిద్ది, చెమ్మడిగిద్దిది = కబడ్డీ, హడావుడి
చెమ్మాసు = షవల్
చెయి దిరిగినంక = డబ్బుల విషయంలో వెసులుబాటు అయ్యాక
చెయినవట్టుడు = తోచడం
చెయిపంచి = చేసంచి
చెయ్యలేదు సేపలేదు = చెయ్యలేదు చెప్పలేదు
చెయ్యాన = ఆరణాలు
చెయ్యి తంగవుడు = డబ్బుకు యిబ్బంది పడడం, టైటు కావడం
చెయ్యి పెద్దది (వాని) = ఉదారుడని అర్థం
చెయ్యి కడ్గుడు = తినుడు
చెయ్యి గునం = హస్తవాసి
చెయ్యిచ్చుడు = మోసగించడం
చెయ్యిమలెవడుడు = చెయ్యి మరలబడి మెలికతిరగడం
చెయ్యిర్గినట్లు అవుడు = భుజం విరిగినట్లు కావడం
చెరవొయ్యి అయినా = చెరలోపడి అయినప్పటికీ
చెరి = తలా
చెరిసగం = సరిగా సగం సగం
చెరిసగం రాత్రి = అర్ధరాత్రి, నడిరేయి
చెరుకుపాలు = చెరకురసం
చెరుక్కట్టె = చెరుగ్గడ
చెర్రిగొట్టుడు = బండి రివర్సు తీసుకోవడం
చెలక చెల్క = చెక్క, చేను
చెలాకిగ = చురుకుగా
చెలుగుడు = కోయడం
చెల్కభూములు = ఎర్రనేలలు
చెల్తిమీదుండుడు (పని) = పని నడవడం
చెల్నం = స్పందన, చలనం
చెల్లె, చెల్లెలు = చెల్లి, చెల్లాయి
చెవి మీద పేనువారినట్లు ఉండకపోవుడు ఏమాత్రం పట్టింపులేక పోవడం
చెవిటి = చెముడు
చెవుల ఊదుడు = చెవులు కొరకడం
చెవుల ఏసుడు (ముచ్చట) = విషయం చెప్పడం
చెవుల గోపెం = చెవిలో గోప్యం / రహస్యం చెప్పడం
చెవులు మందమవుడు = చెముడు
చేజేతుల = స్వయంకృతంగా
చేతవట్టుకునుడు = ఒకరి బాగోగులు మొత్తంగా నెత్తిన పెట్టుకోవడం
చేతికర్చులకు యిచ్చుడు = పై ఖర్చులకు డబ్బులివ్వడం
చేతిమైలపోవుడు = చేతిచమురు వదలడం
చేతిల పని (ఇది నా) = సులభంగా అయ్యేపని (కరతాలామలకం)
చేతుల చెయ్యి గల్పుడు = విరోధాన్ని మరచి పోవడం
చేతుల బనీను = హాండ్స్ బనియన్
చేతుల మీద తిప్పుడు = డబ్బుని వడ్డీకి తిప్పడం
చేతుల లేకపోవుడు = ఏదీ తన అధీనంలో లేకపోవడం
చేతులార చేసుకునుడు = చేజేతులా చేసుకోవడం
చేతులు జోడించుడు = మొక్కడం
చేతులురాలేదు (పనిచేయాలంటే) = చేతులు రాలా
చేదగ్గు = క్షయవల్ల కల్గిన దగ్గు
చేదబాయి = నీళ్ళు చేదుకొనే బావి

చేదవుడు = అందరికీ అయిష్టుడు కావడం
చేదు = పిత్తకోశం, చేదుకట్టు
చేదుడు = తోడడం
చేపుడు లేదు ( చేసుడు లేదు ) = చేయడం లేదు
చేరోగం = క్షయరోగం
చేర్లు = తాళ్ళు (ఉట్టి)
చేసి చేసి బొక్కలు రెక్కలు తెల్లవడుడు = రెక్కలు ముక్కలవడం
చేసినంక = చేసాక, చేసింతర్వాత (చేసిన వెనక)
చేసుకున్నప్పుడు చెరిసగం = ఆలుమగలయ్యాక కష్టసుఖాలు సమానంగా పంచుకోవడం
చొక్కం = స్వచ్ఛమైన (వెండి బంగారాలు మొ॥ నవి)
చోటమోటనాయకులు = చిన్నా పెద్దా నాయకులు
చౌ చౌ = ఉపరితలం
చౌకిదారు = కాపలాదారు ?
చౌకోట్లు = తలుపులు మొ॥ వాటి చట్రాలు, ఫ్రేములు
చౌరస్త = కూడలి

## జ

జంగలు = అంగలు
జంగవిల్లి = (జెంగల్) అడవిపిల్లి
జంగిడీ = గేదెల మంద
జంజాట్కం = జంఝాటం
జంజెం = జందెం
జంత్రి = చిన్న క్యాలెండర్ ? (పాకెట్లో పెట్టగల్గింది)
జంపుకాన = బెడ్‌షీట్ ?
జంబి = జమ్మి
జంబికింది రాతలు = నీటిరాతలు
జకముకరాయి = చెకుముకిరాయి
జగ్డ = జగడం
జగిలి = అరుగు
జడకొప్పులు = జానపదుల క్రీడ
జడ్డు = సోమరి
జడ్తి = బలికి ముందు జంతువులు తమ యిష్టాన్ని ప్రదర్శిస్తూ తల వూపడం
జడ్పు = బరువు, భయం
జనాన (ప) = భార్యాపిల్లలు, మంది
జన్నెకిడిసినట్లు = స్వేచ్ఛగా వదలడం ( జన్నము = యజ్ఞము )
జన్నెపీనుగులు = ఏ పనీ చేతకాని వాళ్ళు
జన్మరంది = అజన్మాంత విచారం
జప్తుచేసుకునుడు = అధీనంలోకి తీసుకోవడం
జప్పున (పోయి) = తొందరగా (వెళ్లి)
జబర్ (అ) = గట్టిగా వుండడం
జబర్దస్తు = నిర్బంధం
జబాబు, జవాబు = సమాధానం
జబ్బ = భుజం
జబ్బల బనీన్ = భుజాలులేని బనియన్
జబ్బలు జారేసుడు = ముఖం వేలాడేసుకోవడం, నిరుత్సాహపడడం నీరు గారిపోవడం
జమ = ఆదాయం, కూడిక
జమగట్టుడు = చేర్చుకోవడం, లెక్కలోకి తీసుకోవడం
జమచేసుడు = కూడబెట్టడం
జమవుడు = పోగు అవడం
జమాకర్చు = ఆదాయవ్యయాలు
జమాన (అ) = కాలం
జమానత్ = జామీను
జమాననాటి ముచ్చట = అలనాటి విషయం
జమాబంది = పన్నుకట్టడం
జమాయించుడు = సర్దడం, కుదరడం
జమీన్ (అ) = భూమి, ఆస్తి, నేల
జమీన్ ఆస్మాన్ పరక్ = హస్తిమశకాంతరం, నేలకూ నింగికీ వున్నంత తేడా, నక్కకూ నాగలోకానికి ఉన్నంత తేడా .
జయమయితది = విజయప్రాప్తి తప్పదు
జరిగిపోవుడు (వాడు) = చనిపోవడం
జరుగుడు = తప్పుకోవడం (దారి)
జరుగువాటు = జరుగుబాటు
జరూర్ (అ) = తప్పక, వెంటనే
జర్దా (ప) = నమిలే పొగాకు
జర్పుడు = వాయిదా వేస్తూ పోవడం
జలంత్రం = జలయంత్రం (ఇల్లు జలంత్రమైంది)
జలగడిగినట్టు అయింది = ప్రక్షాళన జరిగి అంతా పోవడం ? ( ఇల్లు జలగడిగినట్లు అయింది )
జలుమలు = జన్మలు

జల్గురు జల్గురు = జిగురు, జిగటగా జారిపోవడం
జల్లిగంటె = చిల్లుల గరిట
జల్లిచ్చుడు = ఉరవడం
జల్ప = జలసా
జవ్డం = జగడం
జవాన్ = సైనికుడు
జాంగ = కట్‌డ్రాయర్
జాంటు = అతు, శష్పం
జాంబురంగు = వంకాయ కలర్
జాక్కునుడు = దాక్కోవడం
జాగ (ప) = స్థలం, ఇంటిస్థలం
జాగారం = జాగరణ
జాగీర్ = అధికారం ? పరిపాలన ?
జాగుడు మూతలు = దాగుడుమూతలు
జాజిరాట = కాముని పున్నమి సందర్భంలో ఆడే ఆట
జాడ = ఆనవాలు
జాడదీసుడు = ఆరా తీయడం
జాడల పోవుడు (వాని) = (వాని) గురించి వెళ్లడం
జాడుకట్ట = ఈత చీపురు
జాడ్యం = ఆలస్యం, మజ్జుతనం, జడత్వం
జాతి (అ) = కులం (తమిళంలో కూడా)
జాత్కం = జాతకం
జాత్ర = తిరునాళ్ళు, జాతరే, తిరునాల
జాన్ = ప్రాణం
జాన్‌దోస్తు = ప్రాణ స్నేహితుడు
జాబు = పాలిథీన్ లాంటి పెద్ద వరక్ కాగితం
జాము = ఆలస్యం
జాము మనిషి = సోమరి, గర్విష్టి
జాయిదాద్ (ప) = ఆస్థి
జారగొట్టుడు (ఎరువు, ఇటుక మొ॥) = ట్రిప్పులు కొట్టడం
జారిడ్చుడు = వదిలేయడం ( బాధ్యతల్ని జార విడవడం )
జారుకునుడు = చెప్పకుండా వెళ్లిపోవడం
జాలాట్ల = బావిదగ్గరి మురిక్కాలువలో
జాలి = టీ వడబోయు సాధనం
జాలిగుండె = దయా హృదయం
జాలిజాలి = నేత మొ॥నవి పలుచగా రంధ్రాలు రంధ్రాలుగా వుండడం
జాలు = ఊట
జిందగి = జీవితం
జిందాతిలిస్మాత్ = ఫారుఖీ వాళ్ళ మందు ( తెలంగాణాలో ఒకప్పుడు యింటింటా వుండిన సర్వరోగ నివారిణి లాంటి ఔషధం )
జిందాబాద్ = వర్థిల్లాలి
జికర్ (అ) = ప్రస్తావన, జోక్యం
జిక్కిరి (వాళ్ళు గిట్టరాజిక్కిరి) = కొంపదీసి వాళ్ళు వస్తారేమో !
జిగ్రిదోస్తు = ప్రాణస్నేహితుడు
జిట్టపులి = చిరుతపులి ( చిరుత = చిత్త = చిట్ట = జిట్ట )
జిట్టి = దృష్టి
జిట్టిపూసలు, దిష్టిపూసలు = పిల్లలపై యితరుల దృష్టి పడకుండా చేతలకు కట్టే నల్లని పూసలు
జిట్టీతపండ్లు = చిట్టిచిన్న ఈతపండ్లు
జిడ్డుగాడు = వదలనిమనిషి
జిత్తులమారి = మోసగాడు
జిద్దు (అ) = పట్టుదల, మొండితనం
జిబ్బు = పొదలు, తుప్పలు
జిమ్మ = నాలుక, చేప
జిమ్మేదారు (అ) = బాధ్యత, పూచీ
జియ్య = అశుద్ధం, మలం
జిర్రలు, జిర్రపురుగులు, జిల్లలు, జిల్లపురుగులు = బొద్దింకలు ( కన్నడంలో జిరళె )
జిలజిల = రోత
జిల్కర = జీలకర్ర
జిల్కరిచ్చుడు = చల్లడం, చిలకరించడం (నీళ్ళు)
జిల్లి = సైక్లోస్టయిల్
జివ్క = చివుక పిట్ట, జతుక
జివ్వుమనుడు = నీళ్ళు చాలా చల్లగా వుండడం
జీ = గారు
జీడి = మామిడి టెంకలోనిది
జీడి = మామిడికాయ తొడిమె తుంచగానే కారే రసం
జీడిత్తు = నల్లగా వున్నాడనడం
జీతం = వేతనం
జీతాలు నాతాలు = కూలీనాలీ
జీబు = జీపు
జీవ్నం, జీవ్తం = జీవితం
జీవంతం = ప్రాణం

జీవగంజి = చావుగంజి
జీవాలు = గొర్రెలు, మేకలు మొ॥ నవి
జీవి = ప్రాణం, ఆత్మ
జీవిలి = గుబిలి, గులిమి
జీవ్నాలు = ప్రాణాలు
జుంపాలు = జులపాలు
జుట్టు = పిలక, మొగోడు (36 జుట్లు కలుసుంటయి గాని 3 సికెలు కలిసుండయి )
జుట్టు = జుత్తు
జుట్టుకు = తలా
జుట్లకెల్లి ఎల్లుడు / పుట్టుడు = ఒకరి లక్షణాలన్నీ మరొకరు పుణికి పుచ్చుకోవడం ( వీడు వాని జుట్టకెల్లి ఎల్లిండు )
జుట్లు ముడేసుడు = కలహాలు పెట్టడం
జుమ్లా (అ) = మొత్తం, టోటల్
జుర్మాన = జరిమానా
జులాబ్ తీసుకునుడు = విరేచనాలు కావడానికి ఆముదం మొ॥ నవి తాగడం
జులూస్ (అ) = ఊరేగింపు
జుల్మ్ (అ) = బలవంతం, దౌర్జన్యం
జూ = కుక్కను పిలవడం
జూట = తప్పు, మోసం, అబద్ధం
జూల = ఉయ్యాల
జూలు = తలవెంట్రుకలు, జులపాలు
జెంగల్ = అడవి
జెంగల్ పట్టి (కి) = అరణ్య ప్రాంతానికి (కి)
జెంగలాతోల్లు = అటవీశాఖ వారు
జెంగిలి = ఆటవికమైన, మోటు
జెంగు (ప) = చిలుం, తుప్పు, ( జింగ్ నుండి వచ్చింది )
జెండకెక్కిచ్చుడు = ముగ్గులో దింపడం
జెండలుపాతుడు = నక్సలైట్లు భూస్వాముల భూములలో అధీనములోకి వచ్చినట్లుగా జండాలు పాతడం
జెండావందనం = పతాకావిష్కరణ
జెగజెగ మెరుసుడు = ధగధగా మెరవడం
జెగినీలు = కమ్మపేర్లు
జెట్టరోగం = జ్యేష్ఠ (దరిద్రపు) రోగం
జెట్టక్క కూసుండుడు = దరిద్రం తాండవించడం, ఇనుప గజ్జెల తల్లి తిష్ఠవేయడం
జెట్టజెట్ట = త్వరత్వరగా
జెట్టన = చటుక్కున
జెట్టముండకొడుకు = దరిద్రపు ముండాకొడుకు
జెనిగె = జలగ, తెలివి, పట్టుదలగలవాడు, కత్తిలాంటివాడు
జెన్కుడు = వణకడం, భయపడడం, జంకడం
జెప్పజెప్ప = త్వరత్వరగా
జెప్పన = చప్పున, వెంటనే
జెరంవచ్చుడు = జ్వరం తగులుకోవడం
జెర్రంత = కొద్దిగంత
జెర్రంతల = కాస్తలో, త్రుటిలో
జెర్రసేపు (జఱ్ఱ) (అ) = కాసేపు
జెర్రికి చీమలు తలిగినట్లు = ఒక జాతీయం
జెల్ది (ప) = వెంటనే
జేజ = దేవుడు
జేలు, జేల్కాన = జైలు
జేష్టపాలు = పెద్ద కుమారుని సేవకు ప్రతిఫలంగా కొంత అదనంగా యిచ్చే భాగం
జొబ్బుమనుడు (ఈగలు) = మునరడం
జోకం = మోసం
జోకుడు = తూకం వేయడం
జోటపట్టుకునుడు = ఒకరినొకరు విడువకుండా చేతివేళ్ళు పట్టుకుని తప్పి పోకుండా జోడుగా వెళ్లడం
జోతిషం, జోస్యం = జ్యోతిష్యం
జోపుడు = కొట్టడం, తోలడం (ఈగల్ని)
జోరతట్టు = గోనెపట్టా
జోరు (ప) = ఊపు, ఎక్కువ, శక్తి
జోర్దారు = ఊపు
జోర్దారుగ = ఆడంబరంగా
జోర్యిగ = జోరిగ
జోలి = ప్రస్తావన
జోశ్ (ప) = ఉత్సాహం, హుషారు
జ్యోతులోలెవుండుడు (కండ్లు) = కళ్ళు ప్రకాశవంతంగా మిలమిలా మెరవడం

*నలిమెల భాస్కర్*

## ట

టంకమెత్తు = 175 గ్రా.లు
టంకరి గొట్టుడు = మామిడికాయల్ని తొక్కదీసి చిన్నగా తరిగి ఎండవేయడం ?
టంకశాల = బొక్కసం
టక టక చేసుడు = చకచకా చేయడం
టక్కర్ = ఢీకొనడం (వాహనాలు)
టక్కుజేసుకునుడు = ఇన్‌షర్టు వేసుకోవడం
టపాకులు = టపాకాయలు
టప్పా = పోస్టు, తపాల
టాంకి, టాకీ = ట్యాంక్ (నీళ్ళది)
టాంగ = జట్కా
టాంగూసు = కుర్చీలు, మంచాలు అల్లే వైరు
టాంటాం అవుడు = అందరికీ తెలిసిపోవడం
టాకా = పెట్టుకుట్టు
టాన = పోలీస్‌స్టేషన్, రక్షకభటనిలయం
టాబు = ఎనిమిది కమ్మలు
టింగురంగ అనుకుంట = రంగ రంగ అనుకుంటూ
టికాన = నివాసం, చిరునామా
టిక్కి = చిన్న కుటీరంలాంటిది
టికెట్ = స్టాంపు (పోస్టల్)
టివిషన్ = ట్యూషన్
టీక్‌టాక్‌గా = ఠీవిగా, దర్జాగా
టుంగుటుయ్యాల = తూగుటూయల
టుంబుకుటుంబు = చాలా లావుగా వుండడం
టుపాకి = తుపాకి
టూరింగ్ = జీపు
టెక్క = కోకో
టేం = టైం
టేక్‌దార్ = బీడీ కంపెనీల కమీషన్ ఏజంటు
టేజి = స్టేజీ
టేల, టేలా (పాన్) = కిళ్ళీబడ్డీ
టేషన్ = స్టేషన్
టొంగ = మొట్టికాయ
టొంబై = తొంబై
టొక్క = కోకో
టోకర్ = తన్నడం
టోక్రా = మోసం, టోకరా
టోపన్ = మూత
టోపికుల్ల = కుళ్లాయి, కొల్లాయి
టోషన్ = సువ్వ

## డ

డంగ్‌సున్నం = బాగా డంగు (దంగిన) సున్నం, గార ?
డక్‌లాయించుకొచ్చుడు = నెట్టుకు రావడం
డక్కన్ = మూత (గిన్నెలమీది)
డక్కి = చిన్న డప్పు
డక్కుబట్ట = మెరిసిపోతూ తెల్లని, ఖాకీ రంగుల్లో వున్న శ్రేష్టమైన నిక్కర్ల, ప్యాంట్ల గుడ్డ
డగ్‌డగ్‌అవుడు = భయం కావడం, దడ
డప్పు = దప్పు
డబల్‌కమీట = బన్నుతో చేసే తీపి వంటకం
డబల్‌కారటు = రిప్లైకార్డు
డబల్‌బస్సు = డబుల్ డెక్కర్
డబల్‌రొట్టె = బన్ను
డబ్బ గొట్టుడు = అతిశయోక్తులు, సుత్తిగొట్టడం
డబ్బా = కాస్తపెద్ద డబ్బా
డబ్బి = చిన్నడబ్బా
డబ్బి = పాకెట్ (సిగరెట్టు)
డాంబర్ గోలీలు = కలరా ఉండలు
డాంబర్‌రోడ్ = తార్రోడ్డు
డాక్‌బంగ్ల = ఇన్‌స్పెక్షన్ బంగ్లా
డాకుటారి, డాకుతారి = డాక్టర్
డాగ్ (ప) = మరక ( దాగ్ నుండి వచ్చింది )
డాగ్‌బిటాయించడం = అవతలివాడు డంగైపోవునట్లు చేయడం
డాబ, డాబా = స్లాబ్, ఇంటిపై కప్పు, పంజాబీ వాళ్ళ హోటల్
డాలన బోలన చేసుడు = తిమ్మిని బమ్మిని చేసినట్లు మోసగించడం
డిక్కి = స్కూటర్ మొ॥ వాహనాల్లో సామాన్లకై ఏర్పరచిన చిన్న డబ్బా

డిగ్రి ఏసుడు = పాల చిక్కదనాన్ని లాక్టోమీటర్‌తో పరీక్షించడం
డిగ్రి (కాయిదం) = ఒప్పంద పత్రం
డిచ్‌గొట్టుడు = నొసలు నొసలు తగిలించడం
డిప్ప = తాబేలు డిప్ప
డిల్లి అస్మాన్ పరక్ = నక్క ఎక్కడ నాగలోకం ఎక్కడ ?
డిల్లెకి = తమాషా మాట (దిల్లగీ దిల్ లగీ)
డీలవడుడు = ఢీలా పడిపోవడం
డుంబుకడుంబు = చాలా లావుగా వుండడం
డుమ్‌కీలు కొట్టుడు = అనుత్తీర్ణుడు అవడం
డేకీస = వంటపాత్ర, గుండిగ ?
డేబర్‌సాబ్ = డ్రైవర్‌బాబు
డైకొట్టుడు = ఈతలో విన్యాసాలు చూపించడం
డొక్క = కడుపు
డొక్కు = పాడయిన బండి, పాతబండి
డొల్కలు డొల్లుడు = దొర్లిపడడం
డొల్పిచ్చుకపోవాలె = నెట్టుకురావాలి
డొల్ల = డొప్ప
డొల్లుడు = దొర్లడం
డోక = ధోకా
డోకిల్ కె బచ్చే = ఒక తిట్టు
డోకు వచ్చుడు = వాంతులు కావడం
డోబి = గుంత, లొంత
డోరీలు = బూట్ల దారాలు మొ॥నవి
డోలుగొట్టుడు = భేరి వాయించడం
డ్రంబు = డ్రమ్ము

## త

తంగవుడు = అలసిపోవడం, డబ్బులకు ఇబ్బంది కావడం
తంబిరేలు బుర్ర = తాబేలు బుర్ర ?
తంట = చిక్కు, సమస్య
తండ్రిగాడు = ప్రేమాతిశయంతో చెప్పేమాట
తండ్లాడుడు = కష్టపడడం, ప్రయత్నించడం
తంతు = తంత్రం
తంతులేదు, తర్వాయి లేదు = ఓ పద్ధతి లేదనడం
తంతె తంతెకు = తరతరానికి
తంతెపర్సుల వడ్డట్టు = రొట్టె విరిగి పాలలో పడినట్లు
తంతెలు = తరాలు, మెట్లు
తందుర్ రొట్టె = మైదాతో మందంగా కాల్చిన రొట్టె
తంబేసుడు = తిష్టవేయడం
తంబం = స్తంభం
తంబాకు = పొగాకు, టొబాకొ
తంబుడం తంబుడమోలె = చాలా చిక్కని ద్రవపదార్థంలా
తకబికఅవుడు = కిందమీద అవడం, తికమక కావడం
తకరు పుచ్చుకునుడు = భరతం పట్టడం
తకాయించి తకాయించి అడుగుడు, తకురాయించి అడ్గుడు = నిలదీయడం, గుచ్చి అడగడం
తక్క = తక్కువ
తక్కి, తకియా (ప) = మెత్త
తక్కిచ్చి తక్కిచ్చి అడుగుడు = తర్కించి తర్కించి అడగడం, గుచ్చిగుచ్చి అడగడం
తక్కిడి = త్రాసు
తక్కెడ = 1400 గ్రాములు
తక్రారు (అ) = గొడవ
తక్లీపు (అ) = కష్టం
తగ్‌డ = పుష్టి
తగని, తగరాని (బాధ, బీమారి, రోగం) = సమంజసం కాని, భరించదగని (బాధాదులు)
తగాద = గొడవ
తగులుడు = కావాల్సిన వాటికన్నా ఎక్కువ అవసరం కావడం
తట్ట తట్ట కొట్టుడు = కాళ్ళు నేలకేసి తటతటా కొట్టడం
తట్టబుట్ట సదురుకొనుడు = పెట్టేబేడా సర్దుకోవడం
తట్టు = అమ్మవారు
తట్టుకుర్చీ = వాలుకుర్చీ
తట్టు (గోనె) = గోనెపట్టా
తట్టువడుడు = తక్కువకావడం, ఆగిపోవడం
తట్టువెట్టుడు = తక్కువ చేయడం ?
తడకప్ప = తలకప్ప, తోకకప్ప, Tadpole ?
తడతడమనుడు = చీము పట్టిన పుండు సలపడం
తడలు = అలలు

తడలు గొట్టుడు = కడల్కొనడం, ఉప్పొంగడం
తడాక = ప్రతాపం
తడిపిబర్రె = పాడిగేదె ?
తడిబట్టకులం = బ్రాహ్మణాది ఆచారకులం
తడులు = పొలానికి తడులు పెట్టడం
తద్క సైకిలు = పాత సైకిలు
తద్వుడు = లంచం యివ్వడం
తతిమ్మాయి (అ) = మిగిలినవి
తదుపరి = తదనంతరం
తనఖ్బి = cup-board
తను = అతను
తనుగు, తలుగు, తవులు = పలుపు
తన్ఖా = జీతం
తన్కీ = విచారణ
తన్నుతన్నుమనుడు = బాగా తళతళ మెరవడం
తన్నుకునుడు = గింజుకోవడం
తపంచె (ట) = తుపాకి లాంటిది
తపాల = చిన్నపాత్ర
తపుకు = చిన్నమూత, డక్కన్
తప్పితె తుప్పాల్ = తప్పితె క్యాన్సల్
తప్పిదారి, తప్పిపోయి = పొరపాటున
తప్పులపడుడు = నిందలు పడడం, తప్పులు చేయడం
తప్ప, తష్ప = నిర్ణయం, తీర్పు
తఫ్రీ (అ) = వాహ్యాళి
తబాదల = స్థానచలనం, బదిలీ
తమంచె (ట) = తుపాకి
తమాం (అ) = ఏమాత్రం, పూర్తి, బొత్తిగా
తమాష = వేళాకోళం
తమ్మడ సొన్నాయి = తంబళ సన్నాయి
తమ్మీ ! = తమ్ముడూ అని పిలవడం
తయారవుడు (అ) = తెమలడం
తరక్కి = ఎదుగుదల ? పదోన్నతి
తరాజు = త్రాసు
తరి = మాగాణి (తడిగల భూమి)
తరీక (అ) = వలె, పద్ధతి, మాదిరి
తరుగువోవుడు = తరుగుదల
తర్జుమ = అనువాదం
తర్పున = తరపున
తర్బూజ (ప) = పుచ్చకాయ, water melon
తర్బీతి = తర్ఫీదు
తర్ర = తాలు
తర్రుకు పెట్టుడు = విరేచనాలవడం
తర్రుగొట్టుకునుడు = భయపడడం, హడలిపోవడం
తర్వాయి లేదు తంతు లేదు = పద్ధతీ పాడూ లేదు
తల గోల్లు కొట్టుకునుడు = తలంటు స్నానం చేసిన స్త్రీలు వెంట్రుకలు ఆరాలనీ, చిక్కులు పోవాలనీ చేతి గోళ్ళతో కొట్టుకోవడం
తలం = స్థలం
తలంజేనుడు = సెటిలవడం, స్టెఅవడం, స్థిరపడడం, వుండిపోవడం
తలకు పోసుకునుడు = తలంటు స్నానం
తలగమిట్ల = తలవాకిట్లో
తలతిక్క = తలబిరుసు
తలపుండు కడ్గుడు = సేవలు చేయడం
తలాపు = తలవైపుకు
తలాయించుడు = ప్రై చేయడం
తలుపుగొట్టుడు = తలుపులు తట్టడం
తలె = పళ్ళెం, తళియ
తలెముంత, (సెంబు) లమ్ముకొనిబాకిగట్టుడు = తళియ, ముంతల్లాంటి ఇంటి సామగ్రి అమ్ముకుని బాకీ కట్టడం
తల్కట్టు = తలకట్టు
తల్కాయ = తల, బుర్ర
తల్కాయనొప్పి = గొడవ
తల్గవెట్టుడు = తగుల బెట్టడం, అంటబెట్టడం ( ఇల్లు మొ॥ నవి )
తల్గిచ్చుడు = కొట్టడం
తల్గుడు = తగలడం, తాకడం
తల్లడం మల్లడం = తల్లడిల్లడం
తల్లవ్వ / తల్లెవ్వ = అమ్మవారు, మశూచి
తల్లికడ్పుల పొద్దు వడుడు = సూర్యాస్తమయం
తల్లిగారిల్లు = పుట్టినిల్లు
తల్లిదండ్రి = తల్లిదండ్రులు
తల్లియిల్లు = పెద్దిల్లు
తల్వార్ = పెద్దకత్తి
తల్వాలు = తలంబ్రాలు
తవ్వ = రెండు సోలలు
తస్స = చెడ్డమాంసం
తస్సు = అగు

తాం = స్నానం (చిన్నపిల్లల బాష)
తాంబాలం = ఇత్తడిపాత్ర - వెడల్పుగలది
తాంబేలు = తాబేలు
తాకట్లు = కొట్లాటలు
తాకట్లువెట్టుడు = ఇబ్బందులు, కష్టాల పాలు చేయడం
తాకత్ (అ) = బలం, సత్తువ, తాహతు
తాకు = దెబ్బ, స్వానుభవం (ఉ॥ తాకు తగిలితె బోసత్తది)
తాకుడు (దెబ్బలు) = తగలడం
తాకులాటలు = కొట్లాటలు
తాకులు తినుడు = ధక్కామొక్కీలు తినడం
తాగం, తేగం గింజలు (ఎరం?) = వృత్తికులాలకు ప్రతిఫలంగా ఇచ్చే ధాన్యం
తాగినోల్లు తడ్వినోల్లు = కల్లు తాగిన వాళ్ళు, త్రాగించినవాళ్ళు
తాజ (ప) = ఫ్రెష్, నవనవంగా వుండడం
తాటాకుల పుస్తకం = తాళపత్ర గ్రంథం
తాటి = తాడి
తాటిపత్రి = లారీల్లాంటి వాహనాలపై వానకు తడువకుండా కప్పే మందమైన గుడ్డ
తాడ, తాన = వద్ద, దగ్గర
తాడు = తాటిచెట్టు
తాడు దెంపుతడు = విడాకుల్లాంటి నష్టం కల్గిస్తాడు
తాడుదొంగ = తప్పించుకునే దొంగ, తాటిదొంగ?
తాతకొడుకా ! = ఒక తిట్టుపదం
తాతిపరెం = నిదానం, తాత్పర్యం (తాత్పర్యం చెప్పడంలో నిదానం చాలా అవసరం కదా ! )
తాతీల్ (అ) = సెలవు
తాదగ = నిదానంగా
తానం = స్నానం
తానం చేసినట్లయింది = పనిపూర్తయింతర్వాత ఎంతో హాయిగా వుందని చెప్పడం, బరువు దిగినట్లు కావడం
తాను = బట్టలతాను
తాపం = ఉక్కపోత, జ్వరం, వేడిమి, బాధ
తాపతాపకు = మాటిమాటికి
తాపి = మే స్త్రీ యొక్క పనిముట్టు
తాపు = తాగించు
తాపెదారి = తాబేదార్, దళారి ?
తామసం = కోపం
తాయితు = తాయెత్తు
తాయిపెంక = పెనం (మట్టి)
తాయిమాయిజేసుడు = ఉక్కిరిబిక్కిరవడం ( ఎండ మొ॥ వాటితో )
తార్‌గొట్టుడు = ఫోన్‌చేయడం
తారీకు = తేది
తారీప్ చేసుడు (అ) = పొగడ్డం
తాలంగొట్టుడు = సమర్థించడం
తాలంచెవులు = తాళాలు
తాలి = పళ్ళెం, చప్పట్లు, మంగళసూత్రం
తాలీంకాన = వ్యాయామశాల
తాలుపీట / తాల్పిట్టు = పర్వపిండి
తాలుపు = తాలింపు
తాల్చుడు = అదేపనిగా వదరడం, నలపడం, నాన్చడం
తాల్లు తంగెల్లు పట్టుడు = శంకరగిరి మాన్యాలు పట్టడం
తావు = స్థలం, జాగా
తావుచేసుకునుడు = ఇల్లుకట్టుకుని స్థిరంగా వుండడం
తాశిలోడు = దరిద్రుడు, నక్షత్రకుడు
తాశిల్లల్గి నాశనమవుడు = పన్నులు మొ॥న వాటితో నశించిపోవడం
తింటడు తిరుగుతడు = అచ్చోసిన ఆంబోతు
తిండికి చంపుడు = అన్నంపెట్టక చంపడం
తిక్క = మొండితనం
తిక్క తిరుగుడు = దిమ్మతిరగడం
తిట్టుడు = చీవాట్లు పెట్టడం
తినుడు = భోంచేయడం
తిను, తిన = ఇతను, తను
తిమస్కారం = తిరస్కారం
తినేసోడ = వంట సోడా (సోడియం బైకార్బనేటు)
తిన్నయిల్లు (రేవు) తల్చుడు = కృతజ్ఞతగా వుండటం
తిప్పతీగె = మర్లుతీగ
తిప్పలు = బాధలు
తిప్పితిప్పి గొడ్తె = అన్నీ కలిపితే, తిప్పితిప్పి కూడితే?
తిప్పలాడి = బాగా తిరిగే స్త్రీ
తిమితంలేక = స్థిమితం లేక
తిమ్మి = కోతి
తియ్యగూర = పులుసులేని కూర

తియ్యి = లెద్దూ, లెమ్ము, లే, లెండి. ( నేను వస్తా తియ్యి )
తిరమవుడు = స్థిరంకావడం, సెటిలవడం
తిర్గుడురోగం = బాగా తిరిగే వాడని అర్థం
తిర్పతిజెండ = తిరుపతి వెళ్లి వచ్చిన అయ్యగారి చేతిలో వున్న పెద్ద జెండ
తిర్మన్దార్లు = తిరుమణ్‌ధారులు, వైష్ణవులు
తిరమత్ర = తారుమారు
తిరితిరి మాటలు = తిక్క, పిచ్చి మాటలు
తిల్కం = బొట్టు, తుమ్మకాయతో చేసే బొట్టు
తీకునం తీసుడు = లోపాలు ఎంచడం
తీక్షనం = కోపం
తీగ = వంశావళి, వంశవృక్షం
తీట = గుల
తీటపట్టలేదు (నాకు) = అవసరం కల్గలేదు
తీనాన = మూడణాలు
తీపెండి = రాతివెండి
తీర్గ = తీరుగా, వలె, మల్లే
తీరం = స్థిరం, పదిలం, భద్రం
తీరన్నం = మూడోసారి అన్నం
తీరుడు = తీరికదొరకడం, రుద్దడం, తిప్పడం (మీసాలు)
తిరుతీరు, తీరొక్క = రకరకాల
తీర్తం = తిరునాళ్ళు, జాతర, దేవుని తీర్థం
తీర్వాటం = తీరుబాటు, తీరిక
తీవ్రం = కోపం
తీస్‌మార్ఖాన్ = పెద్దపోటుగాడు (ముప్పదిపోట్లు పొడిచేవాడు )
తీసిపోవుడు = తక్కువతినడం ( మీకన్న మేం తీసిపోలేదు )
తుంటలు = పెద్ద దుంగలు
తుంపిల్లు = తుంపుర్లు
తుకంబోసుడు = వడ్లు గంపల్లో పోసి నీళ్లు చల్లి మొలకెత్తింపచేయడం
తుకపెక ఉడుకుడు = కళపెళ ఉడకడం, కుతకుత ఉడకడం
తుక్కు = చెత్త, చూర చూర అయిన బాబతు
తుక్డలు తుక్డలు = ముక్కలు ముక్కలు
తుట్టె = నష్టం, తుట్టు, తరుగుదల
తుట్టెలు గట్టుడు = బియ్యం, పిండి మొ॥ పురుగుపట్టడం
తుడుం = సైన్యం ?
తుత్తురుగాడు = పిరికిపంద, పిచ్చోడు
తునికాకులు = బీడీ ఆకులు
తున్కలు = ముక్కలు (అప్పాల ముక్కలు) (మచ్చు తునకలో తునకవుంది కదా !)
తున్కిపండ్లు = తుమికిపండ్లు
తుపాకిరాముడు = పిట్టలదొర
తుపాకేద్దామంటె సందులేకపోవుడు = నేల ఈనిందన్నట్లు వుండడం, ఇసుకపోస్తే రాలనంత జనం వుండడం
తుప్ప తుప్ప ఊంచుడు = తుపుక్కుమని వుమ్మడం
తుప్పర = తుంపర, ముసురు
తుప్పలు = పొదలు
తుప్పాల్ = రద్దుకావడం
తురుంకాన్ = మొనగాడు
తుర్కం = ఉర్దూ
తుర్కోల్లు = సాయెబులు
తుర్తి = తృప్తి
తుర్క కాశోల్లు = రోళ్ళు, విసుర్రాళ్ళు చేసేవాళ్ళు?
తులం = కాసు, 11 అణాల ఎత్తు బంగారం కన్న ఎక్కువ
తులమో మాసమో = ఎంతో కొంత
తువ్వాల = తుండు
తూటి తీగ చుట్టుకున్నట్లు అవుడు = తిప్ప తీగ తొక్కినట్లు అవడం
తూటు = రంధ్రం
తూటువోకుంట చేసుడు = నష్టంగాకుండా చేయడం
తూటుపైస = చిల్లిగవ్వ
తూతూమంత్రంగ = ఉత్తుత్తి మంత్రంగా, నామమాత్రంగా
తూపురం = రంధ్రం ( ఇండ్లు కడిగిన నీరు ఈ తూపురంలోంచే బయటకు పోతుంది )
తూము = ఎనిమిది కుంచాలు
తెంపుడు = తెంచడం, తుంచడం
తెకాలు వడుడు = చిక్కిపోవడం
తెగనియ్యడు బల్వనియ్యడు = తాడో పేడో తేల్చు కోకపోవడం
తెగాయించి = తెగించి
తెగారం = తెగింపు, తెగువ
తెగిడ్సుడు = తెగించడం

తెగిన బొక్కెన (నూతిలదాక) = భయాదులు వదిలిన మనిషి
తెగుడు = తీరడం (అప్పు)
తెగుడు (ఏదో ఒకటి) = నిర్ణయం కావడం
తెచ్చిపెట్టుకున్నట్టు = కృత్రిమంగా
తెట్టన తెల్లారుడు = భళ్ళున తెల్లవారడం
తెట్టె= పెర (తేనె)
తెనుగుదెంకరోల్లు = ముదిరాజ్ మొ॥ కులస్థులు
తెప్ప = మేఘం
తెరవెట్టు (తలుపులు) = తెరువు (తల్పులు), తెరచిపెట్టు
తెరిపి = వానవెలవడం
తెరువు = జోలి
తెర్లు అవుడు = పాడవడం, నష్టపోవడం
తెర్సుకం = తెరవడం
తెలంగాణ = తెలుంగు అణెం, తెలుగుస్థానం
తెలగాలు = మున్నూరు కాపులాంటి కులస్థులు
తెలగోలు, తెల్లగోలు = తేల్చుకోవడం
తెలదు = తెలియదు
తెలివవుడు = మెలకువరావడం
తెలివి తప్పుడు = స్పృహ తప్పడం
తెలివికచ్చుడు = చైతన్యవంతులు కావడం
తెలువన్తనం = అజ్ఞానం
తెల్గం = తెలుగుభాష
తెల్పిచ్చుకునుడు = కనిపెట్టడం, కనుక్కోవడం
తెల్లందాక = తెల్లవార్లూ
తెల్లందాకపొద్దుందాక = రేయింబవళ్ళు
తెల్లకల్లు = ఈత కల్లు
తెల్లగడ్డ = తెల్లఉల్లి
తెల్లగుండుడు = కాస్త కలిగివుండడం ( ధనం, విద్య మొ॥ నవి )
తెల్లతెల్లందాక = తెల్లవార్లూ
తెల్లబట్టలోల్లు = సభ్యత, చదువు ఉన్నోళ్ళు
తెల్వక = తెలియక
తే = తీసుకురా, అయితే, తెమ్మ
తేంటుగ = స్పష్టంగా, తేటగా, ఒత్తుగా
తేజ్గ (ప) = కొచ్చెగ, ప్రకాశవంతంగా, ఉషారుగా, తెలివిగా
తేజాబు = సల్ఫ్యూరికామ్లం ?
తేమిడి = మేళం
తేలి = గాండ్ల
తైతక్కలు (అతడు) = యథేచ్ఛగా వ్యవహరించడం, ఎంజాయి చేయడం
తైదలు = రాగులు
తైలి = సంచి
తైసీలుకట్టుడు (అ) = పన్నులు చెల్లించడం
తొందురు తొందురు పోవుడు (మాట) = తడబడడం, తొందర తొందరగా మాట్లాడితే వచ్చే తడబాటు
తొంట = ఎడమ
తొంటి = తొడల సంబంధితాస్థి
తొండల్ జొరగొట్టుడు = పోలీసుల చిత్రవధలో ఒక రకం
తొండి = (ఆటలో) అబద్ధం, వంక, మిష
తొంపు = సాకు
తొంబుడం తొంబుడం = చాలా చిక్కగా వుండడం- ఉదా॥ దప్పడంలాంటిది
తొక్కు = పచ్చడి
తొక్కుడు దల్గుడు = దయ్యం పట్టడం
తొక్కుడుకు పెట్టుడు =దయ్యానికి పెట్టడం
తొక్కుడుతిండి = బయటి తిండ్లు
తొక్కులాట = తండ్లాట
తొక్కుడుబండ = గుమ్మంలో వేసిన బండ
తొగరుపప్పు = కందిపప్పు (తమిళ 'తువరై' లోంచి వచ్చింది
తొట్లె = ఉయ్యాల, పురుడు (తమిళ 'తొట్టిల్' లోంచి వచ్చింది )
తొడపాశం = పిల్లల తొడల్ని దొరికించుకుని పై చర్మాన్ని మెలితిప్పడం
తొడసోపతి = స్త్రీల పొందు
తొడిమె = కాడ
తొడ్గుడు = ధరించడం
తొయ్యలేదు = తోచలేదు
తొర్ర = మొర్రి
తొల్కుడు = తొణకడం
తొల్చూరు = మొదటికాన్పు, తొలిచూలు
తొవ్వ = తోవ, దోవ
తొవ్వకురాలేదు = (వాడింకా) బాగుపడలేదు
తొవ్వదొర్కుడు = తీరికచేసుకుని ఇంటికి రావడం
తొవ్వుడు = తవ్వడం
తోకమట్ట = గాడిదగుడ్డు
తోకలేదు తొండెంలేదు = మొదల్లేదు మోక్షంలేదు

తోకెంబడి నారాయనా అన్నట్లు = తల్లివెంట పిల్లలా, అవు వెంట లేగలా Enclousure లాగా
తోట = చెరుకుతోట, మిరపతోట మొ॥నవి
తోటలు పట్టుడు = తోటలను గుత్తకు తీసుకోవడం
తోటి, తోని = తో
తోటోడు తొడగొస్కుంటె మనం మెడ గోసుకొనుడు = పులిని జూసి నక్క వాత పెట్టుకున్నట్లు
తోటోల్లు = సహచరులు, సమవయస్కులు
తోడపుట్టినోడు = తోబుట్టువు
తోడు = ఒట్టు (నీ)
తోడుదొంగలు = కలిసి దొంగిలించే వాళ్ళు
తోడుపోవుడు = వధూవరులతో పాటు వెళ్ళే ఆడపడుచులు మొ॥ వాళ్ళు
తోడెం = కొంత ( తోడెంబు తోడనె సరిపుచ్చుకునెద మిత్ర భేదంలోని ఓ వాక్యం )
తోడెంగ = ఒక రకం గడ్డి
తోడ్కల్ దీసుడు = తాట ఒలవడం, తోలు దీయడం
తోని = తో (మా)
తోవు తోవు అవుడు = వాసిపోవడం, అలసిపోవడం
తోముడు = కొట్టడం (లోపలేసి)
తోలు (అరటి) = తొక్క (అరటి)
తోలుకపోవుడు = తీసుకొనిపోవడం
తోలుగుడ్లు పెట్టుడు = విఫలుడవడం
తోలుమందమవుడు = పోతరించడం
తోషన్ = సువ్వ
తోసంత = కాసింత
తోసుపోకుంట = పాల్లుపోకుండా
తోసులు = ఛిట్ పొడింతర్వాత మిగిలిన చిన్న ఛిట్లు
తౌటంబెట్టుడు = తవ్వడం
తోయుక్తంగ = (పిల్లల) తో సహా

## ద

దంగుడు = లొంగడం, భూమిలోతుగా తెగడం, నూరినప్పుడు మెత్తగా కావడం
దంచుడు (వర్షం) = బాగా కురియడం
దంతం = దణ్ణం
దండకం సదువుడు = చెప్పిందే చెప్పడం
దండచేతులు = మోచేతికీ, భుజానికీ మధ్య భాగాలు
దండాలు = నమస్కారాలు
దండి = గొప్ప
దండిగ = చాలా
దండుగు = జరిమానా
దండెం = బట్టలు ఆరవేసే కర్ర, త్రాడు
దండెగొట్టుడు = తప్పుడు తూకం వేయడం
దండోడు = చాలా గొప్పోడు
దంతె(న) = చెత్తకుప్పను చదునుపరచే సాధనం
దంద = పని, ఉద్యోగం
దకల్ చేసుకునుడు = జోక్యం చేసుకోవడం
దక్కలోల్లు = మాదిగల యాచక జాతి
దగ, దగడు = వేడి
దగుల్బాజి మనిషి = మోసగాడు
దగ్గట్టుగ (వుంది) = తగ్గట్టుగ, సరిపోయినట్టు (వుంది)
దగ్గర్ దగ్గర = సుమారు, రమారమి
దగ్గరికచ్చుడు = బాగా చిక్కిపోవడం
దగ్గరికి దీసుడు = ఆశ్రయమివ్వడం
దగ్గుదమ్ముర్గొగం = ఉబ్బసం, అస్మా
దగ్గెర = దగ్గర
దచ్చన్న దేశాల్ పట్టుక తిర్గుడు = చప్పన్న దేశాలు లేదా దక్షిణ దేశాల మీద పోవడం ?
దటాయించుడు = హడలగొట్టడం
దట్టికట్టుడు = పీర్లకు దట్టి (బట్ట) కట్టడం
దడదడమనుడు = గుండె వేగంగా కొట్టుకోవడం
దడి = తడుకలు మొ॥ వాటితో ఆవరణ ఏర్పరచడం
దడుగ్గుమనుడు = గుభేలు మనడం
దడువాయి = దళవాయి, దళారి, కమీషన్ ఏజంటు, ధాన్యం తూకం వేయించువాడు
దద్లమారి = మగకోతి
దద్వత్ = ధరావత్తు, Advance
దద్సుకొనుడు = జడుసుకోవడం
దత్తత = దత్తు
దద్దమ్మ = వాజమ్మ
దద్దర్దరిల్లుడు = దద్దరిల్లుడం
దద్దు = చిన్నమ్మవారు, మీజిల్స్
దద్దోజినం, దద్యోజనం= పెరుగన్నం

దద్రంపుచ్చుకునుడు = భయం కావడం
దన్‌మని = అకస్మాత్తుగా
దనం = ధనం
దనాదన్ వచ్చుడు = గబగబా రావడం
దన్క = వరకు, దాకా, బాగా
దన్న దన్న వచ్చుడు = గబగబా రావడం
దన్యాలు = కొత్తిమీర్లు, ధనియాలు
దప్తరం (ప) = ఆఫీస్, ఫైలు
దప్పడం = దప్పళం, సాంబారు
దప్పులు గొట్టాలె = భయంతో వణికిపోవాలి
దబ్బ దబ్బ = గబగబా
దబ్బడ దిబ్బడ = దబదబా
దబ్బన = ఒకవేళ, వెంటనే
దబ్బున = వెంటనే
దబ్బునం, దబ్బుడం = దబ్బనం
దమాక్ (అ) = మెదడు (దిమాగ్ నుండి వచ్చింది)
దమ్కియిచ్చుడు = భయపెట్టడం
దమ్ము ఎగవోసుకుంట = వగరుస్తూ, రోజుతూ, రొప్పుతూ
దమ్ము (ప) = ఊపిరి, శ్వాస, ధైర్యం
దమ్ముకచ్చుడు = చాలు చాలు కావడం
దమ్ముదీసుడు = నిట్టూర్చడం
దమ్ములు = గుండెలు
దయిత, దైత = రాక్షసి
దయ్యం = దెయ్యం
దర = ధర
దరమంచిగపల్కుడు = మంచి రేటు రావడం
దరవడుడు = గిట్టుబాటవుడు, మద్దతు ధర రావడం
దరి = బావి అంచు, ఏటిగట్టు, జలాశయాల అడుగు భాగం
దరి లేదు దాపు లేదు = దిక్కూ మొక్కూలేదు
దరిద్రమో శనేశిరమో = దరిద్రమో
దరియ్యదు = ధైర్యంరాదు ( నాకు )
దర్కాస్తు (ప) = దరఖాస్తు
దర్గ (ప) = ముస్లిమ్‌ల పుణ్యస్థలం
దర్మంగ = సత్యంగ
దర్మంచాట = దానధర్మాలు చేయడానికి వాడే చేట
దర్మకాంట = ఉచితంగా ధాన్యాన్ని తూకం వేసే పెద్ద త్రాసు
దర్మరాజు = ధర్మరాజు లాంటి ధర్మాత్ముడు అని

దర్మశాల = వసతి గృహం
దర్వాజలు (ప) = గుమ్మం, తలుపులు
దలం = అన్నలదండు, దళం
దలాల్‌గాడు = దళారి
దవ (కడ్పుల) = దావానలం ?
దవాకాన, దావకాన = ఆసుపత్రి
దవాయించుడు = దబాయించడం (పశువులను దవాయించడం, అదిలించడం)
దవ్వదవ్వ = దబదబా / గబగబా
దసర్లపట్టు = ఒకపట్టు
దస్కం = పది
దస్కత్, దస్తకత్ = సంతకం
దస్కుమనుడు = గతుక్కుమనడం !
దస్త, దస్తా (ప) = 24 టాబులు
దస్తి, దస్తీ (ప) = జేబు రుమాలు
దస్తూరి = చేతిరాత
దా = రా
దాంక, దాక = దనుక, దాకా, వరకు
దాంట్ల = దానిలో
దాకల్ (అ) = దాఖలా
దాటిచ్చుడు = చాటించి చెప్పడం, ఆడిపిల్లకు పెండ్లిచేసి పంపడం
దాటిపోవుడు = చనిపోవడం
దాటుడు పుండ్లు అవుడు= రెండు కాళ్ళమీంచి దాటి వెళితే పుండ్లు అవుతాయని చెప్పడం, పొరపాటున కాళ్ళు తగిలి పడితే గాయాలవుతాయి మరి !
దాట్లుదాట్లు = ఇంటి గోడలకు వెల్లవేసినప్పుడు ఒక చోట పలుచగా, మరోచోట చిక్కగా పడి మరకలు మరకలుగా ఏర్పడడం
దాడి = గడ్డం
దాడి తెచ్చుడు (ఇల్లు మొ॥ వాటికి) = ఇల్లు మొ॥ నవి అమ్మవలసి రావడం
దాతి = వడ్రంగులు పనిచేసే స్థలం
దాతుకల్పుడు = బంగారంలో రాగి కలపడం
దాతు చూసుడు = నాడిచూడ్డం
దాతులేదు పిర్యాదులేదు = ఆరోపణ లేకపోవడం
దాతుసల్లవడుడు = ఒళ్ళు చల్లపడడం
దాద, దాదా = రౌడి, గూండా, అన్నయ్య
దానం = దహనాదులు
దానా = పశువుల తిండి, దాన్యం

దాపట = ఎడమవైపు
దాపురిచ్చుడు = బలవంతంగా ముడివడడం
దాప్కం = దాపరికం
దాబ = మట్టితో లేదా సిమెంటుతో వేసిన యింటి పై కప్పు, Slab పంజాబీ డాబా
దామ = దప్పి, తేమ ? దాహం
దామారనానుడు = భూమి మొ॥ నవి దాహం ఆరేలా నానడం
దాయి, దాది (ప) = దాది, దాసి, పిల్లలను లాలనగా రమ్మని పిలవడం, దాలి, కుండ , డబ్బులకు పాలిచ్చే తల్లి
దాయితమ్ముడు = మంత్రగాడు
దారవట్టుడు = జనం బారులు తీరిరావడం
దారికచ్చుడు = బాగుపడడం
దారు = సారాయి
దారువట్టుడు = సానపట్టడం
దార్వం = వేడి
దాల్ = పప్పు
దాలంచేసుడు = ఇంటిపెండెపై మట్టి కప్పి పెంక పరిచేందుకు సిద్ధం చేయడం
దావంతం = బాధ
దావజేసుడు (అ) = కేసు పెట్టడం
దావత్ (అ) = విందు
దాశన = కాల్చిన పొగాకుతో తయారైన పళ్ళపొడి
దాశెన్నపువ్వు = మందారపుష్పం
దించుడు = ఉన్నది ఉన్నట్లుగా రాయడం, దయ్యానికి దిగుదుడువు, ఫోటోలు తీయడం, బొమ్మలు గీయడం
దిక్కు = వైపు
దిక్కు నక్కిలేనోడు = దిక్కుమొక్కు లేనివాడు, దిక్కు దివాణం లేనివాడు
దిక్కుదీము = దిక్కుధీమా
దిక్కుమల్లె = దిక్కుమాలిన
దిగదాగుడు = గర్భస్రావానికి ఏదో మందు తాగడంత
దిగవడుడు = కూరుకుపోవడం (బురదతో)
దిగుడు = పల్లం
దిగ్వాట్ల పొలం = పల్లంలో వున్న పొలం
దిట్టి, దిష్టి = దృష్టి
దిడ్డి దర్వాజ / తలుపులు = దిడ్డి దారి
దిద్దుకునుడు, దిద్దులాడుడు = ముస్తాబు కావడం, తీర్చిదిద్దుకోవడం
దినవారాలు = అంత్యక్రియలు
దినాం = ప్రతి దినమూ
దినాలు అవుడు = ద్వాదశ కర్మ కావడం
దినాలు దగ్గర వడుడు = రోజులు దగ్గరపడడం, కాటికి కాళ్ళు చాచడం
దినాలుగాను (నీ) = ఒక తిట్టు
దిన్సులు = వస్తువులు, సరుకులు
దిబ్బెడ = ముక్కుదిబ్బడ
దిమ్మనుడు = తలదిమ్మెక్కడం
దిమ్మీస = నేలను చదును చేసే సాధనం
దిల్దార్ (మనిషి)(ప) = మనస్సున్న మనిషి
దిల్లగి = తమాషా, వేళాకోళం. (దిల్‌లగీ ?)ః
దివానగాడు (ప) = పిచ్చోడు
దివాల్ దీసుడు = చిక్కిపోవడం
దివిలె, దీలె = దీపావళి
దివ్వాలు, దెవ్వాలు = దినవారాలు, రోజులు
దీంట్ల = దీనిలో
దీక్షవట్టుడు = వ్రతం పట్టడం
దీగూడు = దీపంగూడు
దీటి = దివిటి
దీవం పెద్దది జేనుడు = దీవం ఆర్పడం, కొండెక్కడం
దీవం ముడ్డికింద చీకటి = గురివింద తన నలుపెరుగదు
దీపాంత = ప్రమిద, దీపపు ప్రమిద, తూనీగ ?
దీము = ధీమా, దిక్కు
దీరగుండుడు = ధైర్యంగా ఉండడం
దీర్గం దీసుడు = సాగదీసి చెప్పడం
దీలెవడుడు = ఢీలా పడడం
దీవెనార్తి = దీవెనలు
దుంకుడు = దూకడం, మిడిసిపడడం
దుందు = అల్లరి
దుకానం (ప) = కొట్టు
దుక్కం = దుఃఖం
దుడుకు = పెడసరం
దుడ్డె = దూడ
దుత్త = కుండ, క్యాచ్ పట్టుకోవడం
దునియ (అ) = లోకం
దునియ చూసిన = చాలా చూశాను
దునియ చెప్పుడు = ఎన్నయినా చెప్పడం

దునుకుడు = దూకడం ( దుముకుటలోంచి వచ్చిందిది )
దున్నుకం = దున్నడం
దుబాయి కారటు = ఏరోగ్రామ్
దుబార = ఎక్కువ ఖర్చు, దుబారా
దుబ్బ = దుమ్ము, మెట్టప్రాంతం
దుబ్బ కొట్టాడుడు = దరిద్రం కొట్టాడ్డం
దుబ్బురు దుబ్బురు వెంట్రుకలు = చింపిరితల
దుమ్ముడి (దుముడి), దుసుముడి = దూముడి
దురస్తు, దురుస్తు (ప) = మర్మత్తు, బాగుపర్చడం
దుర్దెశ = దురదృష్టం
దుర్గెట్ట ముండకొడుకు = దరిద్రపు వెధవ
దుర్బిని = భూతద్దం
దుల్దమ్మచెట్టు = దురదగొండి ( ఈ చెట్టు ఆకులు దురద కల్గిస్తాయి )
దుల్పరిచ్చుకునుడు = దులువుకోవడం, విదిలించుకోవడం
దుల్లుదుల్లు అవుడు (మన్ను) = వదులు వదులు కావడం
దువ్వ = పప్పుగుత్తి
దువ్వ = చీట్లపేక మొ॥ లో రెండు
దుశ్మన్ (ప) = శత్రువు
దూందాం = ఆడంబరం
దూం(దూం) చేసుడు = అల్లరి చేయడం
దూగ = రెండు
దూగోడ = చిత్రిక, కర్రను నునుపు చేయడం
దూప = దప్పి
దూపకు దీసుకునుడు = కల్లుతాగడం
దూలశీల = వొగలను కల్పుతూ కానిని తాటితో బంధించేది
దూనుకచ్చుడు (పైసలు) = సేకరించడం
దూసుడు = దువ్వడం, చెట్ల ఆకులను ఒక పద్ధతిలో దువ్వినట్లు తెంపడం
దెంకపోవుడు = చెప్పా పెట్టకుండా పారి పోవడం
దెంగెయ్ = ఎల్లిపో
దెప్పుడు = వెక్కిరించడం
దెబ్బకు = వెంటనే, హఠాత్తుగా
దెబ్బకు దయ్యం వదులుడు = దెబ్బకు దేవేంద్ర లోకం కనబడడం
దెబ్బమీద దెబ్బవడుడు = గోరుచుట్ట మీద రోకటి పోటు
దెబ్బలనుడి = దెబ్బలు తినే ప్రాప్తం
దెబ్బలు = గాయాలు
దెశమంతుడు = అదృష్టవంతుడు ( దెశ - దిశ - మంచి దశలోంచి వచ్చింది )
దేంట్ల = దేనిలో
దేకుడు = (గౌరవంగా) చూడడం
దేడ్‌దిమాక్‌గాడు = మెదడు సరిగా లేనివాడు
దేడ్‌గంట = ఒకటిన్నర గంట
దేవుడచ్చుడు = దేవుడు పూనడం
దేవుడా అనుకుంట = అనివార్యంగా
దేవుడు = మూకుట్లోంచి అప్పాలు కాలాక బయటికి తీయడం కడుపులో దేవడం
దేవుడులేనిజాతర = ముఖ్యుడులేని సంబరం
దేవునర్ర = పూజామందిరం
దేవుని కొంటెతనం = దేవుని పరీక్ష
దేవున్గుడి = దేవాలయం
దేవులాడుడు = వెతకడం, తాపత్రయపడడం
దేశంబోవుడు = మరో రాష్ట్రానికి వెళ్లడం
దేశాలమీద పోవుడు = దేశాంతరం వెళ్లడం
దైర్నం = ధైర్యం
దొంగ దొంగతనంగ = రహస్యంగా, చాటుగా
దొంగకు తాళాలు యిచ్చినట్లు = ఒక జాతీయం
దొంగలు దోసినట్లుండుడు (ఇల్లు) = మొత్తం కొల్లగొట్ట బడడం
దొంగలు పొడువ = ఒక తిట్టు
దొంగసీకటి ఒక్కటయినట్లు = జాతీయం ( పులిమీద పుట్రలా )
దొంతులర్ర = స్టోర్‌రూమ్
దొంతులు = (కుండల) దొంతరలు
దొందు = రెండు
దొక్కల = దొక్కలో, కడుపులో
దొడ్డి = పశువుల పాక
దొడ్డికిపెట్టుడు = విరేచనాలు కావడం
దొడ్డు = స్థూలార్థం, దళసరి, లావు, మందం
దొడ్డుప్పు = సన్నటి ఉప్పుకానిది
దొడ్డుబట్ట = ముడి, ముతకబట్ట
దొడ్డుబట్ట దొల్లెడంబలి = అంగడి బియ్యం, తంగిడి కట్టెలు
దొడ్డుమాట = మోటుమాట
దొబ్బుడు = ఆటలో గెల్చుకోవడం, నెట్టడం

దొబ్బులు = చీవాట్లు
దొమ్మరిగడ్డలు = పిల్లిమొగ్గలు
దొమ్మరోల్లు = దిమ్మరులు, (దేశదిమ్మరులు), వేశ్యావృత్తి జీవనంగా కలవారు
దొయ్య = చిన్నపాలం, కయ్య
దొర = దొరబాబు, బాబు, బాబుగారు
దొరవారు = దొరగారు, బాబుగారు
దొరసాని, దొర్సాని = దొరగారి భార్య, దొరస్వామిని
దొరిసిపోవుడు = గోడలు ఉప్పు ఊరిపెచ్చులు ఊడిపోవడం
దొల్ల = దొప్ప
దొల్లుడు = దొరలడం
దొవ్వాన = రెండణాలు
దోక = మోసం
దోకబాజి మనిషి = మోసగాడు
దోడు దోడు = పాడుపాడు
దోడ్డు = ఒక తిట్టు
దోతి = ధోవతి
దోతుల జోడ = పంచెల జత
దోని = ద్రోణి
దోనె = చెలమ ?
దోప్కం = దోపిడి
దోబి = చాకలి
దోరది = తక్కువ ఎరుపుకలది
దోరోల్లు = చర్మకారులు
దోర్నాలు = తోరణాలు
దోర్ని = ధోరణి, పోకడ, వాలకం, మూడ్, భావస్థితి
దోస్తాన్, దోస్తి = స్నేహం
దోస్తు (ప) = స్నేహితుడు
దౌతి = సిరాబుడ్డి
దౌర (అ) = పర్యటన, క్యాంపు

## న

నంజు = దగ్గు, దమ్ము ఆస్మా మొ॥ వాటివల్ల ఊపిరితిత్తుల్లో పేరుకుపోయిన శ్లేష్మాదులు
నంబర్ అందాదోల్లు = సర్కారు చెట్లకు నంబర్లు వేసే వాళ్ళు
నంబర్ ఏక్ (బియ్యం) = శ్రేష్టమైన మొదటి రకం (బియ్యం)
నంబర్ మీద తీసుకునుడు = ఎడాపెడా చెడామడా తిట్టడం, విమర్శించడం
నకమొకలు లేదు = సౌష్టవం లేనిదని చెప్పడం ( నఖాలు మొఖాలు లేనిది )
నకలు = డుప్లికేటు
నకలు గొట్టుడు = కాపీకొట్టడం
నకాశి = నగిషీచేసే కులం
నకురాలు (ప) = లంగతనం, మోసాలు, జోకులు, నటనలు మొ॥నవి
నక్కిల్లు పడడం = డగ్గుత్తిక కల్గడం
నక్ష (అ) = డిజైన్, నగిషీ
నగతు = నగదు
నగలు = గొర్రెల్లాంటి జీవాలు
నగలు గిగలు = నగానట్రా
నగలు దిగేసుడు = నగలు బాగా ధరించడం
నగు = నవ్వు
నగువాట్ల బతుకు = నగుబాటు బ్రతుకు
నగువోతు = పటికబెల్లం, కలకండ
నచ్చెత్రకుడు = నక్షత్రకుడు
నజర్ (అ). = దృష్టి
నజ్రాన = బహుమతి
నట్టలు = కులిపురుగులు
నట్టు = లోపం
నడికారు మనుషులు = మధ్య వయస్కులు
నడిగండిల బొండిగ విన్కుడు = అరణ్య మధ్యంలో, కష్టకాలంలో పరీక్షించడం
నడిగడ్డ = నడిబొడ్డు Heart of the city, town
నడిజాము, నడిరాత్రి = అర్ధరాత్రి
నడితొవ్వ = మార్గమధ్యం
నడిపోడు = పెద్దకొడుకు తర్వాతివాడు
నడిబజార్ల = నడివీధిలో
నడిమింట్ల / నడీయింట్ల = నట్టింటిలో
నడీడుమనిషి = మధ్యవయస్కుడు
నడుం టింగుమనుడు = చాకిరి చేసి అలసిపోవడం
నడుంగుల = నడుములో
నడుమంత్రపోడు = చివరిదాకా బతకని మనిషి
నడువ్ = పద
నడ్క = ప్రవర్తన

నడ్డి = నడుం
నడ్డిముక్కు = చప్పిడిముక్కు
నడ్పుడు = నిర్వహించడం
నడ్పుకునుడు = ప్రవర్తించడం
నతీజ = ఫలితం, రిజల్టు
నత్కుడు = దాక్కోవడం, నక్కడం
నదల్ = కాస్త ఎత్తు తక్కువ
నన్నూరు = నాలుగు వందలు
నవరింత = తలాయింత (నవర్ (అ))
నప్పతట్లోడు = బలహీనుడు .
నప్పతిగ = చడీచప్పుడు గాకుండా
నమాజ్ = ముస్లిం సోదరులు అల్లాకై చేసే ప్రార్థన
నమోన (ప) = తీరుగ, మోడల్
నమ్మక్ అరాం = నమ్మకద్రోహి ( తిన్నయింటి వాసాలు లెక్క పెట్టేవాడు )
నమ్మిక = నమ్మకం
నయం = మెరుగు, హాయి, మేలు, మంచిది
నయాకొత్త = నయాపైస
నయాపైస = చిన్నపైస (కొత్తపైస)
నయాబ్ తయిసిల్దార్ = డిప్యూటీ తహసిల్దార్
నయుండది పిరాదుండది = ఫిర్యాదు లేకపోవడం
నర = సగం, అర, 1/2
నరం = సిర
నరాలు తేలుడు = చిక్కిపోవడం
నర్కుడు = కోతలు కోయడం
నలిమెలు = పశువులను కరిచే చిన్న పురుగులు
నల్ల = మేక మొ॥ వాటి రక్తాన్ని ఉడికించగా ఏర్పడింది
నల్లకట్టెపడుడు = ముఖం నల్లగా మారిపోవడం
నల్లకల్లు = సారాయి
నల్లగుండుడు = దారిద్యంలో వుండడం (మేం నల్లగుండెవటికెనే గదా మీరు మా యింటికి వస్తలేరు )
నల్లగుడ్లు = కంటిపాప
నల్లపూసలు కుచ్చుడు = శోభనం
నల్లపోకలు = మామూలు పోకలు గాక నల్లగా ఉండే చిన్న పోకలు
నల్లమందు = చిన్నపిల్లల నిద్రకైపోసే మత్తుమందు
నల్లమొకం = చెల్లని ముఖం
నల్లసరపుబండ = గ్రానైటు, నల్లసేనపు బండ
నల్లా = పంపు, కుళాయి, నాళం
నల్లాలం = గడ్డిచేమంతి
నల్లికుట్లతనం = బయటపడనితనం, నంగ నాచితనం
నల్లిబొక్కలు = మూలుగు బొక్కలు
నల్లు = ఈత మొ॥ వాటి మట్టల నారతో తాడుల్లా పేనినవి
నవిసిపోవడం = చిక్కిపోవడం
నవ్వుమొకం = ఎప్పుడూ నవ్వుతూ వుండే అందమైన ముఖం
నవ్వులాట = నవ్వుటాల
నశీవ = అదృష్టం
నశ్యం = పొడుం, పొడి
నా అండ్ల నేను = నాలోనేను
నా అందున = నా లోపల.
నా గర్‌కా నాగాట్‌కా = రెంటికి (ఇంటికీ, గుట్టకీ) చెడిన గాడిద
నా బోడ మీద పెట్టు = ఒక తిట్టు
నాం నరుక (వీని) = ఒక తిట్టు
నాగలి = మేడి
నాగుంబాము = నాగుబాము
నాగుల పంచమి = నాగపంచమి
నాజర్‌సాబ్ (అ) = డిప్యూటి ఇన్స్‌పెక్టర్, ఇప్పటి M.E.O. లాంటి అధికారి
నాటు వైద్యం = చెట్లమందు, దేశీయ వైద్యం
నాట్కం = నాటకం
నాడలు (వాడాలు) = అండర్‌వేర్, లంగాలు మొ॥నవి నడుము చుట్టూకట్టుకోవడానికి వుండేవి
నిక్కి నిక్కి చూసుడు = మునిగాళ్ళ మీద నించుని ఆసక్తిగా చూడ్డం
నిగనిగ అవుడు = కాస్త లావెక్కి ప్రకాశించడం
నిగ్రాని (ప) = పర్యవేక్షణ
నిచ్చం = నిజం, నిత్యసత్యం
నిజాం రాష్ట్రం = ఇప్పటి తెలంగాణా, కర్ణాటకలోని రాయచూర్, బీదర్, గుల్బర్గాలు, మహారాష్ట్రలోని ఔరంగాబాద్, ఉస్మానాబాద్, పర్భని, నాందేడ్, బీడ్ జిల్లాలు
నిజానం = స్వచ్ఛం ( ఈ కల్లు నిజానంగ వుంది ), ఉన్నదున్నట్లు
నిట్టాడు = మొగురం పైన వున్న కర్ర
నిట్టుపాసం = నిష్ఠతో కూడిన ఉపవాసం
నిత్తె = (ప్రతి) నిత్యం
నిది = నిధి

నిద్దె కల్లు = స్వచ్ఛమైన కల్లు (నిద్దె - నివ్వద్దె - నిబద్ధపు )
నిద్రమొకం = ఎప్పుడూ నిద్రపోతున్నట్లుండే ముఖం
నిద్రకుతీసుకుపోవుడు = చచ్చిపోయిన వారి సంతతిని బంధువులు నిద్రలకు తీసుకెల్లడం
నిద్రజేసుడు = తల్లిదండ్రి చచ్చాక గుళ్ళోనో దగ్గరి వాళ్ళ దగ్గరో నిద్రించి రావడం
నిన్ను దొంగలు పొడువ = చీవాట్లలో ఒకటి
నిన్ను బొందలవెట్ట (తిట్టు) = చీవాట్లలో ఒకటి
నిన్నెత్తుకపోను = తిట్టు
నిప్క = నిప్పుకణిక
నిప్పుల మీద బొర్లిచ్చుడు = అగ్నిపరీక్షకు గురి చేయడం
నిమానిమలు = బొటాబొటిగా, సరిగా తూకం వేయడం
నిమ్మ చిల్క = పిప్పర్‌మెంటు
నిమ్మల = నిర్మల్ అనే పేరుగల ఊరు
నిమ్మలం అవుడు = శాంతమవుడు
నిమ్కు = తేమ (పర్షియన్ నామ్ నుండి వచ్చింది)
నిమ్రుడు = తడమడం
నియ్యత్ = నిజాయితీ, నీతి
నియ్యద్దార్ = నిజాయితీపరుడు
నియ్య = నీవి
నిరుడు = పోయినేడు
నిర్ద = నిద్ర
నిర్నయం = నిర్ణయం
నిర్రంది = నిర్విచారం
నిర్రదొక్కుడు = మునికాళ్ళమీద బలంగా నించుని వుండడం
నిర్రనీల్గుడు = ఎదురు చూసి ఎదురు చూసీ అలసి సొలసిపోవడం
నిలారం = నిరాహారం
నిలువుత చూసుడు = నిలువెల్లా ఆపాద మస్తకం చూడడం
నిలువు = నిలువెత్తు, పొడవు
నిలువు పోకిల్లోడు = నిలువెల్లా పెగ్గెల మనిషి
నిలేసుడు = నిగ్గదీయటం, నిలదీయడం
నిల్కడలేని మనిషి = స్థిర చిత్తుడు కానివాడు
నిల్వ = Balance, మిగులు
నిల్వపెట్టుడు = డబ్బులు దాచిపెట్టడం
నివాలి పెట్టుడు = మంగళహారతి పట్టడం
నిశాని (ప) = గుర్తు
నిష (అ) = మైకం, మత్తు, కైపు, (నషానుండి వచ్చింది)
నిష్పానిష్పి (అ) = సరిసమానంగా, సగంసగం
నీ కంటికి నా సొడు= ఒక తిట్టు
నీ కాడుగల = ఒక తిట్టు
నీ తలపండు పలుగ = ఒకతిట్టు
నీ నెత్తెంటికలు కొరిగిత్త = నీ సిగతఅగ
నీ నోటి వాక్యాన అట్లనే కానీ = ఎదుటి వాళ్ళ మన హితం కోసం మాట్లాడినప్పుడు అది అలాగే నీవట్లనే జరగనీ అని అనడం
నీ బొంద నీ బొక్క = ఒక తిట్టు
నీ యక్క = గొల్ల కురుముల ఊతపదం
నీ యవ్వ = నీ తల్లి (తిట్టులో కూడ తెలంగాణలో తల్లికి బదులు అవ్వ అనడం గమనార్హం )
నీ యింట పీనుగెల్ల = ఒక తిట్టు
నీ యింట్లే మన్నుడవ = ఒక తిట్టు
నీ లంగ పీసునె గొడుదు = ఒక తిట్టు
నీ వంశం నిర్వంశంగాను = ఒక తిట్టు
నీ కంటికి నా కండలు = ఒక తిట్టు
నీట్కం = శుచీ, శుభ్రత, రుచి, అందం, నీటుదనం
నీడ = గూడు, ఇల్లు ( ఇంత నీడ చేసుకోవాలె )
నీను = నేను
నీర = (కల్లుకు పూర్వరూపం) పులియని కల్లు
నీరటికాడు = పొలాలకు నీరు పారించేవాడు
నీర్గట్టె = బురదపాము, నీటిపాము
నీలి = నీలిమందు
నీల్గుడు = పొగరుతో వుండడం, ఎదురుచూపులు చూడ్డం
నీల్లాట = ప్రసవం
నీల్లు పోయినంక రాల్లేసుడు = చేతులు కాలాక ఆకులు పట్టుకోవడం, గత జల సేతు బంధనం
నీల్లు లేవు నిప్పుల్లేవు = ఏవీ లేవు
నీల్లు తోడుదు = నీళ్ళు స్నానానికి తయారుగా వుంచడం
నీల్లువచ్చుడు = కన్నీరు కార్చడం
నీసుముచ్చోడు = మాంసాహారి
నుక్సాన్ (అ) = నష్టం
నుచ్చుగొట్టుడు = ఆవు మొ॥ వాటిని గంగడోలు నిమిరి మచ్చిక చేసుకోవడం ?

నుడుగులు = పంక్తులు, చరణాలు, అక్షరాలు, నుడులు
నున్నగ = నునుపుగా
నున్నగుంతలు = కుమ్మరులు కుండలను నునుపు చేయడం ?
నుమాయిష్ (ప) = ప్రదర్శన, ఎగ్జిబిషన్
నుర్సులు, నుర్గులు = నురుగులు
నువ్వద్దె = నిజం (నిబద్ధంలోంచి వచ్చింది)
నూకుడు = నెట్టడం, ఇల్లు ఊడ్వడం
నూతి = బావి
నూరు = వంద
నెక్కర్ = నిక్కర్
నెగుల పుట్టని పిల్ల = కలకాలం చక్కగా బతకని, మెలగని పిల్ల
నెగులుడు = మసలు కోవడం, సర్దుకు పోవడం, నిభాయించుకోవడం
నెత్తి = తల
నెత్తి ఎంటొకెలన్ని తాకులు = బోలెడు అనుభవాలు, ధక్కా మొక్కీలు
నెత్తికి = తలా ఒకరికి
నెత్తికిపోసుకునుడు = తలంటుస్నానం చేయడం
నెత్తి కొట్టుకునుడు = తలబాదుకోవడం
నెత్తి దిమ్మనుడు = తల తిరగడం, గిడ్డీనెస్
నెత్తి మీద శనేశిరం = శిరస్సు మీదనే శని తాండవం
నెత్తి మీదికి వచ్చుడు = పీకలమీదికి రావడం
నెత్తికెక్కుడు = తలకెక్కడం
నెత్తిగుద్దుకునుడు = తలబాదుకోవడం
నెత్తినొప్పి = తలనొప్పి, చికాకు, గొడవ
నెత్తిమీద కండ్లుండుడు = గర్వము కలిగి వుండడం
నెత్తిమీద నిత్తారం = మగడు (ఒక జాతీయం)
నెత్తిల పిడుగువడ్డట్టు = అశనిపాతం
నెత్తిల పురుగు మెసులుడు = తలలో పురుగు తొలవడం
నెత్తిల పెండ వుండుడు = తలలో మెదడు లేకపోవడం
నెత్తురు = రక్తం
నెత్తురు కలికలి అవుడు = గుండె చెరువు కావడం
నెత్తురు కొట్టుకునుడు = రక్తసంబంధం దృఢమైందని చెప్పడం
నెత్తురు గడ్డలు = సెగగడ్డలు
నెత్తురుబంక బైలు = రక్తవిరేచనాలు
నెనరు = ప్రేమ
నెరివడుడు = చిక్కిపోవడం, నిరీక్షణ
నెరీ = మరీ (నిండుగా)
నెరువు = పొడవు, వెడల్పు, నిడివి
నెల అవుడు = బహిష్టుకావడం
నెలగాసం = నెలకు సరిపడా సరుకులు, గ్రాసం
నెలపొడువు = చంద్రోదయం, చంద్రుడు
నెలమాసికం = మాసికం
నెల్లాల్లు = నెలరోజులు
నేటుకు = బహిరంగంగా, చాటుకు కాకుండా అందరిలో
నేతకాని = పద్మశాలి
నేముకుంట నడ్సుడు = కాళ్లతో ఎడంగా నడవడం
నేర (రి) వండ్లు = రేగుపండ్లు
నేర్పుడు = ధాన్యాన్ని ఆరబోసి చక్కగా కాళ్ళతో నేర్పడం
నైలాన్ సాబుదానాల్ = పెద్దగా ఉండే సగ్గుబియ్యం
నొక్కుపోవుడు = మొక్కపోవడం
నొగలు = నొగ
నొట్ట, నొష్ట = నొసట
నొప్పి = నెప్పి, తీపులు, బాధ
నోటి ముత్యాలు రాల్తయా ? = ముభావంగా వున్నవాళ్లను చూసి మాట్లాడితే ఏమవుతుందని అడగడం
నోటికచ్చుడు = కంఠతాపాఠంకావడం
నోటికాడి బుక్క సెడగొట్టుడు (నోటిదగ్గర బుక్కెత్తగొట్టుడు ) = తినేవేళ తిననియ్యకపోవడం
నోట్లె తడి ( నాలుక ) లేనోడు = మాట్లాడలేని, ఏదీ కావాలని అడగనివాడు
నోట్లె కెల్లి ఊశి (దుసి) పడ్డట్లుండుడు = పిల్లలు తల్లిదండ్రుల పోలికలన్నీ కలిగివుండడం
నోట్లె నోట్లె = తనలోతాను
నోట్లె బెల్లంగడ్డ పెట్టుకున్నట్లు = బెల్లం కొట్టిన రాయిలా
నోట్లె మంచినీల్లు పొయ్యక = పచ్చిగంగ ముట్టక
నోట్లె మన్నువడుడు = ఆపద కల్గడం, నష్టపోవడం
నోట్లెపండు = తలలో నాలుక
నోరు అప్పలిచ్చుడు = నోరు తెరవడం
నోరుకట్టుడు = మితభోజనం, పథ్యం చేయడం
నోరు గొట్టుడు = మోసగించడం
నోరు తిర్గుతలేదు = పదాలు ఉచ్చరించరావడం లేదు

నోరుతెర్సుడు, నోరంత తెరవెట్టుడు = నోరు వెళ్లబెట్టడం
నోరు వాయి లేని వనురాలు = నోరులేని జంతువులు
నోనుసపుట్టుడు = అదృష్టంతో, నోముతో పుట్టడం, నోచుకొని జన్మించడం
నౌనంబర్లు = వరిలో ఒక రకం

## ప

పంక = ఫ్యాను.
పంగటిచ్చుడు = కాళ్లను ఎడం చేయడం.
పంగనామాలు పెట్టుడు = మోసగించడం.
పంచకమిటీ = పంచాయతీ ఆఫీస్.
పంచగజ్జ పలారం = సంపాదనను అందరికీ పంచడం.
పంచతం, పంచితం = గోమూత్రం.
పంచన = ఆశ్రయంలో.
పంచనామ = పోస్టుమార్టం.
పంచపాల = గడపలమీద ముగ్గుపిండి మొ॥ పోసి వుంచుకునే పాత్ర
పంచాయితి, పంచాది = తగాదా.
పంచె = కండువా, గావంచా.
పంచోట్కం = పంపకాలు, పంచడం.
పంజలు (గడ్డి) = చిన్నమోపులు
పంజులు = పంచాయతీ మెంబర్లు.
పండు పండోలెవుండుడు = పండు ముదుసలి
పండుకునుడు = పడుకోవడం, పరుండి వుండడం.
పండును పారేసినట్లు పారేసుడు = కడదాకా తల్లిదండ్రులకు సేవలు చేసి చక్కగా అంత్యక్రియలు చేయడం.
పండుపండుడు రాలిపోవుడు = చాలా ఏళ్ళు బతికి చనిపోవడం, పండుముదుసలి రాలిపోవడం.
పండో పలమో = తృణమో, పణమో.
పండ్రి, పాండ్రి = పదండి.
పండ్లపుల్ల = పండ్లుతోము పుల్ల.
పండ్లు = పళ్ళు, ఫలాలు, దంతాలు.
పండ్లో అని అమ్ముకచ్చుడు = బజారులో పళ్లను పెట్టి అమ్మినట్లు ఒక వ్యక్తి ప్రవర్తనను బహిరంగ పరచడం.
పంతలకు కొట్టుడు (ఎడ్లను ) = కంచెలోకి కొట్టడం.
పంతలు = పణతలు, పడతలు, హనువులు.
పంతులు = టీచర్, పురోహితుడు, కరణం.
పంతె = ప్రమిద..
పందుం = ఐదు తూముల కొలత.
పందుంపుల్ల = పండ్లుతోముపుల్ల.
పంద్రాగస్టు = పదిహేనవ అగస్టు.
పంపకం / పంప్కం = సూదిని చేతబట్టి గుడ్డలపై దూరదూరంగా కుట్టడం,ఆస్తి పంపకాలు.
పంపుచార్ = పంక్చర్.
పకరు (అరబిక్ పదం) = పొగరు
పకాడి = కల్లు మొ॥ వాటిని నిలువచేసే తోలుతో చేసిన పెద్ద సంచిలాంటిది.
పకారం = ప్రకారం.
పక్క చేసుకునుడు = ఖాయం చేసుకోవడం, పక్కా చేసుకోవడం.
పక్కడ పక్కడ నవ్వుడు = పకపకానవ్వడం, పక్కున నవ్వడం.
పక్కపొంటి = పక్కకు.
పక్కబట్టలు = పడకబట్టలు.
పక్కబొక్కలు తేలుడు = చిక్కిశల్యంకావడం.
పక్కా = గ్యారంటీ,ఖచ్చితంగా
పక్కులు కట్టుడు = పుండ్లు ఆరి అట్టలు కట్టడం.
పక్తు (అరబిక్ పదం ) = అదేపనిగా.
పగటిల్లి = పగటివేళ
పగలు = పగ.
పగుడమంత = ఇసుమంత, రవ్వంత ,పిసరంత, ఆవంత( పగడమంత అని చెప్పడం )
పచ్చగూర = తోటకూర.
పచ్చటిపాకురు = నాచు
పచ్చడం = దుప్పటిరేకు.
పచ్చపూస = సత్యవంతుడు (నిందార్థం)
పచ్చముగ్గు, పచ్చపిండి = బియ్యప్పిండి + పసుపు.
పచ్చి = పక్షి
పచ్చిచేసుడు (పెయ్యి) = అనారోగ్యం , ఒంట్లో నలత.
పచ్చిపులును = చింతపండు పిసికి చేసిన పులుసు.
పచ్చిపులుసు తీరుగ = చులకనగా, పలచనగా.

పచ్చిపెయ్యి = బాలింతరాలి శరీరం.
పచ్చిబాలింత = ప్రసవపు నొప్పులు తగ్గి యింకా ఆరోగ్యవంతురాలు కాని బాలెంతరాలు.
పచ్చి మంచినీల్లు = పచ్చిగంగ.
పచ్చి మోసం = విపరీతమోసం.
పచ్చీసు = పాచికల్లాంటి క్రీడ.
పచ్చెలు = వక్కలు, ముక్కలు.
పజీతజేసుడు = పరువుతీయడం.
పజీతు = బజీతు, అవమానం.
పటంఏసుడు = చాట భారతం బెట్టడం
పటతోపం = పటాటోపం.
పటపట వడ్పుడు = కన్నీళ్ళు జలజలా రాల్చడం.
పటాౕలు = టపాకాయలు
పటాలం = సైన్యం.
పటాలం దిగుడు = బంధువులంతా కట్టకట్టుకు రావడం.
పటు = పట్టు (ము), తీసుకో,ఇంద
పటేల్ = పెద్ద
పటేల్‌గిరి = పెత్తందార్లు(మాలీపటేల్,పోలీస్‌పటేల్)
పటేల్‌తనం = మగతనం.
పట్కరోల్లు = పట్టుపని చేసేవాళ్ళు ?
పట్కె = వలన.
పట్టకాయిదం = పట్టాకాగితం
పట్టగొలుసులు = కాళ్ళ పట్టీలు.
పట్టచేసుడు = రిజిస్ట్రేషన్ చేయడం.
పట్టన పల్గుడు = Burst into tears, ఏడ్వడం, భోరున ఏడ్వడం, బద్దలవడం,గుండెపగిలినట్టు ఏడ్వడం
పట్టవగలే ఇల్లు చీకటవుడు = అవ్వలు చచ్చిపోయాక ఏడుస్తూ అనేమాట.
పట్టి = పట్టింపు, శ్రద్ధ, Concern.
పట్టి పట్టి చూసుడు = గుచ్చి గుచ్చి చూడ్డం, పరిశీలనగా చూడ్డం.
పట్టిండు = (చెప్ప)సాగాడు. ఆరంభించాడు,
పట్టిగట్టుడు = బాండేజ్ వేయడం, కట్టుకట్టడం.
పట్టిచ్చుడు = గుడ్డలు కుట్టించడం, కాజేయడం.
పట్టీ = లిస్టు, బిల్లు.
పట్టు = పట్టుదల.
పట్టుకు = వద్ద (ఇంటి పట్టుకు, నీడపట్టుకు).
పట్టుదొరుకుడు = కిటుకు, మర్మం, ఆయువు పట్టు దొరకడం ( వానికి సదువుల పట్టు దొర్కింది మంచిగ సదివిండు. నౌకరి కూడా దొరికింది ).
పట్టుపాలు = చిక్కని నీళ్ళు కలవని పాలు.
పట్టుపడుడు = దొరికిపోవడం.
పట్టె = ప్రాంతం, వైపు.
పట్టెదారు = పట్టాదారుడు.
పట్టెలు = మంచానికున్న అడ్డం పొడువు కర్రలు.
పట్టేంత / పట్టేన్ని = చాలినంత, చాలినన్ని,చాలా
పట్నం = హైదరాబాద్ నగరం
పట్నంతుమ్మ = సర్కారుతుమ్మ.
పట్నాలు ఏసుడు = ఒగ్గువాళ్ళు వచ్చి పసుపు, కుంకుమ, రకరకాల రంగులపిండితో ముగ్గులు వేయడం. (ఇదొక ఆచారం)
పట్రి = స్కేలు, కొలబద్ద.
పట్వ = కుండ
పడగొట్టుడు = దిగబెట్టడం (ఇంట్లో).
పడారిగోడ,పరారిగోడ = ప్రహరీగోడ.
పడావు = బీడు
పడిగె = పడగ.
పడిపోయినట్లు = కొంపలంటుకున్నట్లు.
పడిపోలే (దు) = కొంపలంటుకపోలేదు. మించిపోలేదు, కొంపలు మునగలేదు.
పడిరాకపోవుడు = ఒకరంటే మరొకరికి గిట్టకపోవడం, అసయోధ్య.
పడిరానోడు = శత్రువు.
పడిశెం = జలుబు.
పడుకుంట లేసుకుంట = పడుతూలేస్తూ.
పడుడు పడుడే = పడడంతోటే.
పడుసు పెడుసు = పడుచుదనం తలబిరుసుగా వుంటుందని చెప్పడం
పడుసుపోరగాండ్లు = యవ్వనంలో ఉన్నవారు
పడెంత్యం = పర్యంతం.
పడ్డి = పంతం.
పడ్తల్ = లాభం, గిట్టుబాటు.
పడ్వాటు (నీల్లు) = వాననీరు ఇంటిపై పడి బయటకు పోయేపీలు.
పతంగి = గాలిపటం.
పతకం / పత్కం = పథకం, ప్లాన్ ( ఈ యిల్లు ఎన్మిది గజాల పతకంతోని కట్టిండు )
పతాకం = ఒకే తీరుగా, ప్రత్యేకం.
పతాన పుంగురం, పతానపుటుంగరం = ప్రధానపు వుంగరం (పెళ్లిలో).

పతార = పరపతి.
పతిది = ప్రతిదీ
పతుకులాడుడు = వెతకడం.
పత్త = చిరునామా.
పత్తాలు = చీట్లపేక, పేకముక్కలు.
పత్తి = పాళీ, నిబ్.
పత్తిత్తు = పతివ్రత, సత్యవంతురాలు(నిందార్థం)
పత్తెం = పథ్యం.
పత్రలు = ఇంటిపై రేకులు, బీడీఆకులు, సైజుకు కత్తిరించే పత్రలు.
పత్రిక పెట్టుకునుడు = నిశ్చితార్థం.పెళ్ళి పత్రికరాసుకోవడం
పత్లా = పలుచని.
పదం = పాట.
పదన = తేమ.
పదారు పండుగు= పెళ్లయ్యాక 16 రోజులకు నల్లపూసలు గుచ్చి శోభనం జరపడం.
పదిమందిల పని = పదుగురిలో పని.
పదిమంధిల పెట్టుడు = బహిరంగం చేయడం.
పదుర్కునుడు, బదులుకొనుడు = ముందే కూడబలుక్కోవడం.
పదేను = పదిహేను.
పదైదు = పదో పరకో.
పద్దులు = ఐటమ్స్.
పనగర్ర = పందుం పుల్ల.
పనాయి, పనకాయి, పన్కాయి = తాయం, తాయిలం.
పనికిమల్లె = పనికిమాలిన.
పనిచేసి పనిచేసి కొట్టువడుడు = చిక్కిపోవడం.
పనిదీరుడు = పని అయిపోవడం.
పని పాటలోల్లు = కూలీనాలీ జనం.
పనిపాతర వెట్టుడు = పని పక్కన పెట్టడం
పనిమంతుడు = మంచి పనివాడు.
పనివట్టుడు = అంతం చూడ్డం.
పనివడి వచ్చుడు = పని అవసరంపడి రావడం.
పనివరుస = పనిచేసే పద్ధతి.
పనుల ముమ్మిరి = పనుల ఒత్తిడి.
పనోల్లు = పనిచేయువాళ్లు
పన్గడి = కర్రలతో చేసిన చిన్నగేటు లాంటిది.
పన్న, పన్నా = గుడ్డకు వెడల్పు కొలత, (కొన్ని గుడ్డలకు పన్నా చిన్నగానూ, మరి కొన్నింటికి పెద్ద గానూ వుంటుంది )
పన్నవా ? = పడుకున్నవా ?
పపంచమ్మీదికి వచ్చినపుడు = ఈ లోకంలోకి వచ్చినప్పుడు
పప్పలు = చిన్న పిల్లలకు పెట్టె పప్పులు మొ॥నవి.
పప్పు పుట్నాలకు చేసుడు = చిరుతిండ్లకే సంపాదన ఖర్చు చేయడం
పబోజనం = ప్రభోజనం
పబ్బం గడ్పుకునుడు = వెళ్ళదీసుకోవడం, తెలివితో ఖర్చులేకుండా వండుగను వెళ్ళదీసుకోవడం.
పబ్బతివట్టుడు = చేతులు జోడించడం (ప్రపత్తి పట్టడం )
పబ్బులు = Tree guard లాగా లేత మొక్కల చుట్టూ పాతిన పుల్లలు,తిగలుపాకడానికి పెట్టేవి (ప్రబ్బ)
పమానం = ఒట్టు, ప్రమాణం
పమ్మడు = సూదిని చేతబట్టి దూర దూరంగా కుట్టడం.
పయ్య = చక్రం
పయ్యాది = ముదురు ఎరుపురంగు పశువు.
పరంచు దోతులు = పరమ్‌సుఖ్ కంపెనీ ధోవతులు
పరంతురం = మొదటినించీ.
పరంపరం అవుడు = నుగ్గునూకా కావడం.
పరంపోగు = పోరంబోకు
పరకడపుల్ల = పందుంపుల్ల ( పరిగడుపున నోట వేసుకునే పుల్ల ?
పరకు (అ) = తేడా, ఫరక్
పరకువడది = తేడారాదు.
పరపక్షం = విపక్ష
పరపూరు = పారుగూరు
పరాకత్‌గ ( అరబిక్‌పదం ) = హాయిగా , నిక్షేపంగా, లీజర్‌గా.
పరాట = గోధుమ పిండి మొ॥ వాటితో పొరలు పొరలుగా చేసినరొట్టె
పరాత్పరం, పరాస్పరం =వేరుగా
పరాయోల్లు = ఇతరులు
పరారవుడు = పరారీ
పరార్లున్నడు = పారిపోయాడు
పరాశికాలు = హాస్యాలు, పరిహాసాలు

పరిక్కంప = గయ్యాళి గంప
పరిచ్చపట్టిచూసుడు = పరిశీలించిచూడడం, గుర్తించడం
పరుపుబండ = విశాలంగా పరుచుకుని వున్న రాయి.
పరేశాన్( పర్షియన్ పదం ) = చికాకు.
పర్క = పరకచేప.
పర్ద ( పర్షియన్ పదం ) = తెర, పరదా, కర్టెన్
పర్దక్షణ = ప్రదక్షణ
పర్మాయిష్ = అత్యంత యిష్టమైనది.
పర్రపర్ర చింపుడు = పరపరా చించడం
పర్రె = పగులు.
పర్వ ( పర్షియన్ పదం ) = ఫరవా.
పర్వదక్కువ = గౌరవంలేకపోవడం
పల పల ఎండుడు = ధాన్యం చక్కగా ఎండడం.
పలంగ్ = మంచం.
పలపలకాలుడు = చక్కిలాలు మొ॥నవి చక్కగా కాలడం.
పలాని = ఫలానా.
పలారం = ఫలాహారం, అల్పాహారం.టిఫిన్
పలావ్ = బిర్యానీ లాంటిది.
పలుచదనం = చులకన, పలుచన.
పల్కరిచ్చుడు = పరామర్శించడం.
పల్కులు = గింజలలోపలి భాగాలు,పప్పు బద్దలు, దళాలు
పల్కువట్టుడు = గింజపట్టడం.
పల్చతక్కదనం = చులకన, పలుచన.
పల్టిగొట్టుడు = బోర్లపడడం, పల్లటీలు గొట్టడం.
పల్ల = ధాన్యం కొలమానం
పల్లవల్ల ఏడుసుడు = విలవిలా ఏడ్వడం.
పల్లి = చిన్నపల్లె
పల్లికాయ = వేరుశనగ.
పల్లిపటొక = వేరుశనగ, బెల్లంతో చేసిన తీపి.
పల్లు = పన్ను, దంతం.
పల్లెం = పల్లవి.
పల్లేరు కాయల్ల బొర్లిచ్చినట్టు = ఒక జాతీయం, అంపశయ్యపై ఉంచినట్టు
పశనత్ = గుర్తుపట్టడం.
పశ్న = ప్రశ్న
పస = సారం
పసంద్ ( పర్షియన్ పదం ) = ఇష్టం, నచ్చడం, అందం.
పసరం, పసురం = పశువు
పసరు = పైత్యరసం.
పసరుగాయ = పెసలు మొ॥ వాటి లేతకసుగాయ
పసల్ ( అరబిక్ పదం ) = పంట
పసాదం,పశాదం= మలం (తొక్కితె పసాదం ఎల్లుతది)
పసాదం = ప్రసాదం (తిన్నతిండి)
పసాయించుడు = యిరుక్కుపోవడం.
పసికడ్గులు = బియ్యం కడిగిన నీళ్ళు.
పసిగుడ్డు = పసికందు
ప్రసిద్ధి = ప్రసూతి
పసిపోరడు = పసిపిల్లవాడు
పసిరికలు = పచ్చకామెర్లు
పసీన్ = చెమట
పసుపు కుంకుమలు = పేరంటాలు
పసుపు బియ్యం ముట్టుడు = ఆరోపణ ఎదుర్కొంటున్న వ్యక్తి తన నిర్దోషిత్వానికి చేసేపని.
పసుల పండుగు = ఏరువాక ?
పసూతి = ప్రసూతి
పస్కలు = పచ్చకామెర్లు.
పస్కీలు = గుంజిల్లు
పస్క = పచ్చిక
పహాని,పానీ = భూములు, ఇళ్లు మొ॥వాటిభూమి యజమాని,కాస్తుదారు వివరాలు తెలిపే పత్రం.
పహిల్వాన్లు = వస్తాదులు
పా = పద .
పాంచాన =. ఐదు అణాలు
పాండురోగం = తెల్లగా పాలిపోవునట్లు చేయగల్గిన వ్యాధి
పాంతెం = ప్రాంతం.
పాందాన్ = తాంబూల పేటిక
పాంపడిగె చెట్టు = నాగజెముడు
పాక = ఓరపాక
పాగల్గాడు = పిచ్చోడు
పాట పాడుడు = వేలంపాట పాడడం.
పాటం = పాఠం
పాటం జదువుడు = పాడిందే పాడడం.
పాటగొట్టుడు = టిక్కు గొట్టడం

పాటకులు = గేటు
పాటి = ప్రమాణం, రూఢి ( వాని మాటంటె మాటే ఎంతో పాటి ).
పాటిచ్చి చూసుడు = పరీక్షగా నిశితంగా చూడడం.
పాడురాత = దుర్విధి
పాత,పాతరేకు = పాతబట్ట,పాతబట్ట, పాతచీర
పాతర పెట్టుకోలే = దాచిపెట్టుకోలేదు
పాతవడుడు = వెళ్లినచోట కొత్తవాడిలా కాక పాతబడి పోవుడు, (వాడు ఆ వూళ్ళె పాతవడ్డడు . ఎప్పుడో చేరుకున్నాడని కూడా అర్థం )
పాతాళగరిగె = గేలం, పాతాలభేది
పాతులాడుడు = తాపత్రయపడడం, కష్టపడడం, ప్రయత్నించడం,వెతకడం
పాత్కం = పాపం, పాతకం
పాదం = కార్తెలో ఒక భాగం,నక్షత్రంలో పాదం
పాన్ = తమలపాకు
పాన్‌డబ్బ = కిళ్ళీబడ్డి
పానం = ప్రాణం, ఒళ్ళు, ఆరోగ్యం.
పానంఅల్కగవుడు = ఆరోగ్యం కుదుట పడడం.
పానం అవిసిపోవుడు = అవసాన దశ.
పానం ఎదురువెట్టుడు = ఆయుష్షు పోయడం.
పానం కూలవడుడు = జబ్బు చేయడం.
పానం కొలికిలకచ్చుడు = తల ప్రాణం తోకకు రావడం.
పానం పయిలం = ఆరోగ్యం జాగ్రత్త !
పానం బెట్టిండు = కాస్త ఆరోగ్యవంతుడయ్యాడని చెప్పడం.
పానం మంచిగలేదు = అనారోగ్యం.
పానం సొల్గుడు = ఒళ్ళు తూలడం
పానపాన సోపతి = ప్రాణ స్నేహం
పానమసోంటి సుట్టం = ఆత్మబంధువు
పానాదులు = సంది
పానాలగుత్తోడు = హంతకుడు
పానాలు = బండిపానాలు (Spanners)
పాన్కం = పానకం, పాకానికి రావడం.
పాప్డ = అప్పడం.
పాపందాకుడు = పాపం చుట్టుకోవడం.
పాపకారి మనిషి = పాపాత్ముడు
పాపటబిల్ల = పాపిట ధరించే నగ
పాపాత్కుడు = పాపాత్ముడు
పాపుడు (అలుమగల్ని) =పాపడం, (కుటుంబాల్ని) విడదీయడం.
పాపోనులు,పాపూనులు = చెప్పులు ( పాద పోషకాలు )
పాపోసుల పూజ = చెప్పులతో శిక్షించడం.
పాబంది,పావంది (పర్షియన్ పదం) = నిర్ణయం, కట్టుబాటు
పాయికాన(ప) = కక్కోసు, మరుగుదొడ్డి.
పాముచాపలు = పాపెర్లు
పాయిదా (అరబిక్ పదం) = లాభం
పాయిరం = పావురం, ప్రేమ, గారాబం,అభిమానం
పాయె = పోయె (ను)
పార్ అవుడు = ఆటలో గోలీలు మొ॥నవి గీతదాటి దూరం పోవడం
పారుడు = గ్రహణి,విరేచనాలు
పారుడు (పెన్ను) = రాయడం
పారేత్తు = పారేద్దును, పారవేద్దును.
పారేసుడు = బాధ్యతగా కడదాక తల్లిదండ్రులకు సేవలు చేయడం.
పార్కం (నీటి) = ప్రవాహం
పార్వతులోల్లు=శివునిపేరుమీద పెళ్ళిలేకుండా ఉండే స్త్రీలు
పార్శపునొప్పి = తలకు ఒక పక్కన వచ్చేనొప్పి
పార్శోల్లు = ఇరాన్‌దేశీయులు
పాల (పిట్ట) = పాలగుమ్మ
పాలపండ్లు = వృద్ధులకు పండ్లూడి మళ్లీ వచ్చిన పండ్లు
పాలమూరు = మహబూబ్‌నగర్(పాలు, మోరు (చల్ల) ఒకప్పుడు సమృద్ధిగా ఉన్నఊరు)
పాలవిందె = నల్లికళ్లపాము,నకిరీ
పాలాకులు = ఒక రకం వరి
పాలాప్రం = మొక్క జొన్న అట్లమీదికి వేసుకునే పాయసం లాంటిది
పాలాయన = పాలబ్బాయి
పాలిదిగాదు పంగదిగాదు = దాయాదులు కాని వాళ్ళు
పాలియాల్ల = పాలిచ్చే వేళ
పాలు = భాగం ( మాంసం, పళ్ళు మొ॥ వాటిలో)
పాలు పొంగిచ్చుడు = గృహప్రవేశ వేళ చేసేపని
పాలు మర్సుడు = పిల్లలు తల్లిపాలు తాగడం మరిచి ఘనాహారం తీసుకొనే వయస్సుకు రావడం

పావు = నూనె మొ॥ వాటి చిన్న పాత్ర
పావుల = పావలా
పాశికల్లు = నిన్నటి కల్లు
పాశినోరు = మొకం కడగని నోరు
పాశిపని = ఇల్లు ఊడ్వడం, వంటగిన్నెలు కడగడం లాంటిపని, కిందటి రోజు మిగిలిన పని, ప్రాచి పని (ప్రాచి= తూర్పు )తెల్లవారగనేచేసేపని
పాశిపోవడం = అన్నం లాంటివి చెడి పోవడం, ఎడబాసిపోవడం.
పాశెం = పాయసం
పాసంగం = పడికట్టు
పాసుట్టు = పాదట్టు, పాదొట్టు, సాలెగూటి బూజు
పించన్ = పెన్షన్
పింజం పింజం అవుడు = బితుకు బితుకుమనడం
పిండికూర = పిండి బొద్దికూర
పిండుడు (పాలు) = పితకడం
పిండెం = గట్టి పిండం, ఘనాపాటి
పికరు (అరబిక్‌పదం) = విచారం బాధ, చింత .
పికిలి పోవుడు = పిగలడం
పిక్క (మామిడి) = టెంక.
పిక్కు = రిఫిల్
పిక్కుఅవుడు = ఓడిపోవడం
పిక్కుటం = బిగుతుగా వుండడం
పిచ్చ(కాయ)లు = వృషణాలు
పిచ్చకుంట్లోల్లు = పిచ్చుక కుంట్లు
పిచ్చలుకొట్టుడు = కోడెకు వృషణాలు చిదగ్గొట్టి ఎద్దును చేయడం
పిచ్చల్ దప్పలు గొట్టుడు = విపరీతమైన భయం కావడం
పిచ్చలకు పిడుదు పట్టినట్లు = కబంధ హస్తాల్లో ఇరుక్కున్నట్లు
పిచ్చికొట్టుడు = పిచ్చకొట్టడం, విపరీతంగా కొట్టడం.
పిచ్చిలేసుడు = పిచ్చిపట్టడం
పిట్ట = పిచ్చుక, పక్షి
పిట్టకతలు = ఉపాఖ్యానాలు
పిట్టకు పిట్ట సోపతోలె = చిలకా గోరికల్లా
పిట్టకూడు తినుడు = పిట్ట తిన్నంత తక్కువకూడు తినడం
పిట్టపియ్యి = (పక్షి) రెట్ట
పిట్టమ్యాత = పిట్ట తిన్నంత తక్కువైన తిండి
పిటానపిరం = ధరలు మండిపోవడం
పిట్రోలు = పెట్రోలు
పిట్ల = శనగపిండి మొ॥ వాటితో చేసిన కూర
పిడాత = ఒక్కసారిగా, ఉన్నపళంగా(పిడుగువాత)
పిడి = తరం,Generation
పిడి (కొడవలి) = పిడి
పిడికిట్ల వట్టుడు = అదుపులో పెట్టుకోవడం
పిడికెడు పిడికెడు = గుప్పెడు, పట్టెడు
పిడీల్ పిడీల్ = తరతరాలుగా
పిడుగు వడ్డట్లు చేసుడు = అశనిపాతంలా
పిడ్కల కుచ్చె = పిడకల రాశి
పిడ్డలు = కొణుజులు, పిడుజులు
పిడ్స = ముద్ద
పిడ్సలు = చిమ్మిలి
పిత్కులు పిత్కులు = చిన్న ముక్కలు
పిత్త పిత్తుకు = మాటి మాటికి, మాట మాటకు
పిత్తెమంత పిత్తెమంత = కొద్ది కొద్ది
పిన్నాడు = చిన్నాడు
పిన్నీసు = గుండు సూది
పిన్మడు = వరుడు(పెణ్ మగడు,పెణ్ అంటే స్త్రీ)
పిప్పల్లు,పుప్పిపల్లు = పుచ్చిన దంతాలు
పియ్యిలితత్తులు ఏరుక దినుడు = మహా పిసినారితనం చూపడం
పిరం = ప్రియం
పిరికి పిత్తులోడు = పిరికిపంద
పిరికిపోతు = పిరికిపంద
పిరికెడు పిరికెడు = పిడికెడు పిడికెడు
పిరీగ = ఫ్రీగా
పిర్యాదు (ప) = ఆరోపణ
పిత్రలు చూసి పీటలు ఏసుడు = ఏ ఎండకు ఆ గొడుగు పట్టడం
పిలగ్ = ప్లేగు
పిలాస్టిక్ = ప్లాస్టిక్
పిలేట్ = ప్లేట్
పిలేటు = ప్లాటు
పిల్లంగొయ్య, పుల్లంగొయ్య = పిల్లనగ్రోవి
పిల్ల = అమ్మాయి
పిల్ల పిల్లతరందాక = తర్వాతి తరాల వరకు
పిల్లగాడు = అబ్బాయి, వరుడు
పిల్లజెల్ల = పిల్లాపాప, పిల్లా పితకా, పిల్లాపీచూ

పిల్లతొవ్వ = పిల్లబాట, కాలిబాట
పిల్లజూసుడు = పెండ్లిచూపులు
పిల్లపిన్మడు = వధూవరులు
పిల్ల పిలగాడు = వధూవరులు
పిల్లలకోడి తీర్గ = తల్లికోడి తనపిల్లలతో వున్నట్లు (ఎప్పుడూ నలుగుర్ని వెంట బెట్టుకొని తిరగడం)
పిల్లలు = సంతానం
పిల్లి ఏడిండ్లు దిప్పినట్లు = ఒక జాతీయం, చాలా కష్టపడి పిల్లల్ని సాకడం.
పిల్లి పెసర = పిల్లపెసర, కాకిపెసర
పిల్లివట్టిన కోడి తీరుగ =బిక్కు బిక్కు మనుకుంటూ, దయనీయంగా
పిల్లిగడ్డం = ఉల్లిగడ్డం
పిల్లిపిల్లోలె తిరుగుడు = దయనీయంగా వెంట తిరగడం.
పిష్పి = సంచి
పిస = పిచ్చి
పిసపిస చేసుడు = పిచ్చిపట్టినట్లు చేయడం
పిసబిత్తిరి = పిచ్చి + బిత్తర
పిసరు = బంగారం లాంటి వాటి మచ్చు
పిసికిపోవుడు = జారిపోవడం
పిస్క వట్టుడు = పిసినారితనం ప్రదర్శన
పిస్కుడు = గొంతునులమడం
పిస్కిళ్ళు = లేత జొన్నల ఆహారం
పీకుడు = వెళ్లిపోవడం, చనిపోవడం
పీకులాట = గొడవ
పీకె = తాటి ఆకుతో చేసిన సన్నాయి లాంటిది
పీడదినాలు = సంక్రాంతికి ముందు నెలరోజుల నుండి మొదలైన చెడు రోజులు(పుష్యమాసం)
పీడిచ్చుడు = పీడించడం
పీతాంబ్రం = పట్టుచీర
పీతిగొడ్డెలు = ఎండిన మలం
పీతిరి = పియ్యికి సంబంధించింది
పీతిరి కట్నం = ఆడపిల్లకు పెండ్లి చేసి పంపేటప్పుడు చాకలి వాళ్ళు అడుక్కునే కట్నం మొ॥నవి
పీతిరిగద్దలు = రాబందులు
పీతిరి దొడ్డి = కక్కోసు
పీనాసి = పిసినారి
పీనాస్కం = పిసినారితనం
పీస్గ = శవం
పీప (పోర్చుగీసు పదం) = బారెల్, పీపా
పీరీల గుద్దల కట్టె లెక్క వుండుడు = సన్నగా రివటలా వుండడం
పీరీల పండుగ = మొహర్రం, పీర్లపండుగ
పీర్తి = ప్రేమ, ప్రీతి, అభిమానం
పీసు = (మామిడి) పీచు
పీసు పీసుమనుకుంట = భయపడ్తూ
పీసుపీసు = పిసినారితనం
పుంగి = నాగస్వరం
పుంజీతం = పులిజూదం, ఒకరకమైన ఆట
పుంటికూర = గోంగూర, పుల్లటికూర
పుకార్లు = వదంతులు
పుక్కడ్కు,పుక్యానికి = ఉచితంగా, ఫ్రీగా, ఉత్త పుణ్యానికి
పుచ్చువట్టుడు = పుచ్చిపోవడం (తమిళంలో 'పూచ్చి' అంటే పురుగు)
పుచ్చెలు (సీతాఫలం) = సీతాఫలంపై తొక్కలు
పుజూల్గ (అ) = ఉత్తగా
పుటంబెట్టుడు = కొబ్బరికాయ రంధ్రాల ద్వారా లోపల పంచదార నింపి తంపిలో కాల్చడం
పుట్క = పుట్టుక
పుట్ట పురుగు లేదు = నివాసమూ, నివాసితులు లేని నిర్జనస్థితి
పుట్టబంగారం = పుట్టమన్ను
పుట్టలు ఏసుడు = అట్టలు వేయడం (పుస్తకాలకు)
పుట్టి = ఎనిమిది పల్లాలు ?
పుట్టిందోనాడు పచ్చిందోనాడు = పిరికి పంద క్షణక్షణం చస్తే, సాహసి ఒకేసారి చస్తాడు
పుట్టిచ్చి = కల్పించి
పుట్టురేబండ = పుట్టినిల్లు
పుట్టులు పురుల్లు = ప్రసవాలు మొ॥నవి
పుట్టువడి = పుట్టుక
పుట్టెడప్పులు = బోలెడు అప్పులు
పుట్టెడు బల్గం = గంపంతబలగం
పుట్నాలు = వేపుడు పప్పు, వేపుడు శనగలు
పుడ = పాకెట్ (బిస్కెట్), పొట్లం
పుత్కం = పుస్తకం
పునాస పంట = పునర్వసులో వేసినది.
పునాస, యాసంగి = ఖరీఫ్- రబీ
పున్కుడు = తడమడం,వెతకడం

పున్కులు, పూర్ణాలు = పుడుకులు. పుణుకులు
పుబ్బ = పూర్వ ఫల్గుని
పురస్తు = విశ్రాంతి
పురాంగ,పురాగ, పురాత = పూర్తిగా
పురానం బెట్టుడు (మల్లేదో) = సుదీర్ఘ ఉపన్యాసం లాంటిది మొదలెట్టడం
పురిసెడు = అరచేతిలో పట్టదగినంత
పురుగు = మనిషి
పురుగుబూసి = పురుగూపుట్రా
పురుడు = బారసాల
పురెక్కిచ్చుడు = రెచ్చగొట్టడం
పుర్ర = ఎడమ
పుర్రె = బుర్ర, పుచ్చె
పుర్సత్ (అ) = విశ్రాంతి
పుర్సాల్లు, పురుసాలు = వృషణాలు
పులగంద = కంద
పులిపచ్చి = ఉలిపచ్చి, నులిపచ్చి
పులుసులకు బొక్క లేకుండా దంచుడు = విపరీతంగా దండించడం
పులెగండు మనిషి = తిండిపోతు
పులోటు= ఫ్లూటు
పుల్కలచ్చుడు = పులకరం రావడం
పుల్కలు = నూనెవాడకుండా సన్నగా చేసిన గోధమ రొట్టెలు
పుల్కు పుల్కున ఏడ్సుడు = దయనీయంగా ఏడ్వడం
పుల్గం = ముద్దాన్నం
పుల్లగూర = పులుపుగల కూర
పుల్లరి = పశువుల మేతమీద వేసిన పన్ను
పుల్లల శీపిరి = ఈతకమ్మలతో చేసింది కాక పుల్లలు గలది
పుల్లలు ఏసుడు = బొడ్డుపైన వాతలు వేయడం (పిల్లలకు)
పుల్లలు పుల్లలు అవుడు(అన్నం) = విడివిడిగా కావడం
పుల్లలు వెట్టుడు = జోక్యం చేసుకోవడం, అడ్డగించడం.
పుల్లావు = తెల్లఆవు
పుల్లెందలు = కష్టాలు
పుల్సరం ఏసినట్లు = పుల్లటి త్రేన్పులు వచ్చినట్లు
పుల్సుగారుడు = పనిపట్టడం
పువ్వులల్ల బెట్టుకుని చూసుడు = అపురూపంగా ప్రేమగా సాకడం (ముఖ్యంగా తల్లిదండ్రుల్ని)
పుసపుస పోవుడు, పుస్స పుస్స పోవుడు = విసవిసా వెళ్లడం
పుస్కున = అకస్మాత్తుగా, ఒకవేళ
పుస్తెలు = తాళి
పూజకు పూజ = సున్నకు సున్న
పూట్కం = ప్రారంభించడం, పూనిక
పూనకులోల్లు = కూనపులివాళ్లు
పూనపైంటు = పైకి క్రిందికి ఒకే కొలతలతో వున్న తెల్లని ప్యాంటు
పూనింది ? (ఏం) = ఆవహించింది ?
పూర = పూర్తిగా
పూర్నం = పోలె మధ్య నిండుగా పెట్టేది
పూర్నీలు = టపంచె, పిస్తోలుకు పెట్టి కొట్టే దీపావళి పూర్నీలు
పూలుపండ్లు = కన్యాపూజ, లక్ష్మిపూజ
పూల్, పూల్గు = వంతెన
పూల్గుబొక్క = మూలుగు
పూసగుచ్చినట్టు = వివరంగా
పూసగుచ్చే పొద్దు (ఉండది) = అల్పసమయం ( పుష్యంల పూసగుచ్చే పొద్దుండది )
పూసబొక్కలు = వెన్నుపూసబొక్కలు
పూసవేర్లోల్లు = పూసలు, పేరులు (దండలు) అమ్మే వాళ్ళు
పెంకాసులు = పెంకులు
పెంచు = పెంక, మంగలం
పెంట = ఎరువు, తలనొప్పి
పెంటమీద పెంటవడుడు = ఉన్నోడు ఉన్నోడికే పెట్టడం, లేనోడు ఉన్నోడికే పెట్టడం
పెంటర = క్షవరం, కటింగ్, క్రాఫ్
పెంఢ = పేడ
పెండకజ్జరం = పిండఖజ్జూరం ?
పెండకడి = పేడముద్ద, మందబుద్ధి
పెండగౌరమ్మలు = గొబ్బిళ్ళు
పెండవెట్టుడు = విఫలుడవడం
పెండె = ఎనుగర్ర, వాసాల మధ్య కొట్టిన కట్టె
పెండ్లవుడు = శిక్షపడడం
పెండ్లి = పెళ్లి

పెండ్లి పిలగాడు = వరుడు
పెండ్లికొడుకు = వరుడు
పెండ్లినడక = మెల్లగ నడవడం
పెండ్లిపిల్ల = వధువు
పెంపు చేసుకోవాలె = అభివృద్ధిలోకి రావాలి
పెంపు అవుడు = అభివృద్ధి కావడం
పెంపుకానికి వచ్చుడు = దత్తతకు రావడం
పెగ్గెలు = ప్రజ్ఞలు, ప్రగల్భాలు
పెచ్చుడు = నోరు, కాలి వేళ్ల సందులు పెచ్చి పుళ్ళు కోవడం
పెచ్చులు = హెచ్చులు, సున్నం మొ॥ వాటి పెచ్చులు
పెట్టు = దెబ్బ, సమానం ( వాడు ఇద్దరిపెట్టు )
పెట్టువోతలు = లాంఛనాలు
పెట్ల = ఒక్క పెట్టున, దెబ్బకు, అకస్మాత్తుగా, పెట్టుల, పెటిల్లున
పెడదిర్గుడు = ఒక్కటనుకుంటే మరొకటి కావడం, చెడిపోవడం
పెత్రమాస, పెద్దలమాస = మహాలయమావాస్య
పెద్ద అవుడు = రజస్వల కావడం
పెద్ద గటం = ఘటికుడు
పెద్దగ చూసుడు = గౌరవించడం
పెద్దచెయ్యి = ఎముకలేని చెయ్యి
పెద్దతల్కాయలు = ప్రముఖులు
పెద్దదర్వాజ = సింహద్వారం, వీధితలుపు
పెద్దపిట్ట = గుడ్లగూబ
పెద్దపీట = అగ్రాసనం
పెద్దపుష్యాల = పుష్యమి
పెద్దపూసాల = పునర్వసు
పెద్దపెయ్యి (మనిషి) = భారీకాయం
పెద్దబజారు = రాచవీధి
పెద్దబాపు = పెద్దనాన్న
పెద్దమన్సు చేసుకునుడు = ఔదార్యాన్ని చూపడం
పెద్దమాంసం = గోమాంసం, ఎద్దు, గేదె మొ॥గు వాటి మాంసం
పెద్దమ్మ = జ్యేష్ఠాదేవి, ముదిరాజ్‌ల కులదేవత, పెత్తల్లి
పెద్దమ్మలోల్లు = పెద్దమ్మ దగ్గర పూజజేసేవాళ్ళు
పెద్దరాత్రిరిలేసుడు = మధ్యరాత్రి లెగడం
పెద్దరోగం = కుష్ఠువ్యాధి
పెద్దల కిచ్చుడు = పితృతర్పణం
పెద్దలు జచ్చినంత దుక్కం = విపరీత బాధ
పెద్దలోకులు = నాగరికులు, విద్యావంతులు, మోతుబరులు
పెద్దల్ల కల్సుడు = చనిపోవడం
పెద్దవాగు = నది
పెద్దసారు = Headmaster, ప్రధానోపాధ్యాయుడు
పెద్దాయి = పెత్తల్లి
పెద్దిర్కం = పెద్దరికం
పెద్దోల్లు = హరిజనులు
పెన్మిటి = మగడు
పెబ్బె = నాయకుడు (తరగతి మొ॥ వాటికి)
పెయికడుక్కునుడు = స్నానం చేయడం
పెయికాక = జ్వరం
పెయిగరం = జ్వరం
పెయినిండ బట్టలు, సొమ్ములు పెట్టుడు = వస్త్రాదులను కానుకలుగా పెట్టడం
పెయిపొంట ముండ్లచ్చుడు = శరీరమ్మీద తేళ్ళూ జెర్రులు పాకినట్లుండడం, జలదరింపు
పెయిల బుగులు లేదు = నిర్భయత్వం
పెయిసబ్బు = టాయ్‌లెట్ సోప్ (ఒంటి సబ్బు)
పెయ్య = ఆడదూడ
పెయ్యన్ని కండ్లుండాలె = చిన్నపిల్లల మొ॥ వారి పట్ల జాగ్రత్త వహించాలి అని చెప్పడం
పెయ్యి = శరీరం, మెయ్యి
పెయ్యి అంత పుండు పుండు అవుడు = ఒళ్ళు హూనం కావడం
పెయ్యి తిర్గుడు = ఒళ్ళు తూలడం
పెయ్యి పులిసినట్లు అవుడు = బాగా అలసిపోవడం
పెయ్యి బరువవుడు = బద్ధకస్తుడు కావడం, జ్వరం రావడం
పెయ్యి మందమవుడు = లావు అవడం
పెయ్యి మీద రోమాలు లేశి నిలవడుడు = రోమాంచం, గగుర్పాటు, జలదరింపు
పెయ్యిచేసుడు = లావెక్కడం
పెయ్యినవట్టుడు = ఒంటపట్టడం
పెరడు = మొక్కజొన్న చేనువంటిది
పెరుగువాటు = పెరుగుదల
పెరుమాల్లు = కల్లుకుండ, ( శ్రీ వైష్ణవులలో సంకేతభాష )

పొద్దునట్టు = పొద్దుట
పొద్దుమాపు = రాత్రింబవళ్ళు
పొద్దులు (పడుడు) = గర్భవతికి 9 నెలలు నిండిన తర్వాతి రోజులు
పొద్దువోయి వచ్చుడు = ఆలస్యంగా రావడం
పొద్దెక్కినంక = ఆలస్యంగా
పొన్క = బండిలో ధాన్యాదులు పోయడానికి ఉపయోగించేది
పొన్న = పొడుగునా (దారి పొన్న చూసుకుంట పోవాలె )
పొన్ను = రోకలికి చివరవుండే ఇనుప కడియం
పొప్పెడి = బొప్పాయి
పొయినమట్టె = పోయింది కావచ్చు
పొయిలకట్టెలు = వంటచెరకు
పొర్క = ఎండిపోయిన చెట్టుకొమ్మలు, రెమ్మలు
పొర్లాడుడు = చాలా కష్టపడడం
పొలగాడు, పొల్లగాడు = పిల్లవాడు
పొలి = పంట, బలి
పొలేసుడు = అన్నంలో రక్తం కలిపి మెతుకుల్ని గొర్రెలు మొ॥న మందలపై వెదజల్లడం
పొల్ల = పిల్ల
పొల్లువోకుండ చేసుడు = కచ్చితంగా చేయడం
పో = వెళ్ళు
పోంగ పోంగ = పోగా పోగా
పోంచి = గడియారం లాంటి వెండి ఆభరణం
పోంటిన్ = ఫౌంటేన్ పెన్ను
పోంఢ్రి = పొండి
పోకడ = గర్వం, పోక, పోవడం
పోకవక్కలు = వక్కపొడి
పోగాలం = చేటుగాలం
పోగిట్ట, పోగిల్ల, పోగల్ల, పోగాల, పోజిక్క= వెళతాడేమో !
పోగులు = మేక మొ॥నవి కోసి వేసే మాంసం పాళ్ళు
పోగువోసుడు = వృద్ధిలోకి రావడం
పోచమ్మ = ప్రజలను ప్రోచే, కాపాడే గ్రామదేవత
పోటు = దెబ్బ
పోటుగాడు = వీరుడు
పోటు పెట్టుడు = రోకలితో పోటు పెట్టడం
పోటువ = ఫోటో
పైయోడు = దేవుడు, పైవాడు
పైర = కావలా ? పహారా
పైరకిడ్చుడు = జన్నెకు వదలడం, గాలికి విడవడం
పైరవీ (ప) = సిఫారసు
పైలం = పదిలం
పైలి = మొదటి తారీకు
పైల్వానోల్లు (ప) = పహిల్వాన్లు, మల్లయోధులు
పైసకు పియ్యదినుడు = నానా గడ్డీకరవడం
పైస గుద్దల బాగోతం = డబ్బుకులేని దుబ్బుకు కొరగాడు
పైసల చెట్టు = నిధి, నిక్షేపం ( నువ్వు నన్ను డబ్బులడుగుతున్నవ్. మా ఇంట్ల పైసల చెట్టు వుందా ? )
పైసల మనుషులు = డబ్బు మనుషులు
పైసలు = డబ్బులు, శాతం %, భాగం
పైసలు ఎక్కేసుడు = డబ్బులు కూడ బెట్టడం
పైసలు పిల్లల్ని చేసుడు = దాచిన డబ్బులు దినదిన / ధనధన ప్రవర్ధమానం కావడం.
పైస్లా = నిర్ణయం
పొంకండ్లుగొట్టుడు = పోకడలు పోవడం
పొంకనాలు = పెగ్గెలు
పొంగుడాలు = ఒకరకం వంటకం
పొంట = పేరున ( కొడుకు పొంట రెండెకరాలు వున్నయి )
పొంటె = పూట, షిఫ్టు, పురట, పొరట
పొందిచ్చుడు = అమర్చడం, నిర్మించడం (ఊరు, పొయ్యి మొ॥నవి )
పొక్క = బొక్క, పొట్ట
పొక్కలు = బాకీలు
పొక్కిలి = నేల గుంతలై పొక్కిలి పొక్కిలి కావడం. (తమిళ పొక్కిల్ అంటే నాభి నుండి వచ్చింది. నాభి గుంతలా ఉంటుంది కదా)
పొక్కు = బొబ్బ
పొక్త = చాలా బాగా ? Perfect గా
పొగేసుకువెతందుకు పనికిరాదు = ఎందుకూ చాలదు
పొగేసుడు = ఉసిగొల్పడం
పొచ్చు = మామిడి పచ్చడిలో ఒక రకం
పొటాషు, పొటాసు = గంధకం
పొట్కు = (రోకటి) పోటు
పొట్టతిప్పలకు = ఉదరనిమిత్తం, కూటి కోసం

పొట్టతోని ఉండుడు = గర్భవతిగా వుండడం
పొట్టపూజ = తిండి
పొట్టి ముల్కలు = వరిలో ఒక రకం
పొట్టు పొట్టు తిట్టుడు కొట్టుడు = బాగా తిట్టడం, దండించడం
పొట్టెగాండ్లు = పిల్లలు
పొద = ఛాయ, నీడ, ప్రసక్తి, ఊసు
పొద = ఎండపొద ( వడ్లు ఇంకొక్క పొద ఎండాలె)
పొడికారం = కారప్పొడి
పొడిదగ్గు = కఫం లేని దగ్గు
పొడిమిరం = మిరప్పొడి
పొడిమెతుకులు = వ్యంజనం లేని అన్న మెతుకులు
పొడుగవుడు = వృద్ధిలోకి రావడం
పొడువులకు పోవుడు = పెగ్గెలకువెళ్ళడం
పొడ్సుకచ్చుడు (రేషం) = తన్నుకురావడం (రోషం)
పొతం చేసుడు (గింజలు) = తాలు లేకుండా చూడ్డం
పొత్తి జుట్టుడు = నాలుగుమూలల్లో చెంబులుంచి దారాలు చుట్టడం
పొత్తినుట్టుడు = మనిషి పాడు దృష్టివల్ల కూరగాయలకు తెగుళ్ళు సోకాయని వాటిని వీధిలోని బూడిద వలయాల్లో పెట్టడం
పొత్తు లేదు (దానికి దీనికి) = పొంతనలేదు
పొత్తుల = ఉమ్మడిగా
పొత్తెంగ తినుడు = దట్టంగా తినడం
పొత్రం = నూరెడి గుండ్రాయి
పొద్దీకి, పొద్మీకి = రాత్రిల్లు, సాయంత్రం
పొద్దు = సూర్యుడు, ఎండ, సమయం, పర్యంతం (వాడు రెండేడ్ల పొద్దు పనిచేసిండు )
పొద్దు గడ్సుడు = కాలక్షేపం
పొద్దుపుచ్చుకునుడు = కాలక్షేపం చేయడం
పొద్దువంగుడు = సూర్యాస్తమయం
పొద్దుంజాముల = సాయంకాలం
పొద్దుందాక = పగలంతా, పొద్దస్తమానం
పొద్దుందాకగొల్సినా ఏలెడు లేడు = సమవుజ్జీకాని వాడు
పొద్దుగాల్ల = ఉదయం
పొద్దుగూకుడు = అస్తమించడం, సూర్యుడు పశ్చిమాద్రి చేరడం
పెల్ల = మట్టిగడ్డ, పెళ్ళ
పెసర్లు = పెసలు
పేండ్లు = పేలు
పేగు = చిన్నగుడ్డ
పేటలు = వరుసలు
పేటివక్కలు = నల్లటి పొకలు
పేడ = స్వీటులో రకం
పేడిమూతి = మీసాల్లేని ముఖం
పేడు = కొయ్య, చెక్కపేడు
పేనం = పెనం
పేనీలు = పేణీలు
పెరీస్తు = జాబితా
పేరు = దండ
పేరు మాసుడు = చనిపోవడం
పేరుడు = నీళ్ళు మొ॥నవి తేరుకోవడం
పేరు పెట్టుడు = నామకరణం
పేరు మాసిపోవుడు = ఒక వంశం మొత్తంగా తెరమరుగు కావడం, చనిపోవడం
పేరువోవుడు = పేరుగాంచడం
పేర్చుడు = తీర్చిదిద్దడం (బతుకమ్మ మొ॥ వాటిని)
పేర్నాలవెట్టుడు = వెక్కిరించడం, ( పేరు, నామాలను పెట్టి వెక్కిరించడం )
పేర్పు = కుండ ( ఈ సల్ల పేర్పు యాడకొన్నరు?)
పేలు = ఫెయిల్
పేల్క = చిన్నగుడ్డ
పేషి = శాఖ
పేష్కారు = సూపరింటెండెంట్
పైంటు = పంట్లాము, ప్యాంటు
పైకం = డబ్బు
పైకర్చులు = మీదిఖర్చులు
పైకిరావాలె = వృద్ధిలోకిరావాలి
పైగొట్టుడు = పోటాపోటిగా బండ్లను వురికించడం, ఒక బండిపై మరొకటి దాటివెళ్లడం, పయ్య గొట్టడం
పైజామా = ప్యాంటు లాంటిదే కానీ పైనుండి కిందికి సమానంగా వదులుగా ఉండేది, పూనపైంటు
పైడికంటె = పగిడి కంటె
పైడీలు = పెడల్
పైతాపులు = సాక్స్
పైత్యం = పిచ్చి
పైదల్ = పాదసంచారం, కాలినడక
పైనం = ప్రయాణం
పోట్రవుతు = కాలికి పోట్లు, దెబ్బలు కల్గించే దారిలోని రాయి

పోడ, పోడా = అబ్బాయీ !
పోడర్ = పౌడర్
పోడేల్ = పోతు, పొట్టేలు
పోత = కుట్లు, అల్లికలు, ఎంబ్రాయిడరీ
పోతపాలు = తల్లిపాలుగాక పట్టిన, పోసిన పాలు
పోతరాజు = పోతురాజు
పోతానవు, పోతున్నవు = పోతున్నావు
పోతివి (రాక) = పోయితిని, పోయితివి (రాక)
పోతుదుడ్డె = గేదెకు పుట్టిన మగదూడ
పోద్దాడు = మగతాటి చెట్టు
పోన్‌గంట, పోనిగంట = ముప్పావుగంట
పోనన్నం (పోపన్నం) = రాత్రిమిగిలిన అన్నానికి పొద్దుటకారం, ఉప్పుకలిపి తాలింపు వేసినది
పోని గిలాన = గరాటు ఆకారంలోని స్పీకర్
పోనికి ఏసుడు = పోపు - తాలింపు వేయడం
పోనిబియ్యం = (మసాలాలేని బిర్యానీ లాంటిది) బియ్యం తాలింపు వేసి ఉడికించిన అన్నం
పోనియ్యి = పోనీ
పోపిత్తులడబ్బ = తాలింపుకైవాడే మిరప గింజలు, ఆవాలు మొ॥నవి వుంచుకునే పాత్ర
పోపు = నయం, మేలు
పోయిండు = వెళ్లిపోయాడు
పోయినేడు = గత సంవత్సరం
పోరగాండ్లు = పిల్లలు, అబ్బాయిలు
పోరగాండ్లు పొట్టెగాండ్లు = పిల్లాపీచూ
పోరడు = అబ్బాయి, పిల్లగాడు
పోరలు = పిల్లలు
పోరి = పోరి, డింభకం, పిల్ల, అమ్మాయి
పోరు = అరడి
పోరువెట్టుడు = కొట్లాడ్డం
పోలు = పెళ్లిలో నాలుగు మూలల్లో ఉన్న చెంబులకు చుట్టిన పోగులు
పోలుల పిత్తినట్లు = పెళ్లిపోలులో అపానవాయువు వదిలినట్లు
పోలె = భక్ష్యం, బొబ్బట్లు
పోవడ = పోలిక
పోవుకుంట = పోతూ
పోవుడు = వెళ్లడం
పోశమ్మ గుల్లె కల్లుపోసుడు = దాదాపు నిత్యం చేసే పని
పోశమ్మను ఎత్తుకచ్చుడు = దేనికైనా తెగించడం
పోశవ్వతల్లి = మశూచికం
పోశాకు (పి) = వేషధారణ
పౌజు = సైన్యం
పౌడాలు = పగడాలు
ప్యాక = పేకముక్కలు
ప్యాట = పేట, పెద్ద ఊరు
ప్యాట్రి = ఫ్యాక్టరీ
ప్యాదోల్లు = పేదలు
ప్యాలాలు = మరమరాలు, పాప్‌కార్న్
ప్రతాని = ప్రధాని
ప్లాస్టిక్ సంచి = పాలిథీన్ కవర్

## బ

బంక = జిగురు, గమ్
బంకతుత్తురు = లెక్కలోకి రాదని
బంకపీను, బంకబల్లి = పిసినారి, పిసినిగొట్టు
బంకవట్టుకున్నట్లు = జీడిపాకం లాగా వదలక పోవడం
బంకులల్ల = బంగ్లాకింద
బంగం = భంగం
బంగారం = దసరానాడు తెంపిన జమ్మాకు
బంగారం ఎగిరేసుకుంట వచ్చుడు = నిర్భయంగా దొంగల భయంలేక రావడం
బంగారమా బాగ్గెమా = అపురూపం కానిది
బంగారు పురుగు = బంగారు రంగుల్లో ఉన్న అందమైన ఒక పురుగు
బంగారు కొండ = చిన్నపిల్లల్ని ముద్దు చేస్తూ అనే మాట
బంగు = గంజాయి ఆకులు బాగా నూరి చేసిన మత్తు పదార్థం
బంగుబాయి, బంగోయి = తూగుటూయల
బంగుల = బంగళా, మేడ
బంచరాయి భూములు, పంచరామి = బంజరు, రాళ్ళ భూములు ( ప్రభుత్వానివి )
బంజర్‌దొడ్డి = బందెలదొడ్డి

బండ = చెమటపట్టని పాషాణ హృదయం
బండ మీద నీల్లు / నూకలు పుట్టిచ్చుకొనుడు = ప్రతికూల పరిస్థితుల్లోనూ బ్రతకగల్గడం
బండకట్టం = మోటు కష్టం
బండకింద చెయ్యిరుకుడు = ఇరుక్కుపోవడం, ధర్మ సంకటస్థితి ?
బండకు కొడుత, బండకుతుకుత = తల్లి పిల్లలను బెదిరించే పదం
బండకు బండ పైసలు వెట్టుడు = డబ్బులు నగదుగా, రొక్కంగా యివ్వడం
బండకు బండ వుండడం = దిట్టంగా రాయిలా వుండడం
బండగట్టుకుని బాయిల వడుడు = ఏమీ తోచనప్పుడు ఇలా అంటారు, ఫలితం చావే కదా!
బండ గుర్తు = కొండగుర్తు
బండ పువ్వు = తాలింపులో వేసే సుగంధ ద్రవ్యం
బండమీద పావుసేరు పుట్టిచ్చుకొని బతుకుడు = స్వావలంబనతో మనిషి బతకడం
బండారం = రహస్యం
బండారు = పసుపు
బండిబర్తి = బండికి సరిపడిన బరువు (లోడ్)
బండిరవుతి = శకటరేఫం
బండు కడుగుడు = బండ బూతులు తిట్టడం
బండ్లబాట = బళ్ళు వెళ్ళేదారి
బంతి = పంక్తి
బంతిపువ్వు లెక్క ఉండుడు (పిల్ల) = అందంగా బొద్దుగా వుండడం
బంతిల పరపక్షం,వలపక్షం = వివక్ష
బంద్‌చేసుడు = కట్టేయడం (ఫ్యాన్ మొ॥నవి)
బందవస్తుగ (ప) = బందోబస్తుగా
బందనం, బందానం చేసుడు = పాములు, దొంగలు మొ॥ వారి నుండి రక్షణ కొరకు మంత్ర పూర్వకంగా చేసే పని
బందిఖాన = కారాగారం
బందుకు = పక్కకు
బందువెట్టుడు = పని ఆపేయడం
బందూక్ = తుపాకి
బకాయ = మిగులుబాకీ, ఏరియర్స్
బకాసురుడు = తిండిపోతు
బకీటు = బకెటు
బక్కగ = పీలగా, సన్నగా, బక్కపలుచగా
బక్కపానం = బక్క పలుచని శరీరం
బక్కలు = బక్క పలుచని ఎడ్లు మొ॥నవి
బక్రగాడు = అమాయకుడు, వెర్రివెంగళప్ప
బక్షాలు = బొబ్బట్లు
బక్షీసు = కానుక
బగర్ = లేకుండా ( నాకు ఒక్కనికి బగర్ శెక్కర చాయ యివ్వు )
బగారన్నం = మసాలతో తాలింపు వేసిన అన్నం
బగాయించుడు (ప) = పారిపోవడం
బగ్గ = బాగుగా, చాలా
బగ్గడు = మొరటు
బగ్గుమనుడు = కోపానికి రావడం,మండిపడడం
బచవత్ అవుడు = ఆపద తప్పడం
బచాయించుడు = బతకడం, ఆపద నుండి తప్పించుకోవడం
బచ్చగాడు = పిల్లవాడు ( ఏమీ తెలియని )
బజా(యె) = తప్పు,బదులు
బజే (చార్) = (నాలుగు) గంటల సమయం
బటువు = ఉంగరం
బట్టసదురుడు = ఒంటిమీద తొలగిపోయిన పైట మొ॥నవి సర్దుకోవడం
బట్టకు పొట్టకు = కూటికీ గుడ్డకు
బట్టగాల్చి మీదేసుడు = మన మానాన మనం వున్నా నిందించడం,నీలాపనిందలు వేయడం
బట్టదడ్పువాన = శరీరంపై గుడ్డలు మాత్రమే తడువగలిగేలా పడినవాన
బట్టపేల్కా = గుడ్డపేగు
బట్టల సబ్బు = డిటర్జంటు బిళ్ళ
బట్టల సోడా = చాకలి సోడా, కాస్టిక్ సోడా
బట్టలు = గుడ్డలు
బట్టలు బాతలు = గుడ్డలు వగైరా(బట్టలు,పాతలు)
బట్టలు సదురుకునుడు = పెట్టే బేడా సర్దుకోవడం
బట్టి (ఇటుక) = అవము
బట్టిపెట్టుడు = భట్టీయం పెట్టడం
బట్టెబాజు = దుష్టుడు
బట్వాడా = పంపకం
బడబడమాట్లాడుచు = కల్లా కపటం లేకుండా మాట్లాడ్డం, ఉన్నదున్నట్లుగా మాట్లాడ్డం
బడాయి = ఆడంబరం, పెగ్గెలు

బడి = పాఠశాల
బడితెపూజ = బెత్తంతో శిక్షించడం
బడిపోరగాండ్లు = విద్యార్థులు
బడీబాసన్లు = గిన్నెలూ గట్రా
బడుక్కు బడుగు = లావుగా
బడుగు బడుగు చేసుడు = పని మొరటుగా చేయడం
బడెగండు = చెట్టంత మనిషి
బడెతిప్పలు = చాలా కష్టాలు
బడే = పెద్ద
బడ్డీక = కబడ్డీ
బడ్డు = లింగం, మగగురి
బడ్తలు = బడితె కట్టెలు, దుడ్డుకర్రలు
బడ్తి = పెరుగుదల (జీతంలో)
బతికి చెడుడు = జీవితంలో చాలా సుఖపడి తర్వాత కష్టాలు పడడం
బతికి బట్టకట్టుడు = పెంపు, వృద్ధిలోకి రావడం
బతి(మి)లాడుడు = బతిమాలడం
బతుకపుట్టినోల్లు = ఇంకా చాలా ఏళ్ళు బతకాల్సిన ముందు తరాలు
బతుకమ్మ = తెలంగాణలో స్త్రీలకు మాత్రమే పరిమితమైన పండగ, రకరకాల పూలతో బతకమ్మలను పేర్చి దుర్గాష్టమినాడు నీళ్ళలో గౌరమ్మలను వదులుతారు ( ఇది శక్తిపూజకు సంకేతం )
బతుకుదెరువు = జీవనోపాధి
బత్కవోవుడు = వలసవెళ్లడం
బత్తి = వత్తి, విద్యుద్దీపం
బత్తీసపేర్లు = ముప్పైరెండు తియ్యని తిను బండారాలు కల్గిన దండ ( తిరునాళ్ళలో అమ్ముతారు )
బత్తెం = భత్యం, కూలి
బదల్ (అ) = చే బదులు
బదలాయించుడు = మార్చడం
బదులు = ప్రత్యామ్నాయం
బదులు చెప్పడం = ప్రత్యుత్తరమివ్వడం
బద్దిచేసుడు = నిందించడం, బద్నాం చేయడం
బద్దిచ్చుడు = నిలదీయడం, బద్దల్నిచేయడం
బద్నాం = అపనింద
బద్మాష్ = దుర్మార్గుడు
బద్రం = భద్రం
బనాయించుడు = వెక్కిరించడం
బనియా = కోమటి, పిసినారి
బనీను = బనియన్
బబ్బ = పాప్‌కార్న్ లాంటి తినుబండారం
బబ్బులింగం = బబుల్‌గమ్
బబ్బెర = బొబ్బర
బమ్ముడు = ఇష్టపడడం ( భ్రమించడం )
బయాన = అడ్వాన్సు
బయ్యం = భయం
బరంతి = బేస్‌మెంట్ వరకు గట్టిమట్టిని నింపడం
బరప్ (బరఫ్ - (ప)) = మంచు
బరాండి = బ్రాండి
బరాబర్ (ప) = తప్పకుండా, సరిసమానం
బరి బద్ద బొక్కలు = పక్క బెముకలు
బరిగాళ్ళు = వట్టికాళ్ళు
బరిగె = బెత్తంకన్న సన్నటిది
బరివాతల = నగ్నంగా
బరుడా = గుమ్మడి, దోస, సొరలాంటి ముక్కలపై శనగపిండి చల్లి పొడిగా చేసేకూర
బరువుపనులు = ఎక్కువ భారాన్ని మోసే పనులు
బరువు మనిషి = గర్భిణి
బరోస = నమ్మకం, ఆశ, భరోసా
బర్కత్ = నిండుదనం
బర్కాసు అవుడు =దివాళా తీయడం
బర్కాస్తు అవుడు = పూర్తవడం
బర్కుడు = కోయడం, తెంచడం
బర్జిమ్మ = బాధ్యతా రాహిత్యం
బర్తం బట్టుడు = భరతం పట్టడం
బర్తి = నిండినది
బర్బాత్ అవుడు = సర్వ నాశనం కావడం
బర్మాలు (ప) = డ్రిల్ చేసి రాళ్ళను బాంబులతో పగలగొట్టడం
బర్ర = మచ్చ
బర్ర బర్ర గోకుడు = బరబరా గోకడం
బర్రె = గేదె
బర్రెజెల్గ = పైన నల్లగా క్రింద తెల్లగావుండే జలగ. చీమిడి జలగా ? ( Slub )
బర్సులు బర్సులు = గరుకుగరుకు (బొమ్మ బొరుసు లోని బొరుసుకీ, బరుసుకీ సంబంధం వుంది )

నలిమెల భాస్కర్

బలం బెట్టుడు = ఎరువు వేయడం
బలువు అవుడు = అన్నం కావాల్సినంత ఉడక్క పోవడం
బల్గం = బలగం, బంధుబలగం
బల్దియా = కార్పొరేషన్
బల్పు = గర్వం
బల్మి = బలవంతంగా
బల్ల = బడ్డు, మగగురి
బల్లి = పిసినారి
బల్లిగుడ్డల దారం = ఎంతకూ ముగియనిది అని.. చాట భారతంలాగా
బల్లిపడుడు = బల్లి శకునం
బల్లపీట = పెద్దపీట
బల్కిబొల్లి పూసరామాయణం = చాట భారతం
బల్లివల్కుడు = మాట్లాడేటప్పుడు బల్లిపల్కితే ఆ మాటలు సత్యాలు అనుకుంటారు.
బల్సుడు = (కా) వలసి రావడం (బట్టలకు బాతలకు ఎన్ని రూపాలు బలిసినయి ?)
బవ్‌గోండ్లు = గిన్నెలు
బవంతి = భవనం, మేడ
బష్టు(ట్టు)రాత = భ్రష్టమైన, కష్టపు రాత, తలరాత
బస్(ప) = చాలు
బసవన్న =ఎద్దు, చదువురాని మొద్దు,తెలియనివాడు
బస్కీలు = గుంజిళ్ళు
బస్తా = పెద్ద సంచి, గోతాం
బస్తి (ప) = పెద్ద ఊరు, పట్టణం
బాం = పాము (చిన్నపిల్లల భాష)
బాంచ (గాడు) = బానిస
బాంచెన్ = బానిసను
బాంబూచోడు = పామూ, బూచోడు
బాకి = అప్పు, మిగిలినది
బాకి తెంపుడు (అ) = అప్పుతీర్చడం
బాకిసమందం = ఋణానుబంధం
బాగంవక్కలు = వక్కపొడి ( చివరా ఖరకు లాంటి పదం. భాగమన్నా వక్క అన్నా ఒక్కటే అర్థం )
బాగుండేటిది = బావుండేది
బాగోతం = భాగవతం, వీధి నాటకం, వ్యవహారం
బాజ = బాజాబజంత్రీలు
బాజాప్త = నిర్భయంగా,ఖచ్చితంగా
బాజు(దు)కు (ప) = పక్కకు
బాట (ప) = దారి
బాట్లు = తూకంరాళ్ళు
బాడ = బస్సు, రైలు చార్జి
బాడిగ = అద్దె
బాడీ = బ్రా,బనీను
బాడె = ఒక తిట్టుపదం
బాడ్కావ్ = ఒక తిట్టు
బాత = గీత
బాతకాలు, బాతకాండ్లు = ఉత్తమాటలు, పెగ్గెలు
బాతకాలరాయుడు = మాటకారి
బాదుషా = మిఠాయిలో ఒక రకం
బాద్దురు పని (ప) = బహాద్దూర్ పని, సాహసకార్యం
బాన = పెద్ద కుండ
బానామతి = చేతబడి
బాపనోల్లు = బ్రాహ్మణులు
బాపు = తండ్రి, దొర
బాబతు (అ) = తాలూకు
బాబు = అబ్బాయి, పిల్లవాడు
బామండ్లు = బ్రాహ్మణులు
బామనిపురుగు = అందగత్తె ,సుకుమారి(రుడు)
బాయి = బావి, భార్య, అక్క, అన్న
బాయిగండం = నీటిగండం
బార దర్వాజ కుల్ల పెట్టుడు = తలుపులు బార్లా తెరవడం
బారగొట్టుకునుడు = ఊద్వడం
బారాల్ = ఇంతకూ
బారి = కిటికి
బారిగునం = భారీగుణం
బారియ = భార్య
బారిసేత = భారీసేద్యం
బారు నింపుడు = తుపాకీ మందు దట్టించడం
బాల్ = తలవెంట్రుకలు
బాలం = బాలయ్య
బాలక్యాలి = బాల్య చేష్టలు ?
బాలనాగమ్మ కుంకుమ = గులాల్ రంగు కుంకుమ
బాలమ్మ = ఒక గ్రామదేవత
బాలెంతరోగం = గుర్రపువాతం
బావ(ప)తులు = శుభకార్యాలలో పనివాళ్ళకిచ్చే బాబతులు(కట్నాలు)
బావాజోల్లు = బాబాజీలు

బాస = ఉర్దూ, హిందీ భాష
బాసండ్లు = బోళ్ళు, గిన్నెలు
బాసర = వ్యాసర్, వ్యాసరాయడు కొలువున్న వూరు
బాసింగాలు = బాసికాలు
బాహర్‌కు పోవుడు = దొడ్డికి వెళ్ళడం
బింకి = కల్లుబింకి
బింగిరి = బీడీల దారపు కండె
బిందిపోసుడు = ఇష్టదేవతలకు కల్లును తీర్థరూపంలో నేలపై పోయడం
బికారి = ఏమీలేనివాడు
బిగవట్టుకునుడు = ఓపిక వహించడం
బిగువవుడు = గట్టిగావడం
బిగ్గిత = బిగుతుగా
బిగెడు = ఎకరం,ఎకరం కన్న ఎక్కువ
బిచ్చపోల్లు = బిచ్చగాళ్ళు
బిచ్చాలాట = ఒక ఆట
బిచ్చులు = రాళ్ళను పగుల చీరగా మిగిలిన చిన్న భాగాలు
బిజ్లీ = పెట్రోమాక్స్, కరెంటు
బిటాయించుడు = ఉండిపోవడం, బైఠాయింపు, తిష్టవేయడం
బిడాయించుడు = తలుపులు మూయడం
బిడ్డె = బిడ్డ
బిత్తిరి బిత్తిరి = పిచ్చపిచ్చగా
బిన్నీబట్ట = ఒక రకమైన ఉత్తమవస్త్రం
బి/బీ = కూడ ( నేను బీ వస్త )
బిరక్ = బ్రేకు
బిరబిరనడ్సుడు = గబగబా నడవడం
బిరాన = వెంటనే
బిర్జాలు = వృషణాలు, బీజాలు !
బిర్జి = బ్రిడ్జి
బిర్రగా = బింకంగా, బిగ్గరగా
బిల్కుల్ (అ) = బొత్తిగా
బిల్ల = వాటెం
బిశాది = ఫరవా
బిస్కీట్ = బిస్కట్, విదేశాలనుండి వచ్చేది
బిస్తర్ గట్టిండు = పరలోకగతుడయ్యాడు
బిస్కీటు బంగారం = బిస్కట్ ఆకృతిగల స్వచ్ఛమైన బంగారం
బిస్తర్ (ప) = పక్క, పడక
బిస్స = స్టీరింగ్
బీంక్రం = భయంకరం
బీజకుట్టు = వరిబీజం
బీటు = మార్కెట్ (Grains)
బీడికాడి = బీడి మొ॥నవి
బీడు = కంచె
బీమారి (ప) = రోగం
బీరిపోవుడు = ఆశ్చర్యపోవడం, వెఱగుపడడం
బుంగ = గండి, మూతి చిన్నదైన మట్టిపాత్ర
బుక్క = కబళం
బుక్కుడు = (అటుకులు మొ॥నవి) తినడం, బొక్కడం
బుక్కేసోడ = వంటసోడా
బుగబుగ అనుడు = జ్వరసూచన
బుగులు = భయం, గుబులు
బుగ్గ = బల్బు, బెలూన్ బుడగ, అడవిచెలమ, నీటివూట
బుగ్గలు = బొబ్బలు
బుగ్గిండి = సిమెండి, రాతెండి
బుచ్చి = చిన్నదైన
బుజా(దా)రం = బుధవారం
బుజ్జి / బుజ్జమ్మ / బుజ్జవ్వ = అమ్మాయిల ముద్దుపేరు
బుట్టాలు = జరీబుట్టాలు, డిజైన్లు, చెవుల బుట్టాలు
బుట్టి దుకానం = చిన్నకొట్టు, చిల్లరకొట్టు
బుడ్‌బుడ్‌కల పనులు = చిన్నచిన్నపనులు, బుడిబుడిపనులు
బుడ బుడ అవుడు = బాగా చీముపోయడం, బాగా పులిసిపోవడం
బుడబుడపండ్లు = భోగిపళ్ళు
బుడాలు = బజ్జీలు
బుడిమెకాయలు / బుడ(డి)ం కాయలు = దోస లాంటి చిన్నకాయలు
బుడుగు = ఊబి
బుడుబుడుకలోడు = డుబుడుక్కులవాడు
బుడ్డ = వరిబీజము
బుడ్డ = చిన్నదైన
బుడ్డ బుడ్డ కానూన్లు = అనవసరమైన లిటిగేషన్లు
బుడ్డగోచి = పుట్టగొచి

బుడ్డపర్కలు = చిన్న పరక చేపలు
బుడ్డ పైస = చిన్నపైస
బుడ్డ పోరడు = చిన్నపోరడు
బుడ్డి = కొలతబుడ్డి
బుడ్డిపోవుడు = పాచిపోవడం
బుడ్డెన్‌కాన్,బుడ్డర్‌కాన్ = విదూషకుడు
బుడ్డోడు = చిన్నోడు
బుడ్బుంగ = నీటిపక్షి ( ఒక దగ్గర బుడుంగున మునిగి మరో దగ్గర తేలుతుంది )
బుదురకిచ్చుడు = బుజ్జగించడం
బుద్దావతారం = ఏమీ తెలియని మాట్లాడనివాడు
బుద్ధి తెల్సినంక = ఊహ తెలిశాక
బుద్దాగాడు = ఏమీ తెలియనివాడు
బుద్ధారతినుడు = కడుపార తినడం,బుద్ధి అర తినడం
బుద్ధి (నీ) = (నీ) ఇష్టం
బుద్ధి అవుడు = అనిపించడం
బుద్ధి పుట్టుడు = ఆలోచన కల్గడం
బుద్ధి పూర్తి = ఉద్దేశ్య పూర్వకంగా
బునాది = పునాది (బున్‌యాద్ - పర్షియన్ పదం)
బుయ్యి = మోటార్ (చిన్న పిల్లల భాష)
బుర్కా = బురఖా
బుర్గబుర్గ పండుడు = (మురుగ మురుగ) మురిగిపోయేలా పండడం, బాగా పండడం
బుర్గకట్టెలు = పొలంలో ఎరువుకోసం తొక్కిన చెట్ల కొమ్మలకు సంబంధించిన కట్టెలు. వాటిని ఏరుకుని వంట చెరుకుగా వాడుతారు.
బుఱ్ఱ = పెన్ను బుఱ్ఱ మొ॥నవి
బుఱ్ఱకాయ = ఎండిన సొరకాయబుఱ్ఱ
బుఱ్ఱున వచ్చుడు = బిరానరావడం
బుర్షు = బ్రష్
బుర్సులు = నురుగులు
బుల్ బుల్ = సంతకం
బులాకి = ముక్కు ఆభరణం
బువ్వ = అన్నం
బువ్వచెయ్యి = కుడిచేయి
బుసులు.బూసులు = కళ్ల ఊసులు, కళ్ళపుసి
బుస్కోటు.బుషోటు = బుష్‌షర్టు
బూగ = తూనీగ
బూత్‌బంగ్ల = దయ్యాల కొంప
బూదవ్వ = భూదేవమ్మ
బూమిజాగలు = ఆస్తిపాస్తులు
బూమిపుట్టినకాన్నుంచి = సృష్ట్యాది నుండి
బూమీ్మద కూడొడ్సుడు = నూకలు చెల్లడం
బూరు = బొచ్చు, ఉన్ని, తలవెంట్రుకలు
బూరు పీకి శారుగాసుడు = విమర్శించడం. శిక్షంచడం
బెంగటిల్లుడు = దిగులుపట్టుకోవడం, బెంగపడడం
బెంగ్లూరు గూన = మామూలు టైల్సు కాక బెంగుళూరు టైల్సులాంటి దీర్ఘచతురస్రాకారపు గూన
బెండ్లు = మొక్కజొన్న కంకుల విత్తులు ఒలవగా మిగిలినవి
బెందడి = పునాదుల్లో వేసే చెక్కని రాళ్ళు, బురద, సిమెంటు, తడి మొ॥నవి
బెక్కన బెంగటిల్లుడు = బెంగపడడం
బెక్కుమనుడు = భోరున గుండెపగిలి ఏడ్వడం
బెక్కొట్టినట్లు = బోసిపోయినట్లు
బెగడు = భయం
బెగడు పెట్టినట్లు = భయం పుచ్చుకున్నట్లు
బెగడు సొచ్చుడు (కడ్పుల) = అతిగా భయపడడం
బెగ్గంపాడు = బగ్గంపాడు ( పూర్తిపాడయినది )
బెట్టాలకు బెట్టాలకు తినుడు (అన్నం) = బాగా తినడం ( కన్నడంలో బెట్ట అంటే గుట్ట )
బెడ్డలు = పెళ్లలు, పెద్దలు, బెడ్డలు
బెదిరి బెదిరి చూసుడు = మార్చి మార్చి చూడ్డం, బెదరడం ( ఎడ్లు మొ॥నవి )
బెదిరిచ్చుడు = మందలించడం, భయపెట్టడం
బెదురు = భయం
బెదురు బొమ్మ = దిష్టి బొమ్మ
బెదురు సొచ్చుడు (కడ్పుల) = భయం పుచ్చుకోవడం
బెయిమాన్‌దార్ = కృతఘ్నుడు
బెరికి కఱ్ఱలు = కలుపు మొక్కలు
బెరికి పుట్టుడు = అందరిలో విలక్షణంగా పుట్టడం
బెల్లపప్పాలు, బెల్లప్పాలు = బెల్లం, పిండి కలిపి చేసిన అప్పాలు
బెస్త = బోయ
బే = తిట్టు ( ఏంది బే )
బే దకలు = ఎక్కడిదక్కడ కావడం
బేంకు = బ్యాంక్
బేకార్‌గాడు = పనికిరానివాడు

బేకు = బేవఖూబ్ ,ఒకతిట్టు
బేకొట్టుడు = త్రేన్పులు తీయడం
బేగరిపని = సుంకరిపని
బేగారం = వెట్టి
బేగి = వెంటనే
బేగు(వు)లు = త్రేన్పులు
బేచైన్ అవుడు = గాబరాపడడం
బేటి అవుడు = తటస్థించడం, కలవడం
బేట్లు ఎత్తుడు = సన్నగా అలికిన నేల పర్రెలు వారిపైకి లేవడం
బేడీలు = చేతులకు సంకెళ్ళు, కాలి ఆభరణాలు
బేడెం = తలుపులకు గడియలాంటిది
బేతుక్‌గా = విపరీతంగా
బేత్రిన్‌గ = చక్కగా, అందంగా, మంచిగా
బేదాన = గింజలు లేని ద్రాక్ష
బేపర్వ = పర్వలేనితనం
బేపారం = వ్యాపారం
బేపికరు = నిర్భయం, నిర్విచారం
బేబాకి = అప్పు తీరడం
బేరింగు = తపాల బిళ్ళలు అంటించక పోస్టు చేసిన ఉత్తరం
బేరెడాకులు = ఎడ్ల గంగడోల్లకిందివి
బేలన్‌కోల = చపాతీలను, రొట్టెలను చేయడానికి వాడే కర్ర ( వేలనం - రోలింగ్ )
బేవార్సుగాడు = పనికిమాలినవాడు
బేవోష్ అవుడు = స్పృహ తప్పడం
బేశరం చెట్లు = పాలసముద్రం చెట్లు
బేసన్ = పిట్ల ( ఒకరకం వంటకం )
బేసన్ లడ్డు = పొడి శనగపిండితో చేసిన లడ్డు ( బందరు లడ్డు ? )
బేసన్ తట్ట = పిండి పిసకడానికి ( పేశనముకై ) వాడే లోహపాత్ర
బేస్తారం = గురువారం
బేస్మిట్ = బేస్‌మెంట్
బై = భాయీ అర్థంలో మాట్లాడేటప్పుడు వాడే పదం. భయీ
బై(లు) బై(లు)= తెల్లవారడం
బైండ్ల = బవనీలు
బైటక్ = దుకాణం (కల్లు) సమావేశం
బైటికవోవుడు = దొడ్డికి వెళ్లడం
బైటుండుడు = బహిష్ఠ అవడం
బైరంగం = బహిరంగం
బైరాగి ముండకొడుకు = పెళ్లాం పిల్లలు ఎవరినీ పట్టించుకోనివాడు
బైరిని బిరిని చేసుడు = తిమ్మిని బమ్మిని చేయడం
బైలు = మలం
బైలు కట్టువడుడు = మలవిసర్జన ఆగిపోవడం
బైలు బైలు అవుడు = తుప్పలు మొ॥ తీసివేయగా బయలు ప్రదేశం కావడం
బైలెల్లుడు = బయలు దేరడం
బైస్ = వాగ్వివాదం (అరబిక్ బహస్ నుండి వచ్చిన పదం )
బొంకుడు = అబద్ధమాడడం
బొంగు = బోలు, డొల్ల, మైక్
బొంగు ప్యాలాలు = మరమరాలు
బొంగురు పోవుడు = జీరపోవుడు
బొండలు = జొన్నవిత్తుల తాలు
బొండిక్కాయ = మెడకాయ, గొంతుపోక
బొంద = సమాధి
బొందులు = నాడాలు
బొంది(దు)లోల్లు = రాజపుత్‌లు,బుందేల్‌ఖండ్ నుండి వలస వచ్చినవారు.
బొంబాట్ = బ్రహ్మాండంగా
బొంబాయి మిఠాయి = పీచుమిఠాయి, పిల్లలు తమ మణికట్టుమీద వాచీలాగా పెట్టుకుని నాకి తినే ఎర్రని తీపి
బొక్క = బొమిక, ఎముక
బొక్కముదరని పోరగాండ్లు = కౌమార దశలో వున్న వాళ్ళు
బొక్కకూర = మాంసం
బొక్కబొక్కకు నీల్లుపోసుడు = బాగా దండించడం
బొక్కబోర్ల = బోర్లా
బొక్కలు కలికలి అవుడు = రెక్కలు ముక్కలు చేసుకోవడం
బొక్కలు కల్పుడు = అస్థికల నిమజ్జనం
బొక్కలు వెంథలో ఏను కున్నట్లు = మరీ బహిరంగంగా
బొక్కలు రెక్కలు తెల్లవడుడు = రెక్కలు ముక్కలవడం
బొక్కలు సున్నం సున్నం అవుడు = రెక్కలు ముక్కలు కావడం
బొక్కినోరు = బోసినోరు

బొక్కెన = చేద, బొక్కి
బొగుడ = మెట్టలాంటి ప్రాంతం
బొగ్గలు = బొబ్బలు
బొగ్గ = నల్లగా వున్న వ్యక్తి
బొగ్గడాల బొగుడ = మెట్ట
బొగ్గబాయిలు = గనులు
బొగ్గలు అల్కుడు (ఇంట్ల) = పగవాడిని చంపివాడి యింటనే దహనం చేసి బొగ్గలతో అలికి కక్ష తీర్చుకోవడం
బొచ్చె = ఛాతీ
బొచ్చెడు = బోలెడు
బొచ్చెల మెరుసుడు = స్మృతి పథంలో తళక్కున మెరవడం, కళ్లలో కదలాడ్డం, కళ్లలో కదలడం
బొట్టుపెట్టి పిల్సుడు = ప్రత్యేకించి పిలవడం
బొట్టపెట్టె, బొట్టనందుగు = ఆడవాళ్ళ అలంకారానికి అద్దం, పౌడర్ బాక్స్, స్నో, కుంకుమలు కల్గిన పెట్టె
బొట్టులేదు బోనంలేదు = వచ్చిన వ్యక్తికి బొట్టు పెట్టక తిండి పెట్టక అగౌరవించడం
బొట్లిరుసు = దబ్బులకు,ధాన్యానికి సంబంధించిన పాత కాలపు లెక్కరాసుకునే పద్ధతి
బొడిగెరాల్లు = గులకరాళ్ళు, గొడగరాళ్ళు
బొడుసు = బొప్పి
బొడ్డి = ఆడవాళ్లను నింద్యార్థంలో సంబోధించడం
బొడ్డు = విసుర్రాయి బొడ్డు
బొడ్రాయి = రచ్చబండ
బొడ్లెసంచి = (మనీపర్సు), ( క్యాష్ బాగ్ ) (ఆడవాళ్ళు బొడ్డు దగ్గర చీరకు చెక్కుకునే సంచి)
బొడ్లె వరాలు పోసుకుని పుట్టుడు = ఆగర్భ శ్రీమంతుడు, నోట్లో బంగారు చెంచాతో పుట్టడం
బొత్త, బొర్ర = పొట్ట ( బెల్లీ )
బొత్తవల్గ తినుడు = కడుపునిండా తినడం
బొత్తిలకు = బొత్తిగా, మిగలకుండా ఊచముట్టుగా నిశ్శేషంగా
బొదరు = మడుగు
బొదిగిచ్చుడు = బుజ్జగించడం
బొద్ది = గుంత ( తవ్వినది )
బొద్దు = గోడమీద రక్షణకోసం నీరు జారేటట్లుగా పెట్టిన పై భాగం
బొప్ప = అన్న
బొప్పగాడు = ఏమీ తెలీనివాడు
బొబ్బలీరయ్య = ఎప్పుడూ అరిచేవాడు
బొబ్బలు = అరుపులు
బొమ్మెలు = ఒక రకపు చేపలు
బొమ్మెలెవున్నది ( పిల్ల ) = అందంగా వున్నది
బొయ్యారం = సారంగం
బొర్రిపోవుడు = పోర్లిపోవడం
బొలోటు = బోల్లు
బొండలు = బోండాలు
బోంది = బూంది
బోం బోం అవుడు = విషయం చాటింపు చేసినట్లు ప్రచారం కావడం
బోకె = బోకి ? బొచ్చె, చిప్ప
బోకెలు = బోళ్ళు
బోగంజేసుడు = పంట చేతికి వచ్చాక గుడిలో పులిహోరాదులు చేయించి జనాలకు అన్నదానం చేయించడం
బోగపోల్లు = కళావంతులు
బోజయ్య = ఆదిలాబాద్ జిల్లాలో బోయవాళ్లలో సాధారణంగా వున్న పేర్లు. ఇది బహుశా భోజయ్య నుండి రావచ్చు.
బోటి = గొర్రె మొ॥ వాటి పేగులు మొ॥నవి
బోడక్క / బోడముండ = విధవరాలు, కోమట్ల తిట్టుపదం
బోడబోడగవుడు (ఇల్లంత) = బోసిపోవడం
బోడబోడపండ్లు = భోగిపళ్ళు
బోడుసోత్ = ఒకతిట్టు
బోడెల్తి = కొలిచేటప్పుడు కొలపాత్ర అంచుకు సరిపడా కొలవడం
బోదజేసుడు = ఒక వ్యక్తిని తనకు అనుకూలంగా మలచుకోవడం కోసం చేసే బోధ
బోదన్ చక్కెర = బోధన్ ( నిజామాబాద్ జిల్లా ) ఫ్యాక్టరీలోని శ్రేష్టమైన చక్కెర
బోదిని = గైడ్
బోనం = భోజనం
బోనాలపండుగ = కాళికాదేవికి రకరకాల బోనాలు (భోజనాలు) పెట్టి చేసేది
బోని = ఆ రోజుకు మొదటిగిరాకీ
బోరు = సిరాలో ముంచి రాసే కలం
బోరుబాయి = గొట్టపు బావి
బోర్లబొక్కల = బోర్లా

బోర్లవడగొట్టుడు = బోల్తాకొట్టించడం, మోసగించడం
బోలుప్యాలాలు = మరమరాలు (లోపల బోలుగావున్న పేలాలు )
బోలమనిషి = భోళా
బోలుకడెం = లోపల బోలు కల్గిన కడియం
బోల్లు = అంట్లు
బోసిడికే = (పర్షియన్ బోసిడా నుండి వచ్చిందా?) బోసిడా అంటే పాడై పోయిన అని అర్థం ఒక తిట్టు
బోసు = బొడుసు, బొప్పి
బౌరూపులోడు = బహురూపులవాడు
బ్యాడ = బేడ పైసలు - 2 అణాలు
బ్యారం = బేరం
బ్యారకాల్లు, బ్యారపోల్లు = బేరగాళ్ళు
బష్టురాలు = భ్రష్టమైన ఆలు
బ్రేవుమనుడు = త్రేన్పడం

## మ

మంకు, మంకురు = మొండితనం, పెంకితనం
మంగలార్తి = మంగళహారతి
మంగులం = పేలాలు వేయించడానికి కుండను ఒక రీతిగా పగులగొట్టగా ఏర్పడినది.
మంచంనేనుడు = వక్క వదలకపోవడం (వ్యాధిచేత), మంచం పట్టడం.
మంచిగ ఉండు = మంచిగా ఉండేది, మంచిగా ఉండి వుండేది
మంచిగున్నరా = బాగున్నారా ?
మంచిచెడ్డలు = కుశల ప్రశ్నలు, యోగక్షేమాలు
మంచితనం = సజ్జనత్వం, సాధుత్వం
మంచినిద్ర = గాఢనిద్ర
మంచినీల్లు = తాగునీరు
మంచినూనె = వంటనూనె
మంజన్ = పళ్ళపొడి
మంజరోపేట = మంజీరు
మంజూరు అవుడు = సాంక్షన్ కావడం
మంజేరు = ఒక వ్యాధి. ఫైలేరియా ?
మంట = కారం, కోపం
మంటపుట్టుడు = మండిపోవడం
మంటల పడ్డట్లవుడు = అగ్నిపరీక్ష కావడం
మంటి = బంటి ( మెకాలిమంటి )
మంటి = మట్టి ( ఇంటింటికి మంటి పొయ్యి )
మంఠ = కొమ్మ, రెమ్మ
మండి = కట్టెలకొట్టు, కూరగాయల మార్కెట్టు
మండుకచ్చుడు = మండిపోవడం
మండువా = కల్లుదాగు చోటు
మండె (కట్టుడు) = మోపు (కట్టడం)
మండెవడడు = రాశిపడడం (బట్టలు కట్టెలు మొ॥నవి)
మంతెన = మంత్రకూటం
మంత్రగాడు = నాటకాల్లో విదూషకుడు
మందం = దళసరి, వరకు, మలబద్ధకం, కోసం
మందలిచ్చుడు = వరామర్శించడం, మాటకదపడం, బెదిరించడం.
మంది = జనం, పరాయివాళ్ళు, ఇతరులు
మంది కండ్లల్ల వడుడు = పదుగురి దృష్టిలో పడడం
మంది నోల్లల్ల నానుడు = విషయం అందరికీ తెలియడం
మంది బొందల మీద పెట్టుడు = చేసిన కష్టమంతా పరులపాలు చేయడం
(ఇంత) మందిమి = (ఇంత) మంది
మందిలకల్సుడు = చొరవ చూపడం
మందు = ఔషధం, ఎరువు, మద్యం
మందుపెట్టుడు = వశీకరణౌషధం పెట్టడం
మందుల కూడు = రసాయన ఎరువులు, పెస్టిసైడ్స్ వాడి పండించిన పంటల ఆహారం
మందల మార్లు = వశీకరణౌషధాలు పెట్టేవారు
మక్క బబ్బుల రాత = తాటికాయంత అక్షరాల రాత
మక్కలు = మొక్కజొన్నలు
మక్కికి మక్కి = తుచా తప్పకుండా, ఉన్నదున్నట్లు
మక్కుడు = పళ్ళు పండడం, పక్వానికి రావడం
మక్మల్‌బట్ట (అ) = వెల్వెట్ సాటిన్ గుడ్డ
మక్రంపట్టు = మొసలిపట్టు
మగులు = పిట్టగోడ, గోడపైన
మగ్గుంట = మగ్గం గుంట
మచ్చ = కళంకం
మచ్చుర్దాన్ = దోమ తెర

మచ్చులు = వడ్ల మచ్చులు మొ॥ నవి ( మచ్చు తునక ) ( బియ్యం, వడ్లు మొ॥వి కొనడానికి ముందు కొట్టువాడు మంచి రకమో, కాదో నిర్ణయించుకోవడానికి యిచ్చే సాంపుల్స్ )
మచ్చెం = అసలే
మజా = రుచి, హాయిని గొలిపే అనుభూతి
మజాక్ (అ) = తమాషా, వేళాకోళం
మజ్జు మనిషి = సోమరి
మజ్దూర్ = కూలీ, కార్మికుడు
మజ్బూత్ (అ) = గట్టిగ, దృఢంగా
మజ్బూర్ = బలవంతం, తప్పనిస్థితి
మట్కా = ఒక రకమైన జూదం
మట్కీలు = మొహర్రంలో వాడే మట్టి పిడతలు
మట్ట = అరచేయి పై భాగం
మట్టు = గొడ్లను కట్టివేసే స్థలం ?
మట్టె = రావచ్చు, వచ్చిందికాబోలు, వచ్చాడు కాబోలు
మట్టెలు = మెట్టెలు
మట్రం = మట్టం
మడ్గర్ = మడ్‌గార్డు
మడికట్టు = మడి
మడిగెలు = పెద్ద పెద్ద అరుగులు, షెటర్లు, కొట్లు
మడుం = 8 తక్కెళ్ళు, (తక్కెడ = 1400 గ్రా)
మడుగూలు, మడుగుపూలు = పూన
మడేలు = చాకలి
మడ్డి = కల్లు, నూనె మొ॥ వాటి ద్రవాల అవక్షేపం
మర్తమాను (అ) = జాడీ ( మర్తబాన్ నుండి వచ్చింది )
మతం = అభిమతం
మతికచ్చుడు = జ్ఞప్తికి రావడం
మతులవ్ (అ) = సంగతి ( మతలబ్ నుండి వచ్చింది )
మత్తడి దుంకుడు = అలుగులు పారడం
మత్తు యిచ్చుడు = అనిస్తీషియా యివ్వడం
మత్తుగ, మస్తుగ = చాలా
మత్పరిచ్చుడు = తెలీకుండా కాజేయడం
మదం = అతిమధురం, గర్వం
మద్దతు = సాయం
మద్దెం = చెవులు వినరాకపోవడం
మద్దెల = మృదంగం
మనగంజి మనం పల్చన చేసుకునుడు = కడుపు చించుకుంటే కాళ్లమీద పడడం
మనా చేసుడు = కాదూ లేదనడం, మన్నించడం
మనాది = మనోవ్యాధి
మని మని = ఆగు ఆగు
మనివున్నప్పుడు = బొందిలో ప్రాణం వున్నప్పుడు ( మనికి వున్నప్పుడు )
మనేల = చీట్ల పేకలో తొమ్మిది నంబరున్న కార్డు
మనోడు మందోడు = స్వ, పర
మన్ను = మట్టి
మన్ను బుక్కి మంచినీల్లు తాగుడు = కరువులో ఎలాగోలా బతకడం
మన్నుదిన్న పాము = జడుడు
మన్నుమశానం = మట్టీ స్మశానం, ఏమీలేదని
మన్సు = మంచు, మనసు
మన్సు గట్టిగ జేసుకునుడు = గుండెదిటవు చేసుకోవడం
మన్సు గుంజుడు = మనుసు మొగ్గడం
మన్సు తొక్కులాడుడు = మనస్సు కొట్టుకోవడం
మన్సు మీదికి తెచ్చుకునుడు = తీవ్రంగా ఆలోచించి మనస్సు పాడుచేసుకోవడం
మన్సు ఫెంచరిల్లుడు = మనస్సు చంచలించడం
మన్సు కొట్టుకునుడు = ఇష్టపడడం, ప్రేమ చూపడం
మన్సునవట్టక = పాలుపోక, ఊబునుపోక, తోచక
మన్సున వట్టుడు = అర్థం కావడం, మనస్కరించడం
మజ్దూరు = కూలీ, వేతనం
మబ్బు = బద్ధకం, మేఘం
మబ్బు యిర్సుడు = నిద్రలోంచి లేచాక ఒక రకంగా పిడికిళ్ళు పట్టి చేతుల్ని చాచుతూ ఒళ్ళు విరుచుకోవడం.
మబ్బుల = పెందరాళే
మమ అనిపించుడు = అయిందనిపించడం ( ఏదో ఒక రకంగా )
మయిమ = మహిమ
మరచెంబు = చెంబు మూతికి, మూతకు మరలు ఉన్న బాబతు
మరి = మరియు, మరే
మరుగుమందు = వశీకరణౌషధం
మరుమన్న తల్లి = మారుటితల్లి

మ(మా)రువెండ్లి = పెండ్లయ్యాక వరుని యింటికి మొదటిసారి వధువు బంధువులు వెళ్లడం
మర్కపిల్ల = జతకట్టే వయస్సు కొచ్చిన గొర్రెపిల్ల మొ॥నవి
మర్గుడు = అలవాటు కావడం
మర్జి = ఇష్టం
మర్మం తెలువనియ్యడు = లోతు తెలియనివ్వడు
మర్యాద = గౌరవం
మఱ్ర, మర్ల = మరల, మళ్ళీ
మఱ్రవడుడు = ఎదురు తిరగడం
మఱ్రి మఱ్రి చూసుడు = వెనక్కి తిరిగి చూడడం
మఱ్రుతలేదు (నాలుక) = తిరుగడం లేదు
మర్లుడు = తిరిగి రావడం
మలాయి = మీగడ
మలీద ముద్దలు = అప్పుడే చేసిన రొట్టెకు బెల్లం, చక్కెర కలిపి చేసిన ముద్దలు
మలెవడడు = పని పేరుకపోవడం రాశిపడడం (బట్టలు), కొన్నాళ్ళుగా బావి నీళ్లను వాడకపోవడం
మల్కా = సారి, పర్యాయం, తడవ, మెలిక
మల్కలు = త్రిప్పులు
మల్గిపోవుడు (దీపం) = ఆరిపోవడం
మల్గుడు (కన్ను) = పడుకోవడం
మల్పుడు = కారు మొ॥నవి తిప్పడం, దీపాదుల్ని ఆర్పడం,బియ్యం మొ॥నవి చేయడం, రాసినవి చెరపడం
మల్లగుల్లాలు = అనుమనాలు, వెనుకంజలు
మల్లపుట్టినట్లు అవుడు = పునర్జన్మ
మల్లెశాల = శయనాగారం ?
మల్సుకొని పండుడు = ముడుచుకొని మూడంకె వేయడం
మల్సారు = రెండవ కాన్పు
మశూర్ = హుషారు, ప్రసిద్ధుడు
మష్పి = మసి
మసాలపప్పు = వేపుడు పప్పు ?
మసుకు మసుకుంచంగ = మసక చీకటిలో
మసులుడు = మరగడం, కోపంతో మండిపోవడం, ఆలస్యం చేయడం
మస్కా, మస్కా = కాకా
మస్కట్ కారటు = ఏరోగ్రామ్
మస్కు మస్కుల = పెందరాళే
మస్కురోల్లు = సుంకర్లు ((అ) - మష్కూర్ )
మస్తి (ప) = పొగరు (మస్తీలోంచి వచ్చిన పదం)
మస్కంత పేగు, మస్కెపేగు = మసిగుడ్డ ( మసికంత - మసికంథ - కంథ - చింపిగుడ్డ )
మా = మహా
మాంటె = మహా అంటే
మా అక్కడ = మా ప్రాంతంలో, మావైపు
మా ఆయన = మావారు
మా (పోత) = వెళతాను లెండి అనడం
మా (వత్త) = ఎలాగూ వస్తాను, సరే వస్తాను
మాగ (సంపాయిస్తడుతీయి) = మహాగా ( సంపాదిస్తాడు లెండి )
మాగమాన = మాఘఅమావాస్య
మాగవెట్టుడు = పండజేయడం
మాగిన వడ్లు = చాలా పాతవడ్లు
మాగిపొద్దు = చలికాలంలో పగలు త్వరగా గతించడం
మాట = పదం, వాక్యం
మాట మాటకు = మాటి మాటికీ
మాట మీద నిలవడుడు = స్వవచన బద్ధుడవడం
మాట ముచ్చట = నిశ్చితార్థం
మాటలేదు ముచ్చటలేదు = ఉలుకూ లేదు పలుకూ లేదు
మాటల్ని సూర్లజెక్కుడు = మాటల్ని ఖాతరు చేయకపోవడం
మాటవోకుంట మూటవోకుంట = ఏదీ నష్టపడని రీతిలో
మాటికి = మాటి మాటికీ
మాటీలు = కమ్మసేర్లు
మాటు = కుంటకన్న చిన్న జలాశయం, చెక్‌డ్యామ్
మాట్లాడిచ్చుడు = పరామర్శించడం
మాట్లు = సార్లు, మార్లు
మాట్లుఏసుడు (బిందెకు) = రంధ్రాలను కూడ్చడం
మాడ = మాడ ( తలమీద నడిమి భాగం )
మాడుడు = ఆకలితో నకనకలాడ్డం
మాడ్పుమొకం = మాడ్చుకున్న ముఖం
మాత్‌కార్యం = మహత్కార్యం
మాదర్‌చోత్ = ఒక తిట్టు
మాన, మాన్క = రెండు తవ్వలు
మానం = యోని, సిగ్గు, అభిమానం

నలిమెల భాస్కర్

మానసము = మనస్సు
మానిక్యాలు = దీపపు పెమ్మెలు, కుందులు
మానుకోట = మహబూబాబాద్
మాపక్‌గా = సరాసరిగా, ఎక్కువా తక్కువా కాకుండా
మాపటికి = సాయంత్రానికి
మాపు = బీడీలు అప్పగించడం
మాపుఅవుడు = మాఫీ అవడం
మాపుకోర్సుడు (గుడ్డలు) = మైలకు ఓర్వడం
మామ్‌లా (అ) = పని, కంట్రాక్టు
మా(మి)డికాయ తొక్కు = మాగాయి
మామూలుగ = సాధారణంగా
మామూల్లు = లంచాలు
మాయలపకీరు = మాయల మరాఠీ
మాయెల్లైమే = మహావేగిరం, మహావైళమే
మారన్నం = రెండోసారి పెట్టుకునే అన్నం
మారాజు = మహారాజు
మారుపేరు = ఇంటిపేరు
మారుబ్యారం = మారుబేరం
మారువెట్టు = మరోసారి అన్నం పెట్టడం
మారె = మరే.. మరే.. సందేహాన్ని వెలిబుచ్చడం
మారెపత్తు (అ) = తరపున, ( మారిఫత్ నుండి వచ్చింది )
మార్గంగ చెప్పాలె (ఓ) = పద్ధతిగా చెప్పాలి ( ధర మొ॥ వాటిని )
మార్పులు = చేపల్లో ఒరకం
మార్మానం = మారుమనువు
మాల = అంతస్తు, మహల్
మాల ఏసుకునుడు = అయ్యప్ప వ్రతంలో భాగంగా మాల ధరించడం
మాల్ = సిమెంటు, నగలూనట్రా, సరుకు
మాల్‌మసాల = ఆస్తిపాస్తులు, కట్నకానుకలు
మాలిమి = చనువు
మాలిమి అవుడు = అలవాటు పడడం, కలసి పోవడం
మాలీ = యజమాని, తోటమాలి
మాలెస్క, మాలేసుగ = మహాలెస్సగా, చాలా
మాల్గాడి = గూడ్సుబండి
మాల్లెంగట్టుడు = మేళం కట్టడం, పదుగురు ఒక్క చోట పోగవడం
మాసమెత్తు = మాషం ( 8 గురిజల బరువు )
మాసర = మచ్చు
మాసికం = నెలపెట్టడం
మాసి పోవుడు = గుడ్డలు మురికికావడం, చెరిగిపోవడం
మించుకచ్చుడు = విషమించుకురావడం, అతికావడం, మించిపోవడం
మిండెడు = మిండగాడు, మిండమగడు
మిందె = నల్లికళ్లపాము, నకిరిలు
మిగులువాటు = మిగులు
మిటకరిచ్చుడు = తాటించడం (కళ్ళు)
మిటాయి = తీపి, స్వీటు
మిటాయి లేసుడు = బండి వెనకాల వేసిన బరువు ఎక్కువై ముందు భాగం హఠాత్తుగా లేవడం
మిట్ట, మిట్ర (పొలం) = మెట్ట, ఎత్తు
మిట్ట మిట్ట చూసుడు = మిట మిట మిటకరించడం
మిడిగుడ్లేసుడు = నిలువుగుడ్లు వేయడం, గుడ్లుతేల వేయడం
మిడిమిడిగ్యానం = అల్పజ్ఞానం
మిడుకుడు = అదేపనిగా వదరడం, విసుక్కోవడం
మిడుతోలె పనిచేసుడు = పద్ధతి ప్రకారం చేయక పోవడం
మిత్తి = వడ్డీ ( మిత్తి అంటే మృత్యువనే అర్థం)
మిత్తితీసుడు = పెళ్ళిళ్ళలో దృష్టి తీయడం
మిద్దె= మేడ
మినుపగారెలు = వడలు
మినుపపప్పు = మినప్పప్పు
మినుప ముద్దలు = సున్నుండలు
మియ్య = సాయెబు
మిరం = మిరప్పొడి
మిర్గం, మిర్గు = మృగశిర
మిర్గులు = మిణుగురులు
మిర్చీలు = మిరపకాయ బజ్జీలు
మిర్పవర్గు = ఎండుమిర్చి
మిశ్రీ = కలకండ
మిషిని = మిషన్
మీద మీద చేసుడు = ఉపరితలపు పని, మనస్ఫూర్తిగా చేయకపోవడం
మీది మీదికి వచ్చుడు = కొట్టబోవడం
మీది మోటర్ = విమానం
మీదికెల్లి = పైగా

మీదిపని = ఇంటికి సంబంధించిన పూతలు మొ॥న పై పని
మీదివాడ కట్టు = పై నున్న పెద్దకులాల వీధి
మీదోడు = పైవాడు, దేవుడు
మీసాలు తీరుడు = మీసాలు మెలివేయడం, దిద్దడం
ముంగట, ముంగల = ముందర, ఎదురుగా, ముంగిట
ముంచుడు = మోసం చేయడం
ముంజలు = ముంజికాయలు
ముండబొడ్లు = విధవరాండ్రు
ముండమోసుడు = వైధవ్యం అనుభవించడం
ముండరాలు = వెధవ
ముండ్లమీదున్నట్లు = అంపశయ్యపైనున్నట్లు
ముండ్లు = ముళ్ళు
ముంత పోత వాన = కుంభవృష్టి
ముంతపట్టుకపోవుడు = దొడ్డికి వెళ్లడం
ముందర వడాలె = ఇన్షియేషన్ తీసుకోవాలి, చొరవ తీసుకోవాలి
ముందుగాల = మొదట, ముందు
ముందు ముందు = భవిష్యత్తు
ముకువార్లు = చెప్పులవి ( ఉంగుటాన్ని, వెడల్పైన పట్టీతో కలిపే చర్మపు వార్లు )
ముక్కలు (నాలుగు) = అక్షరాలు
ముక్కిటు మూతిటు పెట్టుడు = అయిష్టత ప్రదర్శించడం
ముక్కిడి (మొకం) = మూర్ఖుడు, ప్రతి దానికి అయిష్టాన్ని చూపేవాడు
ముక్కిపోయిన = పుచ్చిపోయిన, వాసనపట్టిన
ముక్కిరుసుడు = పెదవి విరవడం
ముక్కు చెలిమెలు = ముక్కుపుటాలు
ముక్కు మీద ఈగ వాలితె కోసుకునెటోడు = ముక్కోపి
ముక్కుపోగు = ముక్కెర
ముక్కుమీద గుద్దినట్లు = ముఖంమీద కొట్టినట్లు
ముక్కుల్దాక తినుడు = పీకల్దాక తినడం
ముక్తసరిగ = టూకీగా
ముగ్గుగీతలు = ముగ్గు కర్రలు
ముచ్చటే లేదు = సమస్యే లేదు
ముచ్చట్లు పెట్టుకునుడు = పిచ్చాపాటీ
ముదిగారువం = అతి గారాబం
ముట్ట చెప్పుడు = చెల్లించడం, అప్పగించడం
ముట్టిచ్చుడు (పొయ్యి మొ॥నవి) = అంటించడం
ముట్టుడు = అస్పృశ్యత, సుష్టి, తాకడం, చేరడం
ముడితె మాసిపోవుడు = చాలా అందంగా ఉన్నారని చెప్పడం
ముడివడుడు = పని మొ॥నవి పూర్తవడం, పరిష్కారం కావడం (తమిళంలో ముడివడ్డైయ్‌వుదు అని అర్థం)
ముడుపు గట్టుడు = మొక్కు కట్టడం
ముడుసులు = ఎముకలు ( మోకాలి పై భాగం )
ముడ్డి బట్ట మీద సోయిలేకపోవుడు = మొత్తానికి మొత్తంగా స్పృహ, చైతన్యం అవగాహన లేని స్థితి
ముడ్డిమొసలనిపని = ఊపిరిసల్పనిపని
ముతనాశినం = సర్వనాశనం
ముత్తక్క = చాలా ముసలిదని అర్థం
ముత్తడం = మొత్తం కప్పకుని రావడం (మేఘాలు)
ముత్తెమంత = ఇసుమంత, రవంత, పిసరంత, అణువంత, అవాంత
ముత్రాసి = ముదిరాజ్, తెనుగు
ముద్దతు (అ) = గడువు
ముద్దపప్పు = మందబుద్ధి
ముద్దుగ = అందంగా
ముద్దెరపరిక = వరి మొ॥ ధాన్యరాశుల నుండి ధాన్యాన్ని ఎత్తుకుపోకుండా రాశిపైన గుర్తుగా వేసే పరక
మునాకలి = మునివాకిలి, ముంగిలి
మునాప (అ) = లాభం
మునాసం = సబబు, తగినది
మునిగిపోవుడు (పనిల) = లీనమవడం
మునీమ్ (అ) = Benefactor, కమీషన్ తీసుకుని పనిచేసే వ్యక్తి, క్లర్కు
మునుపు = పూర్వము
మున్గిపోయినట్లు = కొంపలంటుకున్నట్లు
మున్గుడు = నష్టపోవడం
మున్నూరు = మూడు వందలు
మున్నూరుకాపు = తెలగాలు, కాపులు, నాయుడు? చౌదరి ? తూర్పు చాళుక్యులు ?
మున్పటి రోజులు = గతకాలం
మురుసుడు = సంతోషించడం
ముర్గవెట్టుడు = పని పేరబెట్టడం

ముర్గం = జింక
ముర్గి = కోడి
ముర్దాబాద్ = నశించాలి
ముర్రుపాలు = బాలెంతపాలు
ముల్కి (అ) = స్థానికుడు, పెన్సిల్ మొ॥ వాటి ములికి, పాళీ
ముల్లు ఆడిచ్చుడు = విసుర్రాళ్ళు మొ॥ వాటిపై ఉలితో కొట్టి గరుకు చేయడం, కక్కుగొట్టడం ?
ముల్లుగట్టె = ముల్గర్ర
ముష్కిల్ = కష్టం
ముసలోల్లు ముడిగోల్లు = ముసలీ ముతకా ( ముడి అన్న ముతక అన్నా ఒకటే కదా ! )
ముసాఫిర్ = ప్రయాణీకుడు, బాటసారి
ముసి ముసి నవ్వు = చిరునవ్వు
ముసి ముసి మబ్బుల = మసక వేకువలో
ముసురుడు = మూగడం
ముస్కురాయించుడు = నవ్వడం
ముస్తాదు యిడ్సుడు = ఈదులు విడవడం ?
మూకుడు = కడాయి
మూగదయ్యం పట్టినట్లు = ముభావంగా వుండడం
మూగనోము = మౌనవ్రతము
మూగమొద్దోలె = ముభావంగా
మూటముగ్గురు = ( ముగ్గురికి ) ముగ్గురు
మూటముల్లె = పెట్టేబేడా
మూటి = ముతా
మూడం = శుభదినాలు కాని కాలం, మౌఢ్యం
మూడింది = నాశనమైంది
మూడు కాల్ల పీట = ముక్కాలిపీట
మూడు చుక్కలు = ముప్పావలా
మూడు పానాదులు = అడ్డరోడ్డు, కూడలి
మూడు ముక్కులోడు = చిన్నపిల్లల్ని తన శ్వాస ద్వారా పీల్చుకునే రాక్షసుడు (చిన్నపిల్లల కథలలో)
మూడు ముడికాన్లపని = అల్పమైన పని
మూతినల్లవడుడు = నూనూగు మీసాలు రావడం
మూర్తం = ముహూర్తం
మూల మలుపు (మూలమల్గుడు) = వీధి మలుపు
మూలకం = మూలం
మూలగొట్టు = మారుమూల
మూలచుక్క = వేగుచుక్క కన్న ముందు పొడిచేది
మూలమంచ ఏసుడు = అలకపాన్పువేయడం, మంచాన పడ్డం

మూల మూలలు ఈగుడు = మందిలో కల్వకపోవడం
మెంటకన్ను = మెల్లకన్ను
మెంటల్ = పెట్రోమాక్స్‌లో వెలుగునిచ్చే వత్తి, మాంటిల్, పిచ్చోడు, మెంటోడు
మెంటోడు = మెల్లకన్నువాడు
మెండిచ్చుడు = గునపంతో పెద్ద పెద్ద బండరాళ్ళను లేపుతున్నప్పుడు గునపం కింద మరొక చిన్నరాయిని వుంచడం ( సరళయంత్రం )
మెండు మీదున్నడు = తీవ్రంగా, కోపంగా వున్నాడు
మెంతెం = మెంతి
మెక్కుడు = బాగా తినడం, దట్టంగా పట్టించడం
మెడ (శింపులు) = మెడ వెనక భాగాలు
మెడకు వడుడు = తగులుకోవడం
మెడకు వడ్డపాము = అనివార్యమైన అపద
మెడకోడం = గుదిబండ
మెడ బలిమితనం = ఒళ్ళు కొవ్వెక్కడం
మెడల మీద కూసునుడు = అప్పటికప్పుడు పని పూర్తి కావాలని నిర్బంధించడం
మెడల మాదికి వచ్చుడు = పీకల మీదికి రావడం
మెడలిరిశి కుప్పబెట్టుడు = పెద్ద శిక్ష
మెతుకు = మెదక్
మెతుకులు = అంట్లు
మెత్త = దిండు, తలగడ
మెత్త = పరుపు ?
మెత్తగాల్లు = బురదలో దున్నిన కారణం చేత ఎద్దుల పాదాలు పచ్చికావడం
మెత్తని చినాలి = మెత్తని లంజె ( మెత్తని పులి అని తిక్కన ధర్మరాజును అనలేదూ ! )
మెత్తవడుడు (మొగులు) = మబ్బులు కమ్మడం
మెత్తు = సాకు, బరువు
మెత్తుడు = గోడలకు మట్టిని పూయడం
మెదడు మోకాల్లల్ల వుండుడు = తెలివిలేని తనం
మెదుగుడు = మెత్తగానూరడం, గడ్డిని దగ్గరగా వేయడం
మెదులుడు = కదలడం, ప్రవర్తించడం
మెరిగెలు = బియ్యంలో వచ్చే వడ్లగింజలు
మెరుగు = నయం, మేలు
మెరుగుపెట్టుడు = నగలను కాంతివంతం చేయడం
మెలితం అవుడు = అలవాటు పడిపోవడం, కలసిపోవడం, మిళితం కావడం

మెల్లుడు = బండిలో పట్టుదగినంత సామాను మొ॥నవి ఒక పద్ధతిలో అమర్చడం
మెల్లెగ = మెల్లగ ( సమస్వరత - చెల్లెలాగా )
మెస్లరాదు కస్లరాదు = కదలలేని స్థితి
మెసులుడు = కదలడం, మసలుకోవడం
మేజు (ప) = మేజాబల్ల
మేటేషం = గొప్పవేషం, మేటిపాత్ర
మేట్న = కోణమానిని
మేతరోల్లు = పాకీమనుషులు
మేన = పల్లకి
మేనత్ = మెహనత్, శ్రమ
మేర = దర్జీ ( దర్జీ - పర్షియన్ పదం ), ( మేర అంటే హద్దు మేరకు కత్తిరించి కుట్టే వ్యక్తి )
మేరం = వలె
మేరుంకలర్ = మెరూన్ కలర్
మేర్బాన్, మెహర్బానీ (ప) = దయ
మేల్కు అవుడు = మెలకువ రావడం
మేవలు పెట్టుడు = రకరకాల తిండ్లు మేపడం
మేవుక పోవుడు = అంటుకోవడం ? (బిస్కట్ తిన్నాను - అది పండ్లకు మేవుక పోయింది )
మైదా (ప) = గోధుమలు మొ॥వాటి పై పొట్టుతీసిన పిండి
మైదాకు = గోరింటాకు
మైన = నెల, మాసం
మైల = మురికి, మకిల
మైలపోలు తీసుడు = మకిల, మలినం తీయడం ( పెళ్లిలో ఆచారం )
మైసాచి = గుగ్గిలం
మైసూర్‌పప్పు = సిరిశనగపప్పు
మైసూర్ బజ్జీ = మైదాతో చేసిన బజ్జీ
మొంటె = చిన్న చేట
మొండిగటం = మొండిఘటం
మొండిపద్దులు = ఎంతకూ అప్పు చెల్లించని పద్దులు
మొండిపోవుడు = మొద్దువారడం, పదును పోవడం మొక్క పోవడం
మొండివారుడు = అన్నింటినీ సహించగల్గడం, బండ బారడం
మొండు = మొండి
మొక్‌రార్ = నిర్ణయం
మొకం = ముఖం
మొకం కడ్డుడు = పళ్ళతోమడం
మొకం గొట్టుడు = మొహమొత్తడం
మొకం తెలివి = తలెత్తుకుని తిరగడం ( మాపెద్దోడు సంపాయించి బాకీలు గట్టిండు. నాకు నలుగుట్లె జెర్ర మొకం తెలివయ్యింది.)
మొకం బంగారం అవుడు = నల్లపూసకావడం
మొకం బట్కోని = ముఖమ్మీదే
మొకం మీదికచ్చుడు = ముఖం వాచి పోవడం
మొకం లేకుంట అవుడు = తలెత్తుకుని తిరగలేక పోవడం
మొకంల కల ఉండుడు = అందంగా కళతో వుండడం
మొకద్దమ = కేసు
మొకమంత యింత దొడ్డు పెట్టుకునుడు = మొహం ముడుచుకోవడం
మొకమ్మీద గొట్టినట్లు చెప్పుడు = మొహమ్మీదే అనడం
మొకల్గ = విశాలంగా
మొకాం = మకాం, నివాసం
మొకాన = వైపు, దిక్కు
మొకాన మొద్దులు పెట్ట = తిట్టుపదం
మొకాబిల (అ) = సాటి, తీరుగ, భేటీ చేయించ గల్గడం, సాక్ష్యం ఇప్పించడం
మొక్కి చీపురు = మొండి చీపురు
మొగతనం = మగటిమి
మొగబాయిగాళ్ళు = మగవారు
మొగి = మొవ్వ
మొగిలి = మౌళి
మొగులవుడు = మబ్బులు కమ్మడం
మొగులు = ఆకాశం
మొగులు ఎద్దు వుండవుడు = ఆకాశంలో సూర్యుడున్నంత మేరా నెత్తురు పూసినట్లుండడం.
మొగులు కలుపుకునుడు = మేఘాలు కమ్ముకోవడం
మొగులుకు తూటు వడుడు = కుంభవృష్టి
మొగోడు = మగాడు
మొట్ట (చాప) లు = కొర్ర మట్టలు
మొట్లు (కట్టెలవి) = దుంగలు
మొత్తు వాసన = మూత్రానికి సంబంధించిన వాసన, గబ్బువాసన, మూత్రవాసన
మొదలార = ఒకతిట్టు
మొదలు = కాండం
మొదుగాల = ముందు, మొదలే

మొద్దు మొకం = ఒక తిట్టు
మొద్దు కష్టం = మొరటుపని
మొద్దుకూర = మాంసం
మొద్దు నిద్ర = గాఢనిద్ర - Sound sleep.( మిఠీ నీంద్ లాంటిది )
మొద్దులు = దుంగలు
మొన = పెన్సిల్ ( మొన ) మొ॥
మొన్న మొన్నటి పోరడు = అనుభవంలేనివాడు
మొర్రిపండ్లు = ఒక రకమైన పళ్ళు
మొల = మేకు
మొలాం = మలాము, లేపనం, పూత
మొలేసి తలదీత్తడా ? = శిలువ వేస్తాడా ?
మొల్క నవ్వు = కందళిత హాస్యం
మొల్దారం తెంప = ఒక తిట్టు
మొల్లి = చిన్నపిల్ల
మొస = శ్వాస, ఊపిరి
మొస మర్రకుంట = ఊపిరి సలపకుండా
మొసాంబ్రం = Aloes, నల్లమందు
మోంబత్తి = కొవ్వొత్తి ( మోం పర్షియన్ పదం )
మోక, మోకా = అదును, అవకాశం, సందర్భం
మోకమీద = సమక్షంలో
మోకు = గీతకార్మికుడు, నడుముకు వేసుకుని తాటి చెట్టు పైకి ఎక్కడానికి వాడే మందమైన తాడు
మోచీ = ముచ్చి ?
మోచేతినీల్లు = ఎంగిలి కూడు
మోట = కపిలె
మోటు = మొరటు
మోటు కష్టం = శరీర కష్టం
మోటు మాట = బూతు మాట
మోత = బరువు, మోయడం, శబ్దం
మోతాదు ( అ ) = లెక్క ఫరవా, ఒకస్థాయి,. ఎక్కువ తక్కువకాని
మోతె బిందెలు = కాటరాక్టు (మోతీ = ముత్యాలాంటి బిందువులు )
మోతెవరి (అ) = పెద్దరికం, మోతుబరితనం
మోత్కుచెట్టు = మోదుగ చెట్టు
మోత్మీన్‌సాబ్ = ఇన్‌స్పెక్టర్ ?
మోదెగాలు = బోదకాలు
మోపుజేసుడు = మొదలు పెట్టడం, అంటగట్టడం
మోపున = నిదానంగా

మోయేడు = నిరుటికన్న క్రితం సంవత్సరం
మోర్ = చల్ల, కల్లు
మోర్ (ప) = ముద్ర (ముహర్, మొహర్)
మోరి (ప) = మురిక్కాలువ
మోరీల్‌సాబ్ = హెడ్ కానిస్టేబుల్
మోరుదోపోడు = పనికి ఓర్వనివాడు, పెడసరం మనిషి, మొరటుమనిషి
మోసంబీలు = బత్తాయిలు
మోసకారి = మోసగాడు, మోసగత్తె
మౌడులు = కారప్పూస
మ్యాక = మేక
మ్యాదకుడు = అమాయకుడు, సాధువు
మ్యాదరోల్లు = మేదరులు

## య

యంత్రం బెట్టుడు = దుష్టపథకం పన్నడం
యమశెరలవడ్డట్టు = యముని చెరశాలలో పడ్డట్టు
యమయాతన = నరకయాతన
యాకం (అందరు) (రాంగ్రి) = (అంతా) కలిసి కట్టకట్టుకుని (రండి)
యాకాశి = ఏకాదశి
యాట = గొర్రె, మేక, మొ॥నవి
యాడ = ఎక్కడ
యాదాది = ఒక్క సంవత్సరం
యాడాదినర్దం = ఏడాదిన్నర
యాడాద్దినం = సంవత్సరీకం
యాతంబోసుడు = అవిరామంగా పనిచేయడం
యాతన = విపరీతమైన కష్టం
యాతర జాతోల్లు = శూద్రులు
యాది (ప) = జ్ఞాపకం
యాది జేసుడు = జ్ఞప్తి చేయడం, రిమైండ్ చేయడం, వల్లెవేయడం
యాది మర్సుడు = మరచిపోవడం
యాప = వేప
యారాలు = తోడికోడలు
యాలక్కాయలు = ఏలకులు
యాల్ల = సమయం, వేళ, టైం

యాల్ల కమీన, యాల్లకమాన, యాల్లకామన = వేళ ప్రకారం
యాల్లపొద్దుగాల్ల = సకాలంలో, ఠంచన్‌గా
యాల్లపాల్ల = వేళాపాళా
యావ = తపన, ఆసక్తి, కన్సెర్న్
యాష్ట = వేసట
యాన = వంకర, ఏటవాలు
యాసంగి = వేసవి
యాసమాటలు = వ్యంగ్య వచనాలు
యెమగొండ రాచ్చసులు = యమకింకరులు
యోగం = అదృష్టయోగం
యోడు = ఏడు

## ర

రంగపొట్టు = రొయ్యలు ( వైష్ణవుల పరిభాష )
రంగ రంగ అనుకుంట = హాయిగా పూలరంగడిలా
రంగు = వాలకం
రంజన్ = మట్టీ, గురపులద్ది కలిపి చేసిన నీటి పాత్ర. ఇందులోని నీళ్ళు చాలా చల్లగా ఉంటాయి.
రంజి, రంది = విచారం
రంధ్రం (సూది) = బెజ్జం
రంప రాకాశి = గయ్యాళి గంప
రంపె = రంపం
రకంగట్టుడు (అ) = డబ్బులు చెల్లించడం
రక్ష = రిక్షా
రగుతం = రక్తం
రగ్గు (ప) = ఉన్నితో చేసిన దుప్పటి లాంటిది
రగ్డాయించుకొనుడు = తగవు పెట్టుకోవడం
రజా = సెలవు
రజాకార్లు = స్వయం సేవకులు (నిజాం రాజు కాలూకు )
రజాయి = దుప్పటి ?
రట్టుగొట్టుడు = భట్టీయం పట్టడం
రహారుడి = వేగంగా రావడం, హడావుడి
రతం బట్టుడు = వ్రతం పట్టడం
రత్నపురిగడ్డలు = చిలకడదుంపలు
రద్ది, రద్దీ = చెత్త, అపనింద, రష్, తొడతొక్కిడి
రద్దు (అ) = రఫ్, చిత్తు, క్యాన్సిల్ కావడం
రనం = వ్రణం
రపరప = గొడవ
రప్పు అవుడు (ప) = అలవాటు పడడం
రప్పాస్ = రద్దు
రప్పు పోసుడు = డార్నింగ్ చేయడం
రవాయి = రాకపోకలు ? రవాణా ?
రసనీల్లు = ఫ్యాక్టరీల నుండి బయటకు వచ్చే వ్యర్థ జలాలు
రసం = పాదరసం
రసరస = గొడవ
రసీదు టిక్కెట్టు = రెవెన్యూ స్టాంపు
రసీదు (ప) = రిసీటు (బాకీ చెల్లించినట్లు ఇచ్చే చీటి )
రస్త (ప) = వీధి, ( రాస్తా నుండి వచ్చింది )
రాంగ రాంగ = రాగా రాగా, రానూ రానూ, క్రమేపీ
రాంగనే = రాగానే
రాండ్రి = రండి
రాంరాం = నమస్తే, సెలవు
రాకచ్చిండు = రావడంలేదు
రాకట = రాక
రాకడ పోకడ = రాకపోకలు
రాకరాక వచ్చుడు = చాన్నాళ్ళ తర్వాత రావడం
రాక్షసుడు = అసాధ్యుడు, అఖండుడు
రాగందీసుడు = ఏడ్వడం
రాగాడిది పోగాడిది అయింది (నా బతుకు) = గాడిద చాకిరి
రాగిచెట్టు = రావిచెట్టు
రాగోల = కంపను తీసుకెళ్ళే వంగతో వున్న కర్ర
రాచెయ్యి = విస్తురాయి పై కర్ర
రాచ్చిప్ప = రాతిచిప్ప
రాచ్చెసి = రాక్షసి
రాజగునం = రాజుగుణం, భారీ గుణం
రాజనాలు = మంచిబియ్యం
రాజపని = శ్రేష్ఠమైన మాట
రాజిర్కం = రాజరికం, పెత్తనం
రాజులపుట్టువడి = మహారాజుల్లాంటి పుటక
రాజే (యే) సురాలు = రజస్వల
రాజేసుడు = పొయ్యి అంటించడం, రాజిల్లడం, వేములవాడ రాజరాజేశ్వరుడు
రాటుదేలుడు = నెగ్గుకురావడం, అన్నిటినీ తట్టుకునే స్థితికి రావడం
రాత = తలరాత
రాతపూతలు = రాతకోతలు

ాతమంచిగ అడుక్కరాకపోవుడు = చెడ్డ రాత
ాచ్చుకోవడం
ాతెండి = సీమెండి
ాత్త = వీధి, దారి
ానీకి = రావడానికి
ామగోస = రాముడనుభవించిన బాధలాంటిది
ామసక్కదనం = రామునిలాంటి అందం
ామనక్కనిపిల్ల = రాముని అందం లాంటి,
ామచిలుకలాంటి పిల్ల
ామా కృష్ణా అనుడు = ఆధ్యాత్మిక చింతనతో
ాలం గడపడం
ామాండెం = రామాయణం
ామ్ములక్కాయలు = టమాటాకాయల్లాంటివి
చిన్నవి)
ాయసొంటి మనిషి = గట్టివాడు, ఎన్నింటినో
కట్టుకోగల స్థితప్రజ్ఞుడు
ాలచెట్టు = రావిచెట్టు ?
ాల్లకమ్మలు = కమ్మపంజులు, పంజుల కమ్మలు
ాల్లవాన = వడగళ్ల వాన
ాల్లు దింటె అరిగే వైసు = పడుచు ప్రాయం
ావట్టుకొనుడు = తీసుకొనుడు
ాషన్ = నెలకు సరిపడా తెచ్చిన దినుసులు, రేషన్
ాసకార్యం = రాజకార్యం
ాసపుండు = రాచవ్రణం, క్యాన్సర్
ాసుకోని పూసుకోని తిర్గుడు = మరీ సన్నిహితంగా
తిరగడం
రికాం = విశ్రాంతి, తీరిక
రికాబు (ప) = పళ్ళెం (చిన్నది ?)
రిక్క = పువ్వుదళం, ఆకుదళం
రిల్లలు / రిల్లెలు వడుడు (కాల్లు) = అదేపనిగా
కూచోవడంవల్ల కాళ్ళు పట్టినట్లు ఉండడం
రిల్లిచ్చుడు (ముక్కు) = ఎగరేయడం
రిల్లుడు = ఆకు లాంటివి తెంపడం
రీతిలేదు తర్వాయిలేదు = రీతీ రివాజు లేదు
రుంగు రుంగుల ఎంటికెలు = ఉంగరాల జుత్తు
రుకాయించుడు = ఆపడం
రుక్కవ్వ = రుక్మిణమ్మ
రుక్సత్ = రోగం, రుగ్మత
రుక్సత్ (అ) = సెలవు, తీరిక
రుచ్చాలు = వృక్షాలు
రుడం = రుణం

రుధ = వృధా
రుబాబు = పొగరు, గర్వం, ఆడంబరం
రువ్వడి, రుబ్బడి = వేగం, రాయి, రువ్వేవడి ?
రుమాలు (ప) = తలపాగా
రూటికి లేదు పాటికి లేదు = ఎందుకూ
కొరగాకుండా పోవడం, రూఢికీ పాడికీ ( న్యాయం
) లేకపోవడం
రూపు = ఆకారం, అందం
రూప్కంగ = రూపంలో
రూబడిచ్చుడు = వ్యక్తి సమక్షంలో నేరనిర్ధారణ
చేయడం
రూల్కట్టె = రూళ్ళకర్ర
రెండు చుక్కలు = ఎనిమిదణాలు
రెండు మూతుల పాము = తటస్థుడు, గోడమీది
పిల్లి
రెండుకాల్లపిల్లి = మనిషి
రెండేల్లకు వచ్చుడు = దొడ్డికి రావడం
రెండో సమందం = పునర్వివాహం (పురుషునికి ?)
రెక్కకు బొక్కకు ఆసర = చేదోడు వాదోడు
రెక్కలిరిగినట్లు అవుడు = కుడిభుజం పోయినట్లు
కావడం
రెక్కలు = చేతులు
రెక్కలు నల్లగుండుడు = ఆరోగ్యంగా
ఆయుష్మంతుడయి వుండడం ( మా ఆయన
రెక్కలు సల్లగుంటె ఈ బాకీలన్ని తేరుతయి )
రెట్టలు = చేతులు ( భుజాలు )
రెడ్డిర్కం = రెడ్డి కులస్తుల పెత్తనం
రెమ్మ = చిన్నకొమ్మ
రేకు = గుడ్డ
రేగుతున్నదిరా ? = చెలరేగుతుందారా ?
( చెడు అర్థంలో )
రేచీకట్లు (బహువచనాంతం) = రేచీకటి
రేజర్ పత్తి = బ్లేడు ?
రేతి = ఇసుక ?
రేనిపండు = రేగుపండు
రేవ, ర్యావ = గోడలపై పూసే ఒక రకం మన్ను ,
గార ?
రేవుకచ్చుడు = కాస్త బాగుపడడం, గట్టెక్కడం
రేషం = పౌరుషం, ఆత్మాభిమానం, రోషం
రేషగొండిమనిషి = పౌరుషవంతుడు
రైకె = రవిక, జాకెట్టు

రైను వెట్టుడు = కుదువ బెట్టడం
రాండ్ = నడుము, కటి
రాండు = రెండు
రాండు మూడు ముచ్చెట్లల్ల = టూకీగా
రాంబొచ్చె = ఉరము
రాచ్చు రాచ్చు = బురద బురద (మలమూత్రశాలలో)
రొడ్డు = చాలా పుల్లనిది
రొప్పుడు = బండి నడపడం
రొష్టు = గలీజు ? అలసట ?
రోక = ప్రామిసరీ నోటు
రోకలి బండ = రోలు కన్న చిన్నది ( అడుగున పాన్ను లేనిది )
రోకు = వాలకం, మూడ్
రోగం = జబ్బు, వ్యాధి
రోగం రొష్టు = రోగం, బలహీనత మొ॥నవి
రోగపొడు = వ్యాధిగ్రస్తుడు
రోజా (ప) = తురకల ఉపవాసవ్రతం
రోజులు (బెల్లం) = ముద్దలు ( పిడకల ఆకారంలో వుంటై )
రోడ్డాం = కల్వర్టు
రోత = అశుభ్రం, మలం
రోతిరి = ఆటలో అబద్ధం
రోని = రోహిణి
రోయిరోయి అచ్చుడు = రోత అనిపించడం ?
రౌతు = రాయి, శకట రేఫం
ర్యాక = ముంజకాయలు మొ॥ కట్టడానికి తాటి ఆకులతో ప్రత్యేకంగా తయారుచేసినది
ర్యాగడి = రేగడి

## ల

ల, లె = లో
లంక పిండి = లంకలు అనే ఒక రకమైన పప్పు జాతి పిండి
లంకంత కొంప = పెద్ద యిల్లు
లంగ = దుర్మార్గుడు
లంగని దొంగని జూసినోడు = అన్నీ తెల్సినవాడు
లంగాలవుడా బగవాన్ దాస్ = L.L.B కి full form యిలా చెబుతారు తమాషాగా
లంగ సోపతులు = చెడ్డ సహవాసాలు
లంగోటి (ప) = కట్ డ్రాయర్
లంజిర్కం = వేశ్యావృత్తి
లంజెకాన = లంజదానా అని తిట్టడం ?
లంజొడుక = లంజకొడకా
లండు = సోమరి
లందె = చనిపోయిన పశువులను వేసే గుంత
లంబచోడ = చాట భారతం, ఒడ్డూ పొడుగు
లంబడి సుట్టిర్కం = కలిసినప్పుడే ఆత్మీయత ప్రదర్శించడం
లంబుకు లంబు = దృఢకాయుడు, పొడుగరి
లకోట = పెద్ద పార్సెల్ కవరు
లక్కి దువ్వ ఆట = చీట్ల పేక ఆటలో ఒకరకం
లక్పతి = లక్షాధికారి
లగాంచి = లగాయించి, వేగంగా
లగు = ఎరువు, బలం.
లగ్గ = నవనవలాడే చక్కని రేగుపండు, అమ్మాయి మొ॥నవి
లగ్గం = లగ్నం, పెళ్ళి
లగ్గాలు మూర్తాలు = వివాహాదులు
లగ్గడం = లగ్నం
లచ్చ = లక్ష
లచ్చిందేవి = లక్ష్మీదేవి
లచ్చింపతి = లక్ష్మీపతి
లచ్చింబాంబు = లక్ష్మీబాంబు
లచ్చిమి రాంగ తడుకడ్డం బెట్టినట్టు = సిరిరా మోకాలొడ్డినట్లు
లటుక్కున = గబుక్కున
లట్టు పొట్టు మాట్లాడుడు = యథేచ్ఛగా నోటి కొచ్చిందల్లా మాట్లాడడం
లడాంగురం బొడాంగురం = దుస్తులు చాలా వదులుగా వుండడం
లడాయి = కొట్లాట
లడ్డుగురం బొడ్డుగురం = వదులొదులు, పొడుపు కూడా ( చాలా లూజు అని )
లడ్డూలు = లాడూలు, లడ్లు
లత్కోర్ మనిషి = దరిద్రుడు
లత్త = దరిద్రం, శని
లద్ది లద్ది = మెత్తమెత్తగా

లపంగ (ప) = లంగ
లపోటుగాడు = చెడ్డవాడు ?
లప్ప లప్ప తినుడు = తొందర తొందరగా తినడం
లప్పం = కర్రల సందుల్లో నింపే ప్లాస్టర్
లబ్బర్ = రబ్బర్
లబ్బ లబ్బ మొత్తుకునుడు = లబో దిబో మనడం
లమ్‌డీ = ఒక తిట్టు
లవు, లావు = బాగుగా
లవుడగాడు = తిట్టుపదం
లస్కర్ (అ) = సికింద్రాబాద్, సైన్యం
లాక్ = లక్ష
లాకలు, ల్యాకలు = మొలకలు
లాగం = అలుసు
లాగు = ప్యాంటు, పంట్లాం
లాగోడి = పెట్టుబడి, లాగుబడి
లాభం గువ్వల కచ్చుడు = మొత్తం నష్టపోవడం
లాచార్ = లోకువ, తక్కువ తినడం, నాదాన్?
లాట్‌సాబ్ = ఆఫీసరులాంటి గౌరవనీయుడు
లాటిచ్చుడు = రొట్టెలను బేలన్ కోలతో లాటించడం
లాట్నా = రొట్టెల కోల
లాడు = గారాబం
లాత్ = తన్ను
లాపత్త = అడ్రస్ లేకుండా పోవడం
లాపర్వ = నిర్లక్ష్యం
లాయిలప్ప = నీళ్ళతో నింపిన బెలూన్ దీంతో పిల్లలు ఆడుకుంటారు.
లాల = నీళ్ళు ( లాలాజలంలోంచి వచ్చి వుండవచ్చు)
లాల్ (ప) = ఎర్రని
లాల్‌పలాం = ఎర్రెర్రని దండాలు
లాలూచి = కక్కుర్తి
లావు లావు = చాలా చాలా
లాసిగ = బిగ్గరగా, గట్టిగా
లింగు లిటుక్కుమనుకుంట ఒక్కడే వచ్చుడు = ఏకాకిగా రావడం
లిక్కి = చిన్న కొడవలి
లిపాప (అ) = కవర్
లిబ్బి = నిధి, నిక్షేపం
లీల్లు = నీళ్ళు
లుకలుక అవుడు = వదులుకావడం
లుచ్చగాడు = తుచ్ఛుడు
లూటి, లూటిమార్ = నష్టం

లెంక = లంకె
లెంకుడు = వెతకడం, వెముకుట
లెక్క = వలె
లెక్కపక్కలు = లెక్కలు
లెక్కపత్రం = పద్ధతీ పాడూ, రీతి రివాజు
లెలెల్లెపాట = బృందగానం ?
లెవ్వు = లేవు ( నా దగ్గర నువ్వడిగినన్ని పైసలు లెవ్వు )
లెవ్వు = లెగు(అరెయ్ లెవ్వు.... చాన పొద్దయింది)
లే (దు) = లా (కనిపించలా మొ॥వి)
లేకి (లేకిడి) బుద్దులు = లేకిబుద్ధులు, పరిగ ఏరుకొని తివేవారు
లేడియ = రేడియో
లేనోడు లెవ్వనోడు అందరు = అందరూ
లేనోల్లు = పేదలు
లేపేసుడు = చంపడం
లేమిడోల్లు = లేనివాళ్ళు
లేవట్టుడు = లేపడం
లేసుడు (దుమ్ము) = రేగడం (దుమ్ము)
లై (ప) = గోధుమపిండితో వుడకబెట్టిన జిగురు లాంటిది
లైట్‌గొట్టుడు = బీటేయడం
లొంక = గుట్టల మీద సహజంగా ఏర్పడిన నీళ్ళ గుంట
లొంత, లొంద = గుంత, లొంట
లొటపెట = ఒంటె, లొట్టియ
లొటాక = కవరు, సుదీర్ఘమైన ఉత్తరం, పెద్ద కవరు
లొట్ట = డొల్ల, బోలు, పాత్రలు కిందపడగానే పోయిన లొట్ట
లొట్టకండ్లు = లోపలికిపోయిన కండ్లు
లొట్టపీసు = ఒక రకమైన చెట్టు
లొట్టపీసు మాసపత్రి = సింగినాదం జీలకర్ర
లొట్టెలు = గుటుకలు
లొట్టి = కల్లుకుండ
లొట్టిమీదికాకి = బాగా వదరేవాడు
లొడకొట్టుడు = కడుపంతా కలియబెట్టినట్లు కావడం
లొడలొడ వదురుడు = అతిగా వాగడం
లొల్లి = అల్లరి
లోకంతోని లొట లొట నలుగురితోని నారాయన= మందిలో గోవిందా

లోకబాద = లోకులబాధ (నలుగురి వల్ల కలిగే బాధ)
లోకమ్మీద = లోకంలో
లోకులు = జనం, ప్రపంచం
లోట = ఒక పాత్ర
లోటిసు = నోటీస్
లోటు = నోటు
లోతు పాతులు = అనుపానులు ?
లోపటికి పోవుడు = నష్టపోవడం
లోపర్‌గాడు = దుర్మార్గుడు ?
లోపలివాకిలి = లోగిలి
లోపుడు = కడుపంతా కలియబెట్టినట్లు కావడం
ల్యాగ = లేగ
ల్యాగదూడ = లేదూడ
ల్యాత = లేత

## వ

వంక = లోపం, దోషం, సాకు
వంకర టింకర = వంకర కొంకర
వంకర పప్పు = రొయ్యలు
వంకర మాటలు = వ్యంగ్య వచనాలు
వంకర బుద్ధి = వక్రబుద్ధి
వంకుంగరం = ఉంకుటుంగరం
వంగలేనోడు = పని ఇష్టపడని సోమరి
వంగవెట్టుడు = మనిషితో పనిచేయించుకోవడం
వంగితె మాయం జేసుడు =పెద్ద మోసం, నిశిత తెలివి ( వంగితే చాలు వృషణాలను మాయం చేయడం )
వంగుడుయ్యాల = నులకతో నేసిన తూగు టూయల
వంటలకు పోవుడు = వనభోజనాలు
వండు = ఒంద్రు
వంతన = వంతున ? ఆచారం
వంతు = అదృష్టం
వంతుకు = వెుక్కుబడిగా, బదులుగా (మనస్ఫూర్తిగా కాకపోవడం)
వందురు, వంపు = పల్లం, దిగుడు
వకాలత్ = ప్లీడరీ
వకీలు (అ) = ప్లీడర్, న్యాయవాది
వక్కలు = ముక్కలు
వక్కపోవుడు = వాడిపోవడం
వగల ఏడ్పు = కపటశోకం
వచ్చిండు = వచ్చాడు
వచ్చిన కాడికి = వచ్చినంత వరకు
వచ్చిన మటె = వచ్చింది కాబోలు, రావచ్చు
వచ్చిరాని ఏడ్పు = కపటశోకం
వజన్ (అ) = బరువు
వట్టి = ఉత్త
వట్టిగనే = ఉచితంగా
వట్టిచాపలు = ఎండు చేపలు
వడి వెట్టుడు = మెలివేయడం, బాధ కల్గించడం
వడ్కలగ్గం = ఉపనయనం
వడ్డన = వడ్డింపు
వడ్పుడు (నీల్లు) = నీళ్ల, కన్నీళ్ళు కార్చడం
వడ్లు పెరుగు కల్పినట్లు అవుడు = పొంతన లేని కలయిక
వడ్లోల్లు = వడ్రంగులు
వత్ (దాని) = (దాని) వలె
వతన్ = మిరాసి ?
వద వద అవుడు (మస్తు) = వధ వధ కావడం, చంపినంత బాధ కలగడం
వదురుడు = వాగడం
వద్దంటె అద్దుకొని తినెటోడు = మూర్ఖుడు
వన్కలేదు జెన్కలేదు = వణకలేదు, తొణకలేదు
వన్కు పుచ్చుకునుడు = చలిపెట్టడం, భయపడడం
వన్నె = రంగు
వయ్యా = భయ్యా ( ఏందివయ్యా అట్లమాట్లాడుతవ్?)
వయ్యి = పుస్తకం
వరక్ కాయిదం (అ) = పాలిథిన్ పేపర్
వరపూజ = పెళ్ళికి ముందు వరునికి జరిగే పూజ
వరదక్షిణ = వరకట్నం
వరిపిండి = బియ్యప్పిండి
వరిరొట్టె = బియ్యప్పిండితో చేసిన రొట్టె
వరిసంది = రెండు ఇళ్ళ గోడల మధ్యన గల చిన్న సంది
వరుస జెరం = టైఫాయిడ్ ?
వర్గులు = ఎండబెట్టబడిన కూరగాయల ముక్కలు
వర్జెం = వర్జ్యం
వలపలిగిలక = 9 ఆకారంలో ఉన్న గుర్తు
వలపోత = అదే పనిగా వలవలా విలపించడం

వల్దు = తండ్రి
వల్పట = కుడివైపు
వల్ల = వలదు, వద్దు
వల్లిపోవుడు = వడలి పోవడం
వల్లు = జోస్యం, శకునం చూడ్డం
వశపడది, వశెం కాదు = సాధ్యంకాదు, వల్లకాదు, వశంకాదు
వసతి = సౌకర్యం
వసపిట్ట = వాగుడుకాయ
వస్తాద్ = గురువు
వస్త్రకాయిదం = వస్త్రగాలితం, వస్త్రంతో జల్లెడ బట్టడం
వాండ్లు = వాళ్ళు
వాకగాదు (నీకు) = సరిపోదు
వాకిలి తొక్కుడు = ఇంటికి రావడం
వాగొడ్డు = ఏటిగట్టు
వాచకం = తెలుగువాచకం
వాజీబు (అ) = తగినట్లు వుండడం
వాటం = అవకాశం, వీలు
వాటా = భాగం
వాడకట్టు = వాడ, వీధి
వాడె (చెరుకు) = చెరకుగడలు తీయగా మిగిలిన ఆకులు
వాన = వర్షం
వానకోయిల = చాతకం
వానో వరుపో = వానో కరువో ( తమిళంలో వరప్పు అంటే కరువు )
వాపస్ చేసుడు = తిరిగివ్వడం
వాము = వామి
వామ్మో = అమ్మో
వాయిగట్టుడు = గిన్నెమూత తీసి దానికి గుడ్డకట్టడం (గాలికి తగిలి ఆహారం చెడిపోకుండా వుండేందుకు), ( వాయి అంటే తమిళంలో నోరు )
వాయిలింపు = ఆవులింత
వాయిలు = దశలు ? సార్లు ? Rounds
వాయివరుసలు = వావివరుసలు
వాయ్యోవావ్వో = కుయ్యో, మొర్రో
వార్‌కట్టె = చెర్నాగోల, సెలగోల
వారవారం = ప్రతివారం
వారీ = ఒరేయ్
వాల్ = వాల్వ్
వాలాయించి = కావాలని, ఉద్దేశ్యపూర్వకంగా
వాలు = మొగ్గు, వంపు
వాసన బియ్యం = బాస్మతీవంటి బియ్యం
వాసర = బాసర, వ్యాసుని నెలవు
వాసరయ్య = వ్యాసుని పేరు
విడిదిల్లు = విడిది గృహం
వీండ్లు = వీళ్ళు
వీడు వాని తోక = వాడే వీడు, అచ్చం వాడిలాగే వున్నాడు
వుద్ది = ఆట జట్టులో సమఉజ్జీలేనప్పుడు అతని బదులు ఆటాడే జట్టు నాయకుడు
వెయ్యిగుల్ల పూజారి = వెయ్యింండ్ల పూజారి
వేములవాడ = లేంబాల వాటిక, ఒకప్పటి పశ్చిమ చాళుక్యుల రాజధాని
వైకు వైకుమనుడు = వాంతులు చేసుకోవడం
వైనం = వంక, పద్ధతులు, వాయనం
వైనాల మనిషి = ఆచారాల మనిషి, తప్పులెంచే మనిషి
వైపు = వాటం, ఉపాయం
వైరం = సరిజోడు, సరిగా కుదరడం మందు, విరుగుడు మందు
వౌశి, వైసు = వయస్సు

## శ

శంకు,శెంకు = కోటికన్న పెద్ద సంఖ్య, శంఖం
శకుని = భారతంలోని శకుని లాంటి వాడు, దుష్టుడు
శవార్తి,శెవార్తి = శరణార్థి, నమస్కారం
శనేశిరం = శనేశ్వరం, శని
శరం (ప) = సిగ్గు
శరాబ్ (ప) = సారాయి, సారా
శర్నం = శరణం
శర్నం లేదు = ధోకాలేదు, అపాయం లేదు
శాంతం పట్టుడు = శాంతించడం
శాకం = కూర, మాంసంకూర
శాత = సేవ
శాతన = వెట్టిచాకిరి, సేవ, చేతన
శాత్రం (శాస్త్రం) = సామెత మరియు పాదుపుకథ
శాత్రానికి = శాస్త్రానికి, మచ్చుకు

శాది = పెండ్లి
శాన = చాలా
శాన్ గొట్టుడు = గొప్పచూపడం
శాని అవుడు = రజస్వల కావడం
శానిగ = నాగరికంగా. నీటుగా
శానిమనుషులు = నాగరికులు
శాపం బెట్టుడు = శపించడం
శాబాష్‌బండ = నాపరాయి
శాయి = సిరా
శారెడు నీళ్లకు ఏడ్పుడు = ఉపాధికై వేదన చెందడం?
శాలె = పద్మశాలి
శావణమాసం = శ్రావణం
శావ / శేవ = సేవ (దేవునిది)
శికం బూములు = నీరు ఎండిపోగా మిగిలిన చెరువులోని భూములు
శికాయెత్ (అ) = ఫిర్యాదు, నేరారోపణ
శికార్ (ప) = వేట
శికురం = శిఖరం
శికె = సిగ
శికెం = శిక్యం
శిటశిట = అయిష్టం, గులగుట
శిడెం పడది = ఏమాత్రంపడదు, క్షణం కూడా పడదు అని
శితాలమోలె = శీతలంగా , చల్లగా,
శిత్పలపండు,శితవల్కపండు = సీతాఫలం
శిదగ్గొట్టుడు = బంగారం మొ॥ వాటిని చితక్కొట్టడం (కావలసిన రీతిలో నగలు చేయించుకోవడానికి )
శిదల్ శిదల్ అవుడు = సీతాఫలం టమాటాలు మొ॥ పళ్ళు బాగా పండి శిథిలమై పాడవడం
శిబ్బి = కుండలోంచి అన్నం వార్చడానికి అడ్డుగా ఉంచే వెదురుతో అల్లిన వస్తువు
శిమంత ,సిమంత = చీమంత ,కాసింత
శిమశిమ = వేసవిలో చెమటకాయలతో పెట్టేదురద
శిమాంట,సిమాంట = శివమాంట, శుభమా అని
శిరస్త = సంప్రదాయం, దారి ?
శిరిశెనగపప్పు = మైసూర్‌పప్పు
శిల్కనవ్వు = అందమైన నవ్వు
శిల్కోలె వుండుడు = చిలుకలా అందంగా వుండడం
శివసత్తి = పూనకం వచ్చిన భక్తురాలు, శివశక్తి
శివాయె = తప్ప. మినహా
శివారు = ఎల్ల
శీకులు = బావులు తవ్వే పెద్ద మేకులు, ధాన్యం బస్తాల్లోంచి మచ్చులు తీసే మేకులు
శీగుడ్డు = పొదగడానికి వేసిన గుడ్లలో పిల్లగా మారనిది, చివికిపాడైన గుడ్డు
శీమెండి = రాతెండి
శీర్క = చిన్నమడి, పొలం, దొయ్య
శీర్కలు శీర్కలు = చీలికలు పేలికలు
శీలం = శుచీ, సంప్రదాయం, నిష్ఠలు
శుండల్, సాండెల్ = గుగ్గిల్లు
శుక్రారం దేవమ్మ = ఒక గ్రామదేవత
శురు = ప్రారంభం (శురూ)
శురువు = శుచీ, శుభ్రం
శెంకిని, శెంకిలి = శంఖిని
శెంటెంమీద వెట్టుడు = లెక్కకు తీసుకొనక పోవడం, నిర్లక్ష్యం చేయడం
శెక = మంట, సెగ
శెకల్ (అ) = వాలకం, తీరు
శెక్కరచ్చుడు = కళ్లు తిరగడం, చక్కర్ రావడం. కళ్ళముందు చక్రంలా తిరగడం
శెక్కెర = చక్కెర
శెట్టాయిన = సేఠ్‌జీ, యజమాని
శెత్త బొక్కెనోలె అవుడు = చిక్కిశల్యం కావడం
శెద్ద = శ్రద్ధ
శెన = చేపలు మొ॥ వాట్లోని గుడ్ల సముహం
శెనగ పప్పు = పచ్చి సెనగపప్పు
శెనగపిండిల బియ్యం పిండి కల్పినట్లు = పువ్వుకు తావి అబ్బినట్లు
శెనాకత్ = వైద్యుడు, మొ॥ వారు పరీక్షించడం
శెబల్ = ట్రిబుల్
శెబ్బాష్ (ప) = సెబాస్, షహబాస్
శెమదర్మం = దయ, క్షమాధర్మం
శెరల వడ్డట్లు అవుడు = చెరలో పడ్డట్టు బాధపడడం
శెరీక్ = ప్రవేశం, అడ్మిషన్
శెర్తు (అ) = పందెం, బెట్టు, నిబంధన
శెర్తు మనిషి = పంతం, మొండిచేసే వాడు
శెర్తువట్టుడు = మరీ పరీక్షించడం
శెర్బత్ (అ) = నిమ్మరసం
శెల్ల = శాలువా,కండువా
శెవిన వెట్టుడు = చెవులొగ్గి వినడం

నలిమెల భాస్కర్

శేగ = శాఖ (సెక్షన్)
శేతాలం = చేతబడి
శేరుగొట్టుడు = కోడె వృషణాల్ని గుద్ది ఎద్దును చేయడం
శేరువటాకలు = దీపావళి టపాకాయల్లో గుదిగుచ్చినట్లు వుండే చిన్న చిన్న బాంబులు
శేవాలు = సేమ్యాలు
శోక్ = సోకు
శోబగవుంది = అందంగా, శోభాయమానంగా, వైభవంగా ఉంది.
శోర్వ = రసం, సూప్

## ష

షత్రంజీలు = జంపఖానాలు
షాటు = షాకు (Shock)
షామియాన (ప) = పెళ్లి మొ॥ ఫంక్షన్‌లలో నీడ కోసం వేసిన పెద్ద గుడారాల్లాంటిది, టెంట్
షాలు = శాలువా
షుక్రియా = కృతజ్ఞతలు
షుభా = అనుమానం
షెటాకులు = స్లిప్పర్ చెప్పులు

## స

సంక = చంక
సంకనాకిపోతడు = పాడయిపోతాడు
సంకపాపలు = చంకలో అయ్యే ఒకరకమైన పుళ్ళు
సంకలు = మధ్యఇంటిని ఆనుకొని కట్టిన ఇంటిభాగాలు (త్రిశాల,చతుశ్శాల భవంతులలో ప్రక్కభాగాలు)
సంకురాత్రి, సంకురాతిరి = సంక్రాంతి
సంగడి పట్టుడు = టర్ను పట్టడం
సంగతి = సమాచారం, విషయం సంఘటన
సంగీతం = వాలకం
సంగీతం బెట్టుడు = ఏడ్వడం
సంచకారి = Advance, సంచకరువు
సంచాలం = సంచారం
సంటిపిల్లను పోదన చేసినట్లు = చంటి పిల్లను పోషణ చేసినట్లు
సంటోడు = చంటబ్బాయి, చంటి
సండాస్ = అశుద్ధం, మలం
సంతటి = వంశం, సంతతి
సంతన = సంతానం
సంతర్పన పెట్టుడు = పంచడం, దానం చేయడం
సంత్రాలు = నారింజలు
సందం = దహనసంస్కారాలు
సందాన = మానాన,చందాన,(నా సందాన నేను పోతుంటె నువ్వు అడ్డమచ్చుడెందుకు?)
సంది = వీధి, సందు, నుండి
సందు = అవకాశం, వీలు
సందుల = (ఈ) మధ్య, (ఈ) నడుమ
సందుగ ,సందూక్ (అ) = పెట్టె
సందెకసువు = సందెవేళ ఊడ్చివేసే చెత్తచెదారం
సందెగదు తీనుడు = సందెవేళ గడవలు పూజించడం
సందెడు = రెండు చేతుల సందుల్లో పట్ట గలిగినంత
సందెన పడుడు = బావి గిరక మీంచి తాడు సందున పడిపోవడం
సందెలవడుడు = సందెవేళ కావడం
సంపతి = సంపద
స(సా)ంపర్దాయకం= సంప్రదాయకం
సంబందం = పెళ్లి
సంబందీకులు = బంధువులు
సంబడం = సంబరం
సంబావన = సంభావన
సంబురం = ఆనందం, సంబరం
స(సా)ంబ్రాలు = వరిలో ఒక రకం
సంసారం = కాపురం
సంసారి = పతివ్రత
సంస్కృతం మాట్లాడుడు = బూతు మాటలాడడం
సకినాలు = చక్కిలాలు
సకులం ముకులం = సకలం అన్నీ ముకుళింప చేసుకుని కూచొనడం, బాసికం పట్టు
సక్కంగ = తిన్నగ, చక్కగా, నేరుగా, అందంగా
సక్కనోడా ? = మంచివాడు కాదని అర్థం
సక్కదనం = అందం
సక్తు (ప) = బలవంతం
సగం కడ్పుకు తినుడు = అర్ధాకలి

సగజెప్పుడు = అర్థం చేయించడం
సగమవుడు (మనిషి) = కృశించడం
సగమీడుగద్దుడు = మధ్య వయస్కులై పోవడం
సగవల్కుడు = సమర్థించడం
సగవెట్టుడు = చక్కబెట్టడం, సర్దడం
సబగతి ముచ్చట = చెప్పగల విషయం
సచ్చిమూడు బుక్కల మన్ను బుక్కినా గని = ఎలాంటి పరిస్థితుల్లోనైనా అని
సబ్బినాడు / సబ్బిసాయిర మండలం = కాకతీయుల కాలంలో ఇప్పటి కరీంనగర్ జిల్లా ప్రాంతం
సచ్చెంగ = ధర్మంగా
సజ (సజా) = శిక్ష
సటసట = చకచకా
సట్టపోవుడు = చేను చట్టపోవడం,గింజలు పట్టకపోవడం
సట్టం = వంశం
సట్టం ఎక్కిచ్చుడు = ఇంటి నిర్మాణంలో చట్రం ఎక్కించడం
సట్టు = బరువు, సెట్టు (Set)
సడక్ = రోడ్డు
సడుగులు = కీళ్ళు, నడుం కీళ్ళు ,జాయింట్లు
సడేసాతోల్లు = ఏడున్నర సం॥ల శనిగాళ్ళు
సడ్డకుడు = తోడల్లుడు
సడ్డమాలిన పని = అక్కరకు రాని పని
సత్తి = బరువు
స(ప)తంత్రం = స్వతంత్రం,అధికారం (మిమ్ముల్ని అనే సపంత్రం ఉందా?)
సతాయించుడు = వేధించడం
సత్కుడు = చతికిలబడినట్లు నేల లోపలికి పోవడం
సత్కుసత్కుఅవుడు = పెరుగు మొ॥ సరిగా తోడు కోక నీరునీరుకావడం
సత్త = హక్కు, అధికారం, సత్తా ( నాకు ఆ సత్త వుండెపటికనే గద అంటున్న )
సత్తు గిన్నెలు = తగరం గిన్నెలు
సత్తు (పిండి) = స్వత్వపు (పిండి)
సత్తుముద్దలు = మొక్కజొన్న పేలాలు మొ॥న వాటి పిండితో బెల్లం నేయి కలిపి చేసిన ముద్దలు
సత్తువ = బలం
సత్తెనారాయన పూజ = సత్యనారాయణ వ్రతం
సత్తెనాశినం = సర్వనాశనం
సత్తెపూస = సత్యవంతుడు కాదని వ్యంగ్యంగా అనడం
సత్యం = మనం ఏదో మాట చెబుతుండగా ఎవరైనా తుమ్మితే వెంటనే సత్యం అంటారు అంటే తాము మాట్లాడింది నిజమని చెప్పడం
సదర్‌సాబ్ = పెద్ద అధికారి
సదరు = పొత్తు, ఉమ్మడి, ఫలానా,మొత్తం
సదాట్ల = ఉమ్మడిగా
సదర = చదరంగా వున్న చిన్న చాప
సదురుడు = సర్దడం (వర్ణ వ్యత్యయం)
సద్ది దిన్న రేవు తల్సుడు = కృతజ్ఞత ప్రకటించడం ( తిన్నయింటి వాసాలు లెక్కించకపోవడం )
సద్దుల బతుకమ్మ = తెలంగాణలోని బతుకమ్మ పండగ
సన్ = సంవత్సరం
సన్గుల్ = ఐటమ్స్
సన్నతులు = తాకీదులు
సన్నపు పని = ఫినిషింగ్ టచ్
సన్నపొదుకాడు = ఘటికుడు
సన్నాలు = చనుబాలు
సపా = చంపడం
సపాటకు సపాట వుండుడు = పటిష్టంగా వుందని చెప్పడం
సపాయోల్లు = వీధులూడ్చేవాళ్ళు
సప్టికట్లు = సర్టిఫికేట్లు
సప్ప = యాటలో తొడ మొ॥ కండపట్టిన భాగాలు
సప్పరిచ్చుడు = కొట్టడం
సప్పిడి కూడు = ఉప్పుకారం లేని చప్పిడి కూడు
సప్పుడు చేసుడు = పెళ్లిల్లో బాజాలు మొ॥నవి చప్పుడు చేయడం
సబ్జి = కూర
సబ్బండ వర్ణాలు = సమస్త జాతుల కులాల వాళ్లు
సబ్బు = సోపు
సబ్యాకు = చెవిపోటుకువాడే సబ్బిచెట్టు ఆకు
సమజవుడు = అర్థం కావడం
సమదనం = సంతృప్తి
సమరు = నూనె
సమర్త = రజస్వల
సముదాయించుడు = అర్థం చేయించడం. ఊరడించడం

నలిమెల భాస్కర్

సమ్తి = సవతి
సమ్మక్క సారక్క = తెలంగాణలో కాకతీయులకు వ్యతిరేకంగా కొట్లాడిన గిరిజన యువతులు, తల్లీకూతుళ్ళు
సమ్మచ్చరం = సంవత్సరం
సమ్మతం = అంగీకారం
సయ్ (నేను) = సిద్ధం, తయారు (నేను)
సయంగ = స్వయంగా
సరం = మూలవాసం ?
సరంజాము = సామాను
సరసర చెయ్యి ఆడిచ్చుడు = గబగబా చేయడం
సరస్పతి = సరస్వతి
సరాతం = పెంకమీది రొట్టెలు మొ॥ తీయడానికి వాడే సాధనం
సరానపడుడు, సరం పడుడు = పొలమారడం (స్వరంపడడం)
సరాయించుడు = గొంతు సవరించడం
సరింగ = సరిగా
సరికిసరి = వంటకాల్లో ఒకటికి ఒకటి పోయడం
సరింగ,సరిగ్గ = సరిగా
సరిదంటు = సమఉజ్జీ ,సరిజంట
సరిపొద్దు = మిట్టమధ్యాహ్నం , అర్ధరాత్రి
సర్కారు (ప) = ప్రభుత్వం
సర్కారు నవాలు = వేలం పాటలో మొదట నిర్ణయించిన మొత్తం
సర్కారు తుమ్మ = పట్నం తుమ్మ
సర్కారు బాయి = ఊరబావి
సర్కారు ముల్లె = పెట్టుబడి, మూలధనం
సర్గం = స్వర్గం
సర్దారు = రాజు
సర్ది = జలుబు,రొంప
సర్పించుడు (గొడ్డలి) = కొలిమిలో పెట్టి గొడ్డలిమొదలయిన వాటినిచరిపించి పదును పెట్టించడం
సర్హద్దు = సరిహద్దు
సర్రన = వెంటనే, త్వరగా
సర్రసర్ర = త్వరత్వర
సర్రాసుగ = చక్కగా, నేరుగా
సర్వపిండి = గిన్నె లోపల చుట్టూ బియ్యపు పిండి మెత్తి వండినది
సర్పుడు = చరవడం, కొట్టడం
సలాం = నమస్కారం
సలాకలు = కటకటాలు, ఊచలు
సలిపిడుగు మీద వడ్డట్లు పడుడు = అశనిపాతం
సలువ గల్ల ఊరు = ఆశ్రయం యివ్వగల ఊరు
సలువలు వచ్చుడు = అదే పనిగా పనిచేసినప్పుడు బాలెంతల ఒళ్ళు చల్లనవడం
సల్ప = వెడల్పుగా సన్నగా చీలదీసిన తల్పంలాంటి రాయి
సల్ల = మజ్జిగ
సల్లజెమ్మటలు పోనుడు = ముచ్చెమటలు పోయడం
సల్ల మిర్పకాయలు = చల్లలో ఊరవేసిన మిరప కాయలు
సల్లగుండ (కడ్పు) = చల్లగా వుండనీ (కడుపు)
సల్లపులుసు = చల్లలో కారం, ఉప్పు, పసుపు వేసి తాలింపు చేసినది
సల్లపూట = పొద్దుటిపూట
సల్లు = జల్లు
సల్లుబిగి = పట్టువిడుపులు (సడలు బిగి)
సల్వపెయ్యి = చల్లని శరీరం
సవసవ = జ్వర సూచన
సవారి కచ్చురం =ఎడ్లబండే కాని సవారీ చేయడానికి వీలుగా వుండేది
సవార్లు (ఎన్ని) = త్రిప్పలు, మనుషులు
సవాలు = ప్రశ్న, సమస్య
సవ్వసేరు = 350 గ్రాములు
సస్కాని = డబ్బు
సస్త, (సస్తా) = చవక
సహి (అ) = సై, సత్యం
సాంగీక = సాంఘిక శాస్త్రం
సాంచె = నమూన, బెల్లం మొ॥ వాటి మూస
సాంతం = మొత్తం
సాక = (మద్రి) ఆకుతో కల్లు తాగడం
సాకరి = చాకిరేవు
సాకిన్ = నివాసం
సాగ,శాగ = చేగ, చేవ
సాగదోలుడు = బంధువులను మొ॥ వాళ్లను పంపించి రావడం, వీడ్కోలు
సాగిచ్చుకునుడు = తనమాట, పని మొ॥వి చెల్లించుకోవడం
సాజీర = జీలకర్ర లాంటి దినుసు
సాటిచ్చుడు = దండోరా వేయడం

సాటు = చాటు, మరుగు
సాటుమార్గంగ = రహస్యంగా
సాత్‌యిచ్చుడు = సహకరించడం, అనుకూలించడం
సాతాన = ఏడణాలు
సాతాని = చాత్తాద వైష్ణవులు
సాదా (కాయిదం) = తెల్ల (కాయితం), సామాన్యమైన
సాదనాశూరులు = ఇంద్రజాలం వంటి విద్యలు ప్రదర్శించేవారు(పద్మశాలీలను ఆశ్రయించేవారు)
సాదసీద = నిరాడంబరం
సాది సవరచ్చున చేసుడు = పోషించి సంరక్షించడం
సాదుడు = పోషించడం
సాద్కంకోల్లు = పెంపకపు కోళ్ళు
సాన్పు = కళ్లాపి
సాపశింపు = చిరిగిన చాప, చింకిచాప
సాపాటు = తిండి, భోజనం
సాపుగా (అ) = నున్నగా, పరిశుభ్రంగా
సాపెన = శాపనార్థాలు
సాఫ్‌సీద = నిక్కచ్చిగ, సరిగా
సాబ్ (అ) = గారు ( సాహెబ్ నుండి వచ్చింది )
సాబ్దానాలు = సగ్గుబియ్యం
సామనలుపు = చామనఛాయ
సామాండెం = సామాన్యం
సామాను = వృషణాలు
సామాన్య = సామాన్యశాస్త్రం
సామాన్లు (ప) =సరుకులు
సాయం = సహాయం
సాయపప్పు = వేయించని పెసర మొ॥న పప్పు
సాయమాను = ప్రధాన గృహానికి అదనంగా వేసినది, వసారా,వంటశాల
సాయిత = స్నేహం
సాయిత్యం = స్వయంపాకానికి ఇవ్వడం
సాయిసుతం = శాశ్వతం
సార్ = మాస్టారు
సారంగి = సంగీత వాయిద్యం
సారపల్కులు = మొర్రి పళ్ళ గింజల్లోనివి
సారమ్మ = పంతులమ్మ
సార్కలు = చారలు (పులి)
సార్గం = వంటపని, అంట్లపని
సార్వీసు = సర్వీసు (మోటారు)
సాలన్ కడాలు = కాళ్ళ కడియాలు
సాలా మూలా ? = పద్ధతా పాడా ?
సాలు=నాగేటి చాలు, సంప్రదాయం, పద్ధతి
సాలు (ప) = సంవత్సరం
సాలెగాడు = బావమరిది
సాల్లె = బడి, పాఠశాల, శాలె ( కన్నడం )
సావసావ గొట్టుడు = చావగొట్టడం
సావాసం = సహవాసం
సావుచేసుడు = చాలా కష్టపెట్టడం
సావుకారు = సేటు
సావుదల = అవసానదశ
సావుబతుకులపని = సత్ఫలితమియ్యని, కానిపని
సావుబతుకులోడు = కొరగానోడు
సావుమర్నం అవుడు = చచ్చినట్లు కావడం, చాలా యిబ్బంది కావడం
సింగారం , సుంగారం = శృంగారం
సింగిడి = ఇంద్రధనుస్సు, శింజిణి
సిందుమాదిగలు = చిందులు తొక్కుతూ నాటకాలు వేసే మాదిగలు
సికెల్ సికెలు పట్టుకునుడు = కేశాకేశిగా కొట్లాడ్డం, సిగపట్లు పట్టడం
సికిలేటు = సిగరెట్టు
సిగం = పూనకం, (శివంలోంచి వచ్చింది)
సిగ్గ = మొహమాటం
సిటపాటలు = కొట్లాటలు
సిట్కున = వెంటనే
సిడీలు = మెట్లు
సితం = చాలా
సితపతాల్లం = చాలాలోతు ( సుతల పాతాళాలు లేదా శీతల పాతాళాలు )
సిద్ధోగం = సిద్ధియోగం
సిన్న బతుకమ్మ = దుర్గాష్టమినాడు పెద్ద బతుకమ్మతో పాటు పేర్చేది
సిపాయి కఱ్ఱలు,ఉపకారి = బండి పోలుకింద పెట్టే కఱ్ఱలు, మూడుకాళ్ళుఉన్న దుంగ (జాకీవంటిది)
సిపాయి (ప) = మొనగాడు
సిమ్టి = సిమెంటు
సిమ్మటిల్లుడు = చెమ్మగిల్లడం, తేమ రావడం
సిరంగి / సిరంగం = శ్రీరంగం
సిరఫ్ (అ) = కేవలం
సిర, సిరా = రవ్వకేసరి, అల్వా (హల్వా)
సిరి = సంపద
సిరిసిల్ల = శ్రీశాల, సిరిసిల్ల

సిర్ర (దప్పు) = దప్పు మీది కర్ర
సిర్వంతం = ఐశ్వర్యం (సిరిమంతం కావడం)
సిలక్ = మిగులు, బ్యాలన్సు
సిలేటు = స్లేటు
సిల్ల = పండుల్ని పొడిచే సాధనం
సీటి = సీటు (బస్సు మొ॥ వాటిది)
సీడు = హైబ్రిడ్
సీతమ్మ చీర ఆరేసుకుంది = ఇంద్రధనుస్సు ఆకాశంలో వెలిసినప్పుడు ఆ రంగుల్ని చూసి ఇలా అంటారు
సీతరామచిట్టీలు = కాపీ కొట్టడానికి చిన్నగా రాసుకున్న చీటీలు
సీద (సీదా) = నేరుగా, చక్కగా
సీపుత్రుడు = శ్రీపుత్రుడు, (చెడు అర్థంలో)
సీమంతం = ఐశ్వర్యం, శ్రీమంతం
సీముపోసుడు = చీము పట్టడం
సీల = మేకు
సీసవక్కలు = గాజుముక్కలు
సుంచుకొనుడు = తుంచుకోవడం
సుంట = శుంఠ (తల్పంలోంచి సల్ప వచ్చినట్లు ఈ 'సుంట' తుంట లోంచి రావచ్చు. తుంట, మొద్దు అంటారు కదా ! )
సుండు = దుండు
సుండెలుక = చుంచెలుక
సుంది = నుండి
సుకోషి పానం = సుస్నితప్రాణం, సుఖానికి అలవడిన ప్రాణం
సుక్కదెగిపడ్డట్టు = అరుదుగా,ఉల్కాపాతంలా
సుకూన్‌గ = సుఖంగా, హాయిగా, సుస్నితంగా
సుక్కోలె వుంది = చాలా అందంగా చుక్కలా ఉంది
సుచ్చు = మీట ( Switch )
సుట్టబట్ట = బరువు మోస్తున్నప్పుడు తలమీద గుండ్రంగా చుట్టి పెట్టుకునే గుడ్డ
సుట్టాకులు = మోదుగాకులు, చుట్టలు చేసు కోవడానికి ఉపయోగించే ఆకులు
సుట్టి,సుట్టు = చావుకి చెందిన అశౌచం,సూతకం
సుట్టు గిరాయించుడు = చుట్టుముట్టడం
సుట్టుపక్కలోల్లు = ఇరుగు పొరుగు
సుట్టు పెట్టు,సుట్టుముట్టు = చుట్టు పక్కలా
సుడిగాడ్పు = సుడిగాలి
సుడిజుట్టుకునుడు = సుడిలో చిక్కుకున్నట్లు బాధలమయం కావడం
సుడిమీదుండుడు = పశువులు పొట్టతో వుండడం
సుత, సుతికె = కూడా ( సహితంలోంచి వచ్చింది )
సుతారి = మేస్త్రి, తాపీమనిషి
సుతులుగల్సుడు = శ్రుతులు కలవడం (ఆధునిక పరిభాషలో wave length కలవాలనీ, tune up కావాలనీ అంటున్నాం )
సుత్తి = స్తుతి
సుత్తె = సుత్తి
సుత్లాయించుడు = సవరించడం, కుదురుకోవడం
సుత్లి, సుత్ని, సుత్లిపొట్టె = పురికొస
సుదురాయించుడు = తోచడం
సుద్ద = ముగ్గు వేయడానికి వాడే సున్నపుపొడి
సుద్దమొద్దు = శుద్ధమైన మొద్దు అనీ ఏమీ రాని మందబుద్ధి అనీ అర్థాలు
సుద్దకట్టునీల్లు = బావి నీళ్లలో సుద్ద కలిసి వున్న నీళ్లు
సుద్దపూస = శుద్ధమైనవాడు ( వ్యంగ్యార్థం )
షుద్దరోల్లు,సూదరోల్లు = శూద్రులు
సునేర్ = సున్హారా.. బంగారు రంగులో వున్న మెరుపు పొడి
సునో = స్నో
సునోత్రం = సుస్నితం
సున్నం ఏసుడు = వెల్లవేయడం
సున్నతులు = సున్నీలు
సుప్పనాతి = శూర్పణఖ
సుబూత్ (అ) = సాక్ష్యం
సుబ్బ , సుబ్బన్న = సుబ్బరంగా తెలివిలేని వాడు
సుర్ సుర్ బానాలు = కాకరొత్తులు
సురసుర అనుడు (కడ్పుల) = ఆకలి కావడం
సుర సుర కాలుడు (కాళ్ళు) = ( కాళ్ళు ) కాలడం
సురాయి = కూజా
సురుకు దల్గుడు = కనువిప్పు కల్గడం
సురుకేసుడు ,సురుకులేసుడు = వాతలు పెట్టడం, వేసవి కాలంలో మూత్రం మంటగా రావడం, వచ్చినట్లు అనిపించి రాకపోవడం
సుర్మ = కాటుక
సుర్మ (ప) = పెన్సిల్
సుర్రుమనుడు = కాలడం, ఆకలి కావడం
సులీషన్ = అతికించడానికి వాడే సొల్యూషన్

సులుక్కుమనుడు = చురుక్కుమనడం(ముల్లు కుచ్చినప్పుడు చీముపోసి సులుక్కు సులుక్కు మంటుంది)
సుల్కుజరిగె = చురుక్కుమనిపించే సన్నటి బెత్తం
సుల్తాను = రాజు
సువ్వ = తోషన్
సువ్వర్ = ఒక తిట్టు - పంది అని అర్థం
సుస్తు, సుస్తి (సుస్తీ) = అనారోగ్యం
సూచాయగ = చూచాయగా
సూటర్ = స్వెట్టర్
సూటి = గురి
సూటిగ = పరీక్షించినట్లు, సరిగా, కావాలని,చక్కగా
సూటివెట్టుడు = లైన్ వేయడం
సూడసక్కదనం = అందం, సౌందర్యం
సూడిది = గర్భంతో వున్న పశువులు,మేక,గొఱ్ఱె మొ॥నవి
సూత్‌మార్కాన్ = పెద్ద మొనగాడు
సూత్కం = మృతశౌచం
సూది = ఇంజక్షన్
సూదిని ముల్లెగట్టినట్టుండెటోడు = అసాధ్యుడు
సూన్యంజేసుడు = లెక్కలోకి తీసుకొనకపోవడం
సూరత్ = పరిస్థితి
సూరు (కొబ్బరి) = చూర్ణం
సెంచెత = చెంచెత (దుడుకు స్వభావం గల స్త్రీ అని చెప్పడం )
సెగడి = బొగ్గుల కుంపటి
సెడువాకం = చేటు
సేకడా = వంద ఒక్కంటికి
సేంది = కల్లు
సేటు = 1 యజమాని, 2 శెట్టి (కోమటి)
సేదురుబాయి = చేదబాయి
సేపులు (ప) = సీమరేగుపండ్లు, అపిల్స్
సేపోయి = చేబదులు
సేరు = ఒకకొలత
సైండీలు = బూట్లలాంటి ప్లాస్టిక్ చెప్పులు, Sandals
సై ఉండుడు (పిల్ల) = చక్కగా ఉండడం
సైతాన్ (అ) = దయ్యం
సైనాట్ సంకలపాప = చంకలో పాప వుందని ఆటనియమం పాటించలేనని చెప్పడం(పిల్లల ఆటల్లో)
సైమం = సమయం
సైర = సైగ
సైర మీదుండుడు = స్పృహలో వుండడం ( తాగినప్పటికి )
సైర్ (అ) = వాహ్వాళి
సైరమీదుండెటోడు = కనుసన్నల్లో వుండేవాడు
సైసడు = ఇష్టపడడు, సహించడు
సైసు = సైచు, సహించు, ఆగు
సైసూసుడు = చవిచూడడం
సొంగకారుడు = చొంగకారడం
సొంటి = శుంఠి
సొచ్చుకచ్చుడు = చొచ్చుకురావడం
సొచ్చుకపోవుడు = చొరవగా వెళ్ళడం, కలిసిపోవడం
సొజ్జె = కజ్జికాయల్లో నింపే పదార్థం
సొట్టవడుడు = గుంతలు వడడం (బిందెలు, చెంపలు, కాళ్ళు మొ॥ వి సొట్టవడడం )
సొడసొడలు పోవుడు = అలసిపోవడం
సొడ్లు = తిట్లు
సొన్నాయి = సన్నాయి, షహనాయి
సొన్నారి రోగం = పెదాలు పలిగే పుళ్ళు
సొన్నారోల్లు = స్వర్ణకారులు, కంసాలులు
సొప్పున = పద్ధతిన, రేటున, చొప్పున
సొమ్మ = మూర్ఛరోగం ( సొమ్మసిల్లడం - ఈ సొమ్మలోంచి వచ్చిందా? )
సొమ్ములు = నగలు
సొయి, సోయి = స్పృహ, స్వీయమైనది
సొరంగం ఏసుడు = చేతులు ముందుకు అనించి ఎత్తు ప్రదేశం నుండి అధోముఖంగా బావి నీళ్లల్లోకి దూకడం
సొరంగం పెట్టుడు = బావుల్లోని రాళ్లను తొలచడానికి పేలుడుమందు పెట్టడం
సొరగాన్ = ప్రధాన ద్వారపు తలుపులు వేసినాక అడ్డుగా ఉంచే కర్ర
సొర్రుడు = చొరడం, ప్రవేశించడం
సొర్రుదల (ఊరు) = ఊరి ప్రవేశం
సొల్గుడు = తూలడం
సొల్లు = జొల్లు
సోంచాయించుడు = ఆలోచన చేయడం
సోంపు = సోపు (త్రివేది)
సోకం బెట్టుకొని ఏడ్సుడు = అదేపనిగా ఏడ్వడం

సోకనాలు పెట్టుడు = శోకాలు పెట్టడం
సోకుల గిర్క = వన్నెల విసనకర్ర
సోకులు = షోకులు, స్టైల్స్
సోగి = పచ్చళ్ళు పెట్టేటప్పుడు మామిడికాయలు మొ॥ ముక్కలు కల్పడానికి ముందుగా వేయించిన కారం. నువ్వులు,ఎచ్చాలు, మొ॥ వాటి పొడులతో కలిపిన మిశ్రమం,మామిడిపచ్చళ్ళలో ఒకరకం
సోడు, సోలెడు = తవ్వలో సగం
సోడెలాగులు = మోకాళ్ళవరకు ఉండే నెక్కర్లు, షార్ట్స (చౌడా = వెడల్పు)
సోదిచ్చుకచ్చుడు (పొక్కలికెల్లి) = శోధించుకు రావడం
సోద్యం చేసుడు = వింత, చోద్యం చేయడం
సోపతి = స్నేహం
సోపతిగాళ్ళు = స్నేహితులు
సోపాల = బడి
సోమిడి = ఒక రోగం
సోరపిల్లగాడు = పడుచుపిల్లవాడు
సోరసోరగాండ్లు = యువకులు
సోల్తి = లంకె, సంబంధం, ఆరా, కూపీ
సోల్పూత = వరుసగా, 'క్యూ' మాదిరి
సోసచ్చి పడుపోవుడు = శోషవచ్చి పడిపోవడం
సౌ = వంద
సౌట = చవట, గొడ్డుతనంగల, బక్క పలుచని
సౌటగాడు = చవట, చవటాయ
సౌడు = చవిటిమన్ను
సౌరం = క్షవరం : ఆడవాళ్ళు వెంట్రుకలతో కలిపివేసుకునేది
సౌలత్ = సౌకర్యం, వసతి
స్తానం = స్నానం



